





# మహిళలు

## జీవిత చరిత్ర,ధర్మాలు

# వీరాంగనలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.

# వీరాంగనలు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే విరచితము.

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచే

ప్రకటితము.

1924.

# పీఠిక.

"వీరాంగనలు" అను నీగ్రంథమును తొలుత వీరపూజలో నొకటి రెండు భాగములుగాఁ బ్రకటింపఁ దలఁచితిని; గాని వీరపురుషుల చరిత్ర లన్నియు ముగియుదనుక స్త్రీల చరిత్రములను ప్రకటించుట కనువుపడదని తోఁచుటవలన ప్రత్యేకగ్రంథముగ ప్రకటించుచున్నాను.

ఆంధ్రదేశమున నిపుడు నవ్యనాగరికతకై ప్రయత్నములు జరుగుచున్నవి. ఈయుద్యమమునకుఁ బ్రాణముపోయుట గ్రంథకర్తలకు విధి. ఈగ్రంథరచనమున, స్త్రీలకు వలయు పాఠ్యగ్రంథములు లేని లోపము దీర్పుట నాసంకల్పము. ధైర్యసాహసములయందు పురుషుల కెంతమాత్రమును దీసిపోని పూర్వస్త్రీల చరిత్రములు ప్రకృతపుటాంధ్రస్త్రీలకు అవశ్యపాఠ్యములు.

సంఘోన్నతి కాధారము స్త్రీలు గాని పురుషులు గారు. ఒక్క స్త్రీ నుద్ధరించిన నొక్క కుటుంబము బాగుపడును. అపుడు పురుషుల సత్ప్రయత్నములు సాగును. కార్యశౌర్యము వర్ధిల్లును. సంఘసంస్కార మపుడు హుటాహుటి నడకలతో జరుగును. మన యుద్యమ మపుడు ఇనుపపట్టాలమీఁదఁ బరువెత్తును. ఇపుడు పంకిలపథమున నున్నది.

భారతసంఘమున కృత్యవిభాగము ఇప్పుడు చాల చెడిపోయి యున్నది అగుటనే స్త్రీలయెడల ననాదరము. భారత

జాతి స్త్రీలను త్రొక్కివేసి తాను పడిపోయినది. మఱల నది శౌన్నత్యము నందవలెనన్న స్త్రీల నుద్ధరింపవలదా? కాని యాంధ్ర దేశమున నిప్పుడు ఆ ప్రయత్నములను గానము. స్త్రీలను విడిచి పురుషుల నిమిత్త మెంత ధనము నెచ్చించినను అది వ్యర్థము. ప్రాణము వోసి శక్తినిఁ గలిగింపకున్న నేమి ప్రయోజనము? స్త్రీ శక్తిస్వరూపిణి. స్త్రీసాయము లేని దే పురుషునకు మున్ముందు కాలు సేతులే యాడవు. మనము స్త్రీల నడఁచివేసినాము; గాని స్త్రీలయందుఁగల శక్తి నెవరు చంపఁగలరు? సభలలో మాటలు చెప్పుటయే; గాని నిజముగా నేపురుషుఁడు ఇంట స్త్రీలకు వ్యతిరేకము సేయఁగలుగుచున్నాఁడు? పురుషుఁడు త్రోచిన త్రోపునకు స్త్రీపడిపోయినది. అయినను ఆమె చేయి పట్టుకొని లాగి పురుషునే ముందు పడఁద్రోసినది. నవశక్తి సంఘటించి మనచే ఘనకార్యములు చేయింపవలసిన స్త్రీ నేఁడు ఉత్సాహభంగము గావించి కాలుసేతులకు సంకెలలు తగిలించి జీవచ్ఛవములను గావించుచున్నది; గాని మనకు కార్యశూరత్వము లేకపోవుటకు కారణ మిది యని మనము గ్రహింపఁజాలకున్నారము.

ఈగ్రంథమును జదివిన యాంధ్రసోదరీమణులకు ధైర్యసాహసము లలవడు నని నావిశ్వాసము. స్త్రీల జీవనమార్గముల నిదియొక్కటే బాగుచేయు నని నేను చెప్పుట లేదు. స్త్రీ రాణివాసమున బంధింపఁబడు బొమ్మ కాదని తెలుపుట ముఖ్యావశ్యకము. ఈగ్రంథమువలన ప్రయోజనము సిద్ధించును. ఇది నెఱవేఱినచో నాప్రయాస సఫలము.

ఇందు మల్లమ, ఖడ్గతిక్కనభార్య, మున్నగు ఆంధ్ర స్త్రీల చరిత్రములను, శికందరుబేగము మున్నగు మహమ్మదీయాంగనల జీవితములను, సంయుక్త మున్నగు తక్కిన భారతాంగనల చరిత్రములను కీర్తించితి.

ఈగ్రంథరచనమున నేను హిందూదేశకథాసంగ్రహము, ఆంధ్రుల చరిత్ర, పెద్దాపురసంస్థానచరిత్రము, అబలాసచ్చరిత్రరత్నమాల అను గ్రంథముల సాహాయ్యముఁ బొందితిని; గావున తద్గ్రంథకర్తలకు కృతజ్ఞుఁడను.

మహేంద్రవాడ. ఇట్లు విధేయుఁడు,
సిద్ధార్థిశ్రావణపూర్ణిమ శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రి.

# విషయసూచిక.

# 1. రుద్రమదేవి.



ప్రతాపమహితుఁ డగు కాకతిగణపతిదేవ చక్రవర్తి యోరుగంటి సింహాసనము నధిష్ఠించి ప్రజారంజకముగఁ బరిపాలనము సాగించుచుండెను. శివదేవయ్య యను ఆరాధ్యుఁడు ఆతనికి మహామంత్రియై మంత్రరక్ష సేయుచు సకలవిధముల నౌన్నత్యము సంఘటించుచుండెను. ప్రజ లందఱు నాతని యేల్బడిలో నేలోపమును లేకుండ సకలసుఖములు ననుభవించుచుండిరి. గణపతిదేవునకు రుద్రమ్మ గణపమ్మ అను నిరువురు కొమార్తలు గలిగిరి. పుత్రులు జనింపలేదు.

అయినను కుమారులకంటె కొమార్త లేవిధమునఁ దక్కువ? భారతసంఘమున కృత్యవిభాగమునఁ గొన్ని పొరబాటులు ఉన్నవి. అగుటచే స్త్రీలయెడల ననాదరము. మన వారికి నలుగురు కుమారులు కలిగినఁ గలుగు నానందము నలుగురు కొమార్తలు కలిగినఁ గలుగదు. ఆనందము లేకుండినను మానె విచారము లేకున్నఁ జాలు ననుకొందమన్న ఆఁడు పిల్ల పుట్టె ననినవెంటనే రోదనము ప్రారంభించిన స్త్రీలను బురుషులనుగూడ నదృష్టవశమున మేమెఱుంగుదుము. ఏల యీదుఃఖము?

"కుమారునికంటెఁ గొమార్త యెట్లు తక్కువ?" ఈ ప్రశ్నకు గణపతిదేవుఁడు "తక్కువ కాదు. ఎక్కువయే" యని సమాధాన మిచ్చెను. కావుననే యాతఁడు పుత్రులు లేనందు

లకు వగవలేదు. రాజులు కుమారుల కెట్టి విద్య నేర్పింతురో గణపతిదేవుఁడు రుద్రమ్మకును గణపమ్మకు నట్టి విద్యలే నేర్పించెను. ఇరువురునుగూడ మంత్రతంత్రములయం దసాధారణ ప్రజ్ఞ సంపాదించిరి. రణతంత్రమున సైతము అపారపాండిత్యము నార్జించిరి. తండ్రి యనంతరము శివదేవయ్యయే మహామంత్రిగ రాజ్యభారమును వహించి రుద్రమ్మ పట్టాభిషిక్తురాలయ్యెను. అప్పటికే యామెకు ముమ్మడమ్మ రుయ్యమ్మ అనునిరువురు కొమార్తలు కలిగిరి.

ఓరుగంటి సామ్రాజ్యమున అనేకసామంతప్రభువులు ఉండిరి. వారిలోఁ జాలమందికి స్త్రీకి అంకితులై యుండుట అవమానకరముగాఁ దోఁచెను. అందఱును కుట్రలు ప్రారంభించిరి. వారికి దేవగిరిరాజు బాసటయై నిలిచెను. ఇఁకఁ గావలసిన దేమున్నది? యుద్ధసన్నాహములు ప్రారంభ మయ్యెను.

స్త్రీ యధికారము వహించుట పురుషునకుఁ గిట్టదయ్యెను. భారతసంఘమున స్త్రీకిఁగల స్థానము కేవలము హీన మని తెలుపుట కింతకంటె నేమి సాక్ష్యము కావలెను? "స్త్రీ దాస్యమునకై పుట్టినది. పురుషుఁడు ఏలుటకై జన్మించెను." ఈ నమ్మకము భారతీయుల హృదయమునందు పాదుకొనిపోయినది. ఇంతియ గాదు. భారతీయుఁడు స్త్రీహృదయమునఁ గూడ నిట్టి నమ్మకమునే పాదుకొలిపెను. ప్రణయముగ్ధ యగు రమణిని వంచించుటలో భారతీయుఁ డెంతయో చాతుర్యమును ప్రదర్శించెనుగాని యాతఁ డీయసాధారణకృత్యమునకుఁ బొందిన ప్రతిఫల మేమి? ఈ ప్రశ్నమునకు సమయశాంఖికుఁడు ఇచ్చిన

ప్రత్యుత్తరము హిమాలయపర్వతగుహాలయందు "అధఃపత
నము, ఆత్మవినాశము" అని ఆమ్రేడిత మగుచున్నది.

ఇట నోరుగంటిలో గణపతిదేవచక్రవర్తి దివికేగిన సంవత్సరమునందే అట దేవగిరిలో యాదవప్రభు వగు కృష్ణభూపతి కాలగతుఁ డయ్యెను. ఓరుగంటిలో గణపతి కొమార్తె రుద్రమయు, దేవగిరిలో కృష్ణభూపతి తమ్ముఁడు మహాదేవరాజును రాజ్యారోహణము గావించిరి. గాని రుద్రమ అన్యచింతలు మాని పరిపాలనము సేయుచుండఁగా మహాదేవరాజు ఆత్మస్తోత్రములు ప్రారంభించిరి, ఆతఁ డెప్పుడును స్త్రీలను, శిశువులను జంపి యెఱుఁగఁడు. "ఇది వినియుండుటచే నాంధ్రులు ఆఁడుదానిని, మాళవులు శిశువును గద్దె నెక్కించిరి; అని యాతఁడు ప్రగల్భములు కొట్టఁజొచ్చెను. ఆతని యాస్థానకవులు ఈవిషయమునే చర్వితచర్వణముగ ఛందోబద్ధము గావింపఁజొచ్చిరి. వందిమాగధులు మేలుకొలుపులపుడు సైతము ఈ విషయము నుద్ఘాటింపఁదొడఁగిరి.

అచిరకాలమునందే ఈవార్త ఓరుగంటిలో కొనలు సాగెను. ప్రసాదాదిత్యనాయఁడు మున్నగు రాజరక్షకులకు ఇది వినవచ్చెను. జన్నిగదేవమహారాజు మున్నగు సేనాధిపతుల చెవులయందుఁగూడ నిది పడెను. శివదేవయ్యప్రముఖులగు మంత్రులకును చక్రవర్తినికినిఁగూడ నిది వినవచ్చెను. అందఱకును శౌర్య ముద్రేకించెను; గాని వారందఱునుగూడ "ప్రతాపలవదుర్విదగ్ధుఁడు" అని యాతని యెడల నౌదాసీన్యము వహించిరి. ఈసమయమునందే యోరుగంటి మాండలికులు కొందఱు "ఆఁడుదాని పాదములకు మ్రొక్కుట మాకు వల

వంపులుగా నున్నది.” అని విన్నవించుకొని దేవగిరికిఁ బోయి క్రొత్తవాని కాళ్లకు మ్రొక్కి “మాకీవిపత్తు తప్పింపుము” అని ప్రార్థించిరి. మహాదేవరాజు ఉబ్బిపోయి వారికి అభయ మిచ్చెను; గాని “తొందరపడవలదు. సమయము రానిండు” అనికూడ చెప్పెను.

హరిహరదేవుఁడు మురారిదేవుఁడు నను సామంతులు సమయము వచ్చునంతవఱకు నుండఁజాలకపోయిరి. “ఈలోపుగా మనకుఁ జేతనైనంత పనిఁ జేయుదము” అని వారునిశ్చయించుకొనిరి. వారు తొందరపడినట్లుగనే యొక సమయము వచ్చెను. రుద్రమ తన కొమార్త యగు ముమ్మడమ్మకుఁ బుత్రసంతతి నభిలషించి వడ్డెపల్లె కరిగి బుద్ధగణపతి నారాధించి యక్కడనుండి ఏకవీరామహాదేవినిఁ గొలుచుటకు మొగలిచెర్లకుఁ బోయెను. ఈవార్త హరిహరునకును, మురారికిని దెలియవచ్చెను. తోడనే వారు తమకుఁ గల సైన్యముతో మొగలిచెర్లకుఁ బోయి ముట్టడించిరి. వచ్చిన విపత్తున కడలక రుద్రమ్మ ధైర్యము వహించి తనవెంటవచ్చిన పరివారమునకుఁ బోరుటకు సెల విచ్చి ఉభయసైన్యములును సంకులసమరమున మునిఁగియుండఁగా కొమార్తతో వచ్చి ఓరుగల్లుచేరుకొనెను. చక్రవర్తిని తప్పించుకొనిపోయె నని విని శత్రువులు తహతహపడుచుండఁగా రుద్రమదేవి సైన్యము నంపి వారిని జయించి వారి ఆస్తులు అన్నియు వశము చేసికొని యాధనముతో పద్మాక్షీదేవికి మహోత్సవములు చేయించెను. మురారియు, హరిహరుఁడును ఆఁడుదాని సైన్యములను జయింపఁజాలక తొల్లిటి

పరాభవమున కిది తోడుపడు నని తలంచి వీరస్వర్గమునకుఁ బోయిరి.

ఈవార్త వినుటతోడనే మహాదేవరాజు "ఇఁక జాగు సేయరా" దని యూహించి సైన్యమును వృద్ధిసేయఁజొచ్చెను. ఇది విని రుద్రమదేవి "ఇఁక నౌదాసీన్యము పనికిరా" దని యూహించి దుర్గమును బలపఱచుటకుఁ బ్రారంభించెను. ఆమె తొలుదొలుత ఓరుగల్లు చుట్టును కంపకోట కట్టించెను. దానికి లోపల మట్టికోటయు, మట్టికోట చుట్టును అగడ్తయు నేర్పఱిచెను. భూమికోటకు గవనులు ఎనిమిది; దిడ్డు పదునెనిమిది. పుట్టకోటకు గవనులు నాలుగు; దిడ్డు ఎనిమిది. రాతికోటకు గవనులు నాలుగు; దిడ్డు ఎనిమిది. రాతికోటకు లోతట్టున రాతిమెట్లు పెట్టించి రుద్రమ అలంగముమీఁదబంధువులలోని విక్రమోత్కృష్టుల నుండ నియమించి తక్కినవారిని ఇటుకకోటలో నుండునట్లు కట్టడి సేసెను. మఱియు నామె కొమ్మకు ఇరువురను బురుజునకు ఏఁబదుండ్రును, దిడ్డికి నూర్వురును, గవనునకు ఏనూర్వురను చొప్పున వీరభటులను గాపువెట్టెను.

ఓరుగంటిలోని ప్రయత్నములన్నియు చారులవలన విని మహాదేవరాజు "వ్యవధి యిచ్చిన బలము వృద్ధి యగును" అని తలఁచి వెంటనే మూఁడులక్షలసైనికులతో వచ్చి ఓరుగల్లుకోట ముట్టడించెను. అంతట రుద్రమదేవి భద్రకాళివలె దుర్నిరీక్ష్యయై వెలమసేనాని యగు రుద్రమనాయఁడును, కమ్మసేనానియు, నగరాధ్యక్షుఁడు నగు నాగన్నయు నాశ్చర్యచకితు లగునట్లు పదునైదుదినములు ఘోరయుద్ధము చేసెను. అప్పటికి యాదవులు "ఇఁక ఆంధ్రులను గెలుచుట కలలోని

వార్త" యని నిశ్చయించుకొని పలాయనము చిత్తగించిరి; అయినను రుద్రమదేవి వారిని విడువక వెన్నంటి తఱిమితఱిమి సంహరించెను. మహాదేవరాజునకు అప్పటికి బుద్ధి వచ్చెను. అగుటంజేసి యాతఁడు వెంటనే ఆంధ్రచక్రవర్తిని పాదముల మీఁద వ్రాలి అపరాధము నంగీకరించి కోటిద్రవ్యము అపరాధముగ నిచ్చుకొని రక్షింపఁ బ్రార్థింపఁగా రుద్రమదేవి కరుణించివిడిచిపెట్టి తన దేశమునకును, మహాదేవరాజు దేశమునకును సరిహద్దున జయస్తంభములు పాతించి తన సైనికులకు ఏఁబదిలక్షల హొన్నులను బహుమతి సేసెను.

పిదప ముమ్మడమ్మ గర్భవతియై కుమారునిఁ గనియెను. రుద్రమదేవి మనుమనికి ప్రతాపరుద్రుఁడు అని నామకరణము చేసి మహోత్సవములు చేయించెను. ఆబాలుని జననమునకు దేశమంతయు నానందపరిత మయ్యెను. ముమ్మడమ్మ ఒకటి రెండేండ్లు గడచిన తరువాత అన్నమదేవుఁడు" అను మఱి యొక కుమారుని గనియెను.

రుద్రమదేవి, ప్రతాపరుద్రుఁడు పెద్దవాఁడు అగునంత దనుక, వైరిభీకరముగ సామ్రాజ్యము పాలించి పిదప నాతనికి పట్టము గట్టెను.

---



# 2. తారాబాయి.

సూరనాథ్ రాయఁ డను నాతఁడు రాజపుత్రస్థానము నందలి వేదనగర మను సంస్థానమును బరిపాలించుచుండెను. పరిపాలించుటకు ఆతనికి దేశము చిన్నదియే; గాని విధివశమున శత్రుసంఘముమాత్రము చాలఁ బెద్దదిగనే యుండెను. ఎంత చెట్టున కంత గాలి యనుట ప్రసిద్ధమే గదా ? ఆతనికి శత్రుసంఖ్య యెంత యధికమో బలపరాక్రమము లంత యుండెను. అగుటచే నాతఁ డెవ్వరిని లక్ష్యపెట్టలేదు. ఎవ్వరిని "శరణు" అని యభయము వేఁడలేదు. శత్రువు వచ్చి కోట ముట్టడించి తుపాకి ప్రేల్చిన నాతఁడు ఢంకామీఁద దెబ్బ కొట్టి ఫిరంగి ప్రేల్చును. కాకున్న బాణము విడుచును. ఇదియే యాతని రాజనీతి. శత్రు వెంత బలాధికుఁ డైనను సరియే. రాయఁడు సంధి యను మాటనైన నుచ్చరింపఁడు. కత్తి యొఱనుండి బైటకు వచ్చినచో తుదకు అదియే తగవు తీర్పవలెను; గాని నడుమరాయబారములు పనికిరావు.

ఇంతటి కఠిననీతి నవలంబించినను రాయఁ డనేకయుద్ధములలో గెలిచి శత్రువులను బాఱఁదోలెను. ఈకారణము వలన నాతని కీర్తిని విన్నవాఁడు ఆతనిమీఁదికి దండెత్తివచ్చుటకు సాహసింపఁజాలకుండెడివాఁడు.

సర్వేశ్వరుఁడు బలపరాక్రమములను, కీర్తివైభవములను సంపూర్ణముగ నొసంగెను; గాని సాంసారికవిషయములయందుమాత్ర మాతనిని వంచించెను. నలువది యేండ్లప్రాయ

మున రాయునికిఁ గళత్రవియోగము సంభవించెను. పోవుచుఁ బోవుచు రాయని భార్య కొమార్తెను గనిపోయెను. రాయునికి కొడుకైనను కూఁతురైనను ఆమె యొక్కతయే. ఆబిడ్డ నాతఁడు చాల గారాబముతోఁ బెంచుకొనసాగెను. అనవరత యుద్ధప్రసంగములవలన నాతనికి భార్యావియోగదుఃఖము హృదయదాహము చేయఁజాలకపోయెను.

కేవలము బాహుబలమునే నమ్ముకొనియున్న రాజు రాజ్యము సుస్థిరమై యుండుట పొసఁగదు. రాజ్యమును సంపాదించుటకును, రక్షించుటకును కత్తి యొక్కటియే యాధారమనుకొనువాఁడు పాచికలను నమ్మి సర్వస్వమును ఒడ్డు జూదగానికంటెను నికృష్టుఁడు. నీతికి మించినపుడు కత్తి గాని కత్తికి మించినపుడు నీతి గాదు. సకలవిషయములయందును నీతి సాధనము. కత్తి సాహాయ్యము. రాజ్యతంత్రనిర్మాతలు చతురుపాయములయందును దండమును జిట్టచివరదిగా నేర్పఱిచినారు. మొదటి మూఁడుపాయములను విడిచి మాఱ్లాడిన, కత్తి చేపట్టువాఁడు వరుసగా కొన్ని యుద్ధములయందు విజయమందినను, దుదకు మఱల లేవలేకుండఁ గూలిపోవును. దండోపాయమే తారక మనుకొనువానిది మోటుఁదనము. మఱియు పశుబలము. సామదానభేదముల నవలంబించువానిది బుద్ధిబలము. సామదానభేదములయందు బుద్ధిప్రచారమున కధికావకాశము గలదు. వానియందు ఉన్నత జటిలత దండోపాయమున లేదు.

రాయునికి వార్ధకము ప్రారంభించునప్పటికి అదృష్టచక్రము పూర్తిగఁ దిరిగిపోయెను. 'సంతతవిజయములవలన

గర్వితుఁడై యున్న రాయనిమీఁదికి దిల్లా యను తురుష్కుఁడు అమాంతముగ దండెత్తి వచ్చెను. రాయఁడు అప్రతిమపౌరుషముతోఁ గొన్నిదినములు పోరెను; గాని తుదకు సర్వనాశము సంభవించెను. తన సర్వస్వమును తురకలకు విడిచి యాతఁడు కొమార్తెతోఁగూడ తకఫూరు అను పట్టణమునకుఁ బాఱిపోయెను. తురుష్కుఁడు ఆతని నక్కడనుండిగూడ లేవఁగొట్టెను. రాయఁడు అబూపర్వతమునకుఁ బాఱిపోయెను. అంతటితో దిల్లా యాతనిని మఱచిపోయెను.

జనసంకుల మైన నగరమున, మేఘప్రాసాదములయందును, చంద్రశాలలయందును నివసించిన సూరనాథారాయఁడు నిర్జన మగు పర్వతాగ్రమున, తనచేతులతో నిర్మించుకొనిన పర్ణశాలలో నివసించెను; గాని అది యేమియు నాతనికి హృదయావేదనము గలిగింపలేదు. పరాజయమును, రాజ్యభ్రంశమును ఆతని హృదయమున జాగరితములు కాసాగెను. "దిల్లా, గర్వము వలదు. పోగ రఁచెద"నని యాతఁడు తఱుచుగ సంవదించుచుండెను. అనేకయుద్ధములయందు శత్రురక్తమును ద్రావి, జయము నొనఁగూర్చిన తన కత్తి యిపుడు మొద్దువోయెను. అగుట నాతఁడు "ఇఁక నీకును నాకును ఋణము చెల్లిపోయినది" అని దానిని ఒక మూలకు విసరివేసెను.

రాయని కిఁక రాజ్యము వలదు. ఖడ్గకార్యమున దిల్లా చచ్చినఁ జాలును. సైన్యము లేదు. తాను వృద్ధుఁడు. సాహాయ్యముగూడ నేమియు లేదు. ఇఁక నీకార్య మెట్లు నెఱవేఱును? నలుదిక్కులకును జూచెను; గాని యాతనికి ఏమియుఁ గాన్పింపలేదు. "భయము వలదు. నేను ఉన్నాను" అనుమాట

యాతనికి వినఁబడలేదు. ఎవరిమట్టునకు వారికి తమ పాదము లను నిలుపఁద్రొక్కుకొనుటయందే కాలము చెల్లిపోవు చుండెను.

అయిన నీపగ తీఱునది కాదా? రాయని హృదయము దహించుకొనిపోవుచుండెను. తల తిరిగిపోవుచుండెను. కన్నుల నుండి బాష్పధార ప్రవహించుచుండెను. ప్రపంచ మంతయు నాతనికి శూన్యముగాఁ దోఁచుచుండెను. ఈస్థితిలో నాతనికి దిల్లా యెదుట నిలిచి "మూఁడుకాళ్లముసలీ, ఇంకను వ్యూహా నిర్మాణమునకు యోచన చేయుచున్నావా? చింత చచ్చినది. ఇంకను పులుసుచావలేదా?" యని యెత్తిపొడిచినట్లుతోఁచెను. వెంటనే యాతఁడు పిడికిలి బిగించి చూపుచు "దిల్లా, చింత చచ్చును. పులుసు చావదు" అని పండ్లు కొఱుకుచుఁ బ్రత్యు త్తర మిచ్చెను. ఆసమీపమునందే అడవిమల్లెపూవులు దండ గ్రుచ్చుకొనుచున్న ఆతని చిన్నబిడ్డ ఏకపుత్రి, తారాబాయి, ఎగురుచు దుముకుచు నెదుటకు వచ్చి రెండు చేతులతోడను తండ్రి రెండు భుజములను బట్టుకొని మొగముమీఁద మొగము పెట్టి, "నాయనా, చింత యేల చచ్చును? దిల్లా యేడీ?" అని పలికెను.

ఈమాట వినుటతోడనే రాయని హృదయమున చేయి పెట్టి కలఁచిన ట్లయ్యెను. ఆతని కన్నులు మెఱసిపోయెను. అంతట నాతఁడు కూఁతురు మొగము చూచెను. ఆముద్దు మొగమున నేదో యనంత తేజము నృత్యము చేయుచున్నట్లు రాయనికిఁ దోఁచెను. "చావదు. తల్లీ, చావదు" అని పలుకుచు నాతఁడు కొమార్తను దీసి యొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని

"చిట్టితల్లీ, చింత ఆకు రాల్చినది గాని చావలేదు. అది యిఁక చిగిరించును" అని పలికి లెక్కలేనన్నిమాఱులు ముద్దుపెట్టుకొని "పోయి దండ గ్రుచ్చుకొనుము" అని పంపివేసెను. తారాబాయి మఱల నెగురుచు దుముకుచుఁ బోయి పూల దగ్గఱఁ గూరుచుండి ఏదో గొప్పకార్యము చేసినదానివలె నుత్సాహముతో నుండెను.

రాయని హృదయము ఉత్సాహపూరిత మయ్యెను. "కూర్చువానికి చంద్రహాసమును, గడ్డిపోఁచయు సమానముగ నుపయోగించును. స్త్రీలు పురుషులకంటె నేవిషయమునఁ దక్కువ? నాపూర్వులలో అనేకరమణులు రణవిహారము గావించియున్నారు. రాజపుతానాలో కత్తివిసరిన క్షత్రియస్త్రీలకు లెక్కలేదు. తారమాత్రము పూర్వులకంటె నేవిషయమునఁ దీసికట్టు అగును?" అని రాయఁడాలోచించుకొని మహోత్సాహముతో మొగము పైకెత్తి "పగ తీఱినది. దిల్లా, నీవు చచ్చితివి" అని యఱచెను. తోడనే తారాబాయి మఱల వచ్చి ఆతని భుజములు పట్టుకొని యూఁపుచు "నాయనా, నీవు వద్దు. దిల్లాను నేను కొట్టెదను. కత్తి యిమ్ము" అని పలికెను. రాయఁడు మఱల నానందసాగరమున మునిఁగిపోయి కొంతసేపటికి తెలివి తెచ్చుకొని లేచి కొమార్త నెత్తికొని వక్షమున కదుముకొనుచు "తల్లీ, కత్తి యున్నది; గాని యది మొద్దువోయినది. దానిని ఈకొండరాళ్లమీఁద నూఱి యిచ్చెదను లే" యని పలికి ఉత్సాహము పట్టఁజాలక పరవళ్లు త్రొక్కెను.

ఇదివఱకు అంధకారబంధురమై పోయిన జీవిత మాతనికి మఱల ప్రకాశమానముగఁ దోఁచెను. ఆశాలతిక మఱల

రేకెత్తెను. వర్ధమానచంద్రకళ యగు తార యుండఁగా నాకేమి లోటు?" అని తలఁచి యాతఁడదిమొదలు తారకు రణవిద్య నేర్పఁ దొడఁగెను.

స్వీయము క్షత్రియరమణి. ఆపై నరణ్యావాసము. అటు మీఁద తీరని పగ. అభ్యసించునది రణవిద్య. ఇన్ని కారణములవలన తారాబాయి శరీరముతో మనస్సుగూడ వజ్రకఠోరము కాసాగెను. నిర్మల మగు నామె హృదయఫలకమున ఆబాల్య ప్రాయమునందే నమ్మినదానియందు తఱుగని యభిమానము, చేపట్టినదానిని పూర్తిచేయుటయందు పట్టుదల, కసితీర్చుకొనుటయందు దృఢదీక్ష, వంశప్రతిష్ఠయెడల గర్వము, ఆపదలయందు ధైర్యము, శత్రువులయెడల తృణీకారము, ఆత్మబలము నెడల నిస్సీమవిశ్వాసము, వ్యవహారసందర్భములయందు కచ్చితమగు పద్ధతి, కష్టములయందు సహనము, కొండలఁబోలు నాపదల నైన లక్ష్యపెట్టని సాహసము, ప్రాణములను లెక్కసేయని శౌర్యము, పోరాటములయందు తులలేని యభిలాష, మొక్కవోని వాడి మున్నగు గుణములు అంకితములు కాఁజొచ్చెను. మఱియు నామెకు వయసుతోఁగూడ వ్యవహారజ్ఞానమును, పిన్నపెద్దలయెడల తారతమ్యజ్ఞానమును, లోకమోహనమగు సౌందర్యమును వృద్ధి యగుచుండెను.

తారాబాయికి పదునాలేండ్ల వయస్సు వచ్చెను. శౌర్యసాహసములయందును, బలపరాక్రమములయందును ఆగ్రామమున నున్న రాజపుత్రులుగూడ నామెకు సాటి రారు. కచ్చయు పైఁటయు బిగించుకొని పర్వతాగ్రమున నున్న వనవృక్షముల స్నిగ్ధచ్ఛాయలయందు గరిడిసాదనలు సేయునపుడు ఆమెను

జూచి రాయఁడు "ఇంకను వైరిసంహార మెప్పుడు?" అని యాత్రపడుచు ఉపాయములు పన్నుచు కాలము గడపుచుండెను; గాని యామె మనోహరదేహమున లావణ్యవాహిని యుత్తరంగిత మగుచుండుట యాతఁడు గనుసింపలేదు. ఆమె ముద్దుమొగమున ప్రణయమాధుర్యము కూలంకష మగుచుండుట పరికింపలేదు. ఆమె వివాహయోగ్య యైయుండుటయే యాతఁడు తెలిసికొనలేదు.

తారాబాయికిఁ గూడ వివాహవాంఛ యింతవఱకును బొడసూపనే లేదు; గాని యామె సౌందర్యము నామె బలపరాక్రమశౌర్యసాహసములును రాజపుత్రస్థానమునం దంతటను ప్రశంసింపఁబడఁ జొచ్చెను. రాజపుత్రులలో ననేకులామెను బెండ్లియాడ నూహించుచుండిరి. ఇంతలో మేవాడ రాణా రాయమల్లుని పెద్దకొడుకు అగు జయమల్లుఁడు సూరనాథాక్ రాయని యెదుట సాక్షాత్కరించెను. తమ్ము వెదకికొనుచు వచ్చిన జయమల్లునకు రాయఁడు రాజపుత్రులకుఁ దగినట్లు గౌరవము చేసెను. తార చాల గంభీరయై యంతయు చూచుచుండెను. రాయఁడు కూర్చుండు మని పులిచర్మము పఱిచెను; గాని జయమల్లుఁడు అట్లే నిలిచియుండి "నేనిప్పుడు నీయింటికి భిక్షుకుఁడనై వచ్చితిని" అని గంభీరముగఁ బలికెను. రాయఁడు "ఏదో యుద్ధమున సాయము సేయఁగోరుటకు జయమల్లుఁడు వచ్చె" నని భావించెను. తార గూడ "ఏదో యుద్ధము పొసఁగినది" యని తలంచెను. ఈతలంపువలన నామె రక్తనాళములు ఉబుకసాగెను.

రాయఁడు "ఏమిభిక్ష" యని యడుగుటయే తడవుగ

జయమల్లుఁడు "ప్రణయభరాలసుఁడనై చాల నాశతో వచ్చితిని. నీకొమార్తెను నాకిమ్ము" అని గంభీరముగ నిలిచియుండియే పలికెను. ఆపర్వతాగ్రమున మనస్సులయందును, ప్రాస్థానమునను గూడ తారావివాహప్రస్తావనము వచ్చుటకు ఇదియే ప్రారంభము. రాయనికి ద్రుతగమనమునఁ బ్రయాణము సేయుచుండ హఠాత్తుగ నేదో యడ్డము తగిలిన ట్లయ్యెను. ఆతని భావయంత్రము ఒక్క త్రుటికాలము ఆగిపోయెను. కంఠస్వరము రుద్ధమై పోయెను. తుద కాతఁడా ప్రశ్నమున కేమి చెప్పుటకును దోఁచియుండకపోవుటచే కొమార్తె దెసఁజూచెను. తండ్రి చూచుటయే తడవుగ తార "నాశత్రువును సంహరించుటయే నేను పరిశీలించు వరయోగ్యత" అని చెప్పెను. "ముందు వివాహము. తరువాత శత్రుసంహారము" అని జయమల్లుఁడు తారదెసఁ జూచి పలుకఁగా "శత్రుశేషము తీరిన తరువాత పాణిగ్రహణము" అని తార యందులకు మొగమోటవిడిచి మాఱుపలికెను. జయమల్లుఁ డంత రాయనిదెసఁ జూడఁగా నావృద్ధుఁడు "తార చెప్పినది యుక్తముగ నున్నది, నేనామెకు అడ్డు చెప్పఁజాలను" అని కనుబొమలు ఎగురవైచుకొనుచు సమాధానము చెప్పెను.

జయమల్లుని భావనాసౌధము నేలమట్ట మయ్యెను. కన్నులు గిఱ్ఱునఁ దిరిగిపోయెను. చెదరిపోయిన మనస్సును దేర్చికొని కొంతసేపటి కాతఁ డెట్లో తెప్పిఱిల్లి "నాసంశప్రతిజ్ఞను గుఱించి నేనేమియుఁ జెప్పుకొనవలసిన పని లేదు. నా పూర్వు లెప్పుడు నాడి తప్పి యెఱుఁగరు. ముందుగ నీకొమార్తెను నాకుఁ బెండ్లిఁ జేయుము. పిదప ద్విగుణీకృతోత్సాహ

ముతోఁ బోయి శత్రుసంహారమునకు లేనంత తొందఱ వివాహమున కేమి వచ్చినది? యని యాతఁడు త్రోల్లిటివలెనే మాట్లాడెను. జయమల్లుఁడు తోడనే "శోభనురాలా, నేను శపథము చేసి చెప్పుచున్నాను. ముందు వివాహ మయినచో పిదపకంకణాలచేతులతోడనే శత్రువును సంహరించి వచ్చెదను. శత్రురక్తముతోడనే వసంతక్రీడ జరుపవచ్చును" అని గద్గద కంఠముతోఁ బలుకఁగా ఉత్తరక్షణమునందే తార "నేను శపథము దాల్చి యున్నాను. శత్రుసంహారము జరిగినఁ గాని పాణిగ్రహణము జరుగదు" అని అసంతుష్టురాలై పులుకు పులుకునఁ జూచుచు బదులు చెప్పెను.

జయమల్లుని యాశ పూర్తిగ నడుగంటెను. ఆతనికి అభిమానమును ఉడుకుఁబోతుతనమును ఒక్కమాఱుగ ఉక్కిరి బిక్కిరి చేసెను. ఆతఁడు మఱల నెగఁబ్రాకిపోవుచున్న యాశాలతికను దిగగుంజుకొనఁజాలకయు, ఉఱకలు వేయుచున్న కడుపుమంటను జల్లార్చుకొనఁజాలకయు "నావంటి మహారాజపుత్రుఁడు వచ్చి ప్రార్థించిన నీవు నిరాకరించుచున్నావు. నీతండ్రి యెంతటి దరిద్రుఁడో నీవు నంతటి దరిద్రురాలవు. తుదకు నా యింటి హీనసేవకునిఁ బెండ్లియాడుటకైనను నీకు అర్హత లేదు." అని తారను తృణీకరించుచుఁ బలికెను. ఈమాట ముగిసిన వెంటనే తార కనుబొమలు ముడివైచి పిడికిలి బిగించి యొక్కడుగు ముందిడునంతలో సూరనాథాభిధానుఁడు "నీచుఁడా," యని పలికి జయమల్లునిమీఁద కత్తివిసరెను. అంతట తార క్రిందఁబడి దొరలుచున్న జయమల్లుని శిరమును ఎడమ కాలితోడను, మొండెమును కుడికాలితోడను తన్నుకొనుచుఁ

బోయి పర్వతముక్రిందఁ బడునట్లు త్రోసివైచి వచ్చెను. పిదప తండ్రియు, బిడ్డయు హాటాహుటినడకలతో బోయి కొండ ధారక్రింద నిలిచి సచేలస్నానము చేసిరి.

ఇది యంతయుఁ జూచుచున్న జయమల్లుని సేవకుఁడు ద్రుతగమనంబున మేవాడురాజధాని యగు చితోడుదుర్గము మీఁదికిఁ బోయి అబూపర్వతముమీఁద జరిగిన దంతయు నిండుకొలువున రాయమల్లునకు విన్నవించెను. సభలోనున్న మంత్రులు, బంధువులు మున్నగువా రందఱును కన్నులువెట్టఁ జేయుచుండఁగా రాయమల్లుఁడు లేచి "పిఱికిపందకు తగిన శిక్ష యైనది. సూరనాథ్‌రాయఁడు మంచి పనిఁ జేసినాఁడు. ఆతఁడు నావంశమునకుఁ గళంకము రాకుండఁ గాపాడినాఁడు" అని యుచ్చస్వరముతోఁ బలికెను. ఇది విని కొలువులో నున్న వా రందఱును నిర్విణ్ణులైరి.

తన రెండవ కుమారుఁడు అగు పృథివీరాజుమీఁద రాయమల్లుఁడు ఏదో కారణమువలన కోపించి యిలువెడలఁ గొట్టి యుండెను. జయమల్లుఁడు నాఁ డట్టి దుర్మరణము నొంది న వెంటనే రెండవ కుమారుని రాయమల్లుఁడు రప్పించుకొని ఆతనిని యౌవరాజ్యమునకుఁ బట్టాభిషేకము గావించెను. రాయమల్లుఁడు జయమల్లునిఁ బ్రయత్నపూర్వకముగా మఱచి పోయెను.

పృథివీరాజునకు తన వంశమునకుఁ తనయన్నవలనవచ్చిన యపకీర్తినిఁ దొలఁగింప నిచ్ఛ పుట్టెను. అగుట నాతఁడుతండ్రి చెంతకుఁ బోయి "సూరనాథ్‌రాయని కొమార్తను బెండ్లి యాడి వచ్చెదను" అని మనవి చేసి సెలవుఁ బడసి వెంటనే

అబూసర్‌ గ్రామునకుఁ బోయి రాయని యెదుట సాక్షాత్కరించెను.

"పృథివీరాజు అన్నను జంపిన పగఁ దీర్చుకొనుటకు వచ్చె" నని రాయఁడు తలఁచెను. తార "అన్నను జంపిన పగ తీర్చుకొనుట, అన్న చేయలేనిపని చేయుట" ఈ రెండింట నొకటి పృథివీరాజు సంకల్ప మని నిశ్చయించుకొనెను; గాని "అది యిది" యని యేర్పఱించుకొనఁజాలకపోయెను. ఇంతలో పృథివీరాజు రాయని యెదుట నిలిచి "నేను మీకొమార్తను పెండ్లియాడఁ గోరుచున్నాను; గావున నిదే నేను మీశత్రువును సంహరింపఁ బోయెదను" అని గంభీరముగఁ బలికెను. తార యీసంగతి నిశ్చయింపలేనందులకు తనలో నవ్వుకొనియెను; గాని రాయఁడు "ఏమంటివి?" అని యడిగెను. పృథివీరాజు మఱల యథాప్రకారముగఁ బలుకఁగా వృద్ధుఁడు "సంతోషము నాకొమార్త యనిన మాటకు ఎప్పుడును అడ్డు లేదు" అని బదులు చెప్పెను. "నీవు శత్రుంజయుఁడవు కావలె నని యాశీర్వదించుచున్నాను. మేవాడు రాజ్యాధీశుల యంశ నీయందు కలదు" అనిగూడ రాయఁడు చెప్పెను. అంతట పృథివీరాజు రాయని చరణము లంటి బయలుదేఱుచుండఁగా "నేనును వచ్చుచున్నాను" అని మయూరక్రేంకారమువలె నొక కేక వినవచ్చెను. పృథివీరాజు మఱల రాయని కభిముఖుఁడయ్యెను. తండ్రి యనుజ్ఞను బడసి తార కవచోష్ణీషాదులను ధరించి ధనుర్బాణములు గైకొని వచ్చెను. వృద్ధుఁడు లేచి నిలిచి "మీరు చేయఁబోవునది మహాకార్యము. వైరి జిత్తుల మారియగు తురుష్కుఁడు. మీరు తరుణవయస్కులు. అన్నియు

నాకు ఆందోళనాకారణము లగుచున్నవి. భద్రము" అని వారిని హెచ్చరించెను. తారతోఁ గూడ పృథివీరాజు మఱల రాయని పాదముల నంటి తారను వెంట నిడుకొని పోయెను.

తండ్రి యాగ్రహమునకుఁ బాత్రుఁడై యున్నపుడు పృథివీరాజు ఏడెనిమిదివేల క్రొత్తసైన్యమును సంపాదించు కొనియుండెను. ఇప్పుడు ఆతఁడు ఆసైన్యములను వెంట నిడు కొని తార కొక గుఱ్ఱమునిచ్చి తానొక గుఱ్ఱము నెక్కి యుక్త సమయమున దిల్లా రాజధాని యగు థోదానగరమును సమీ పించెను. అప్పటికి సూర్యాస్తమయమై కారుచీఁకటులు క్రమ్ము కొనియుండెను. నాఁడు మొహరము పండుగుయొక్క కడపటి దిన మగుటచే పట్టణమున నున్న యువను లందఱును వీథ్లను గుమ్మటములలో నుంచి యూరేగించుచు మహోత్సవవ్యగ్రులై యుండిరి. అంతట పృథివీరాజును తారయు, ఒక సేవకుఁడును ఉత్సవాలోకనకుతూహలురువోలె నగరమునఁ బ్రవేశించి రాజమందిరముచెంతకు వెళ్లినప్పటికి, దిల్లా మేడమీఁద వీథి దెస నున్న వసారాలో నిలిచి దుస్తులు ధరించుచుండెను అది చూచి తార బాణము సంధించి అతిచాతుర్యముతో నెవరి కినిఁ దెలియకుండ విడిచెను ఆదెబ్బతో దిల్లా నేలఁగూలి మడి సెను. వెంటనే పృథివీరాజును, తారయు, సేవకుఁడును మఱల నుత్సవములోఁ జొచ్చి పురము దాఁటుటకు బయలుదేఱిరి; గాని అంతకుఁ బూర్వమే తురుష్కులు తమప్రభువును సంహ రించినవానిని వెదకుచు పురద్వారముచెంత నొక మత్తగజ మును, గొంత సైన్యమును నిలిపిరి. రాజును, తారయు సేవకు నితో నక్కడకు వచ్చునప్పటికి మదగజము ఘీంకరించుచు

తొండము సాచి కొట్టుటకు వారిమీఁదికి వచ్చెను. తోడనే తార దాని తొండమును అతిసులభముగా నఱుకఁగా నది గీ పెట్టుచుఁ బోయి తనవారినే చాలమందిని త్రొక్కి నాశనము చేసెను. మిగిలిన వారిని చీల్చుకొని పృథివీరాజును, తారయు సేవకునితోఁ గూడ పురము వెలువడి అక్కడ వేచియున్న తమ సైనికులం గలిసికొని విజృంభింపుఁడు" అని సెలవిచ్చిరి. పోరు ఘోర మయ్యెను. కత్తిపట్టిన తురకలందఱును ప్రాణములు విడిచిరి. తారకు జయము గలిగెను. వెంటనే వారు వేదనగర సంస్థానము నాక్రమించుకొని తొల్లి రాయనిక్రింద నౌకరీ చేసినవారిని ఆయాపదవులలో నిలిపి శుభవార్తను రాయని కెఱింగించుటకు అబూపర్వతమునకు పయనము సాగించిరి.

రాయని ప్రాణము లన్నియు తారమీఁదనే యుండెను. అగుటచే నాతఁడు విజయము గైకొని తన కొమార్త పృథివీ రాజుతో నెప్పుడు తన చెంతకు వచ్చునా యని యువ్విళ్లూరు చుండెను. తార తన వద్ద సెలవుగొనిపోయిన మఱునాఁటి సాయంకాలము రాయఁడు తన పర్ణశాల తిన్నెమీఁదఁ గూర్చుండియుండఁగా దూరమున ఇరువురు ఆశ్వికులు అతిరయ మున వచ్చుచున్నట్లు కాన్పించెను. తోడనే యాతఁడు వారి కెదురుగ బయలుదేఱఁగా ఆతఁడు కొండ సగము దిగునప్ప టికి తారయు, పృథివీరాజును సమీపించి అల్లంతదూరము నందే అశ్వములను దిగి మహానందముతో ఎగురుచు దుము కుచువచ్చిరి. తారతటాలున తండ్రినిఁ గౌఁగిలించుకొని "దిల్లా చచ్చెను" అని పలికెను; గాని పృథివీరాజు సంకోచించుచు నిలువఁబడెను. అది చూచి రాయఁడు కుడిచేతితో నాతనినిఁ

కౌఁగిలించుకొని "వత్సా! నీతండ్రి, కీర్తి నిలిపితివి. నాహృదయము శల్యమును బాపితివి" అని ప్రశంసించెను.

పిదప నందఱును పర్ణశాలకువచ్చి పులిచర్మములు పఱచుకొని కూర్చుండిరి. జరిగిన దంతయుఁ బృథ్వీరాజు చెవులు పుట్టునట్లు కవివలె వర్ణించి చెప్పెను. రాయఁ డంతయును విని పరమానందభరితుఁడై తారహస్తమును పృథ్వీరాజు హస్తమున నిడి "మేవాడురాజపుత్రా, దుష్టశిక్షణమూలమున నారాయణస్వరూపుఁడ వగు నీపాదముల సన్నిధిని నాబిడ్డను సమర్పించుచున్నాను. తారనాకు ఏకపుత్రిక. నాప్రేమైకనిలయము. తార లేకున్న నాకేమియు లేదు. నాసుఖమునకు నాయానందమునకు నాజీవితమునకు నాసర్వస్వమునకును, తారయే యాధారము. తార ఏమియు నెఱుఁగని అమాయికురాలు. బాల్యమునుండియు నరణ్యమున పెరుగుటచే ఐహికజీవితవిడంబనము లేమియు నెఱుఁగదు. తార ప్రణయపుముద్ద. ఈముద్దగాలిని నీపదదాసిగ గ్రహించి అనుగ్రహింపుము. ఈమెవలన నేమైన నపరాధము జరిగినచో క్షమింపుము. నేఁడు తార నీయర్ధాంగలక్ష్మి యైనది. మాతృహీన యగు తారను గుఱించి యిఁక నీకేమియుఁ జెప్పవలసినది లేదు. మీరు పార్వతీపరమేశ్వరులవలె చిరకాలము అష్టైశ్వర్యములు ననుభవింపుఁడు" అని యాశీర్వదించెదను. తారయు, పృథ్వీరాజును రాయనికి సాష్టాంగనమస్కారములు గావించి బాష్పోదకముతో నాతని పాదములు కడిగిరి.

రాయఁడు యుక్తసమయమున కొమార్తతోడను, అల్లునితోడను, వేదనగరము ప్రవేశించెను. పూర్వపు భారతీయ

ప్రభువు మఱల లభించినందులకు సంస్థానములోనివారంద ఱును పరమానందభరితులైరి. సుముహూర్తమున రాయఁడు వేదనగరరాజ్యమును పృథివీరాజునకుఁ బట్టాభిషేకము చేసి తాను ఆముష్మికసాధనఁ బ్రారంభించెను.

తారయు, పృథివీరాజును రాయని యాశీర్వచనప్రభావమున పార్వతీపరమేశ్వరులవలె నితరేతరానురక్తులై క్షణమైన నొండొరు లెడఁబాయక సకలసుఖములు ననుభవింపసాగిరి.

పృథివీరాజునకు ఒక సోదరి గలదు ఆమెను ప్రభురాయఁ డను నాతనికి ఇచ్చి పెండ్లి గావించిరి. ప్రభురాయఁడు దుర్మార్గమునఁ బ్రవేశించి భార్యననేకవిధముల బాధించుటకుఁ బ్రారంభము సేయఁగా పృథివీరాయఁడు ఒక మాఱు బుద్ధి చెప్పెను. అందులకుమఱింతరుష్టుఁడై ప్రభురాయఁడు భార్యను మఱింత బాధింపఁ జొచ్చెను. దానిని సహింపక పృథివీరాజు అతికఠినముగా జాబువ్రాసి నిందించెను. ప్రభురాయఁడు కపటము నవలంబించి పృథివీరాజు నెడల వినీతుఁడువోలె కొన్ని దినములుభార్యను ఏమియు బాధింపక,ఒకనాఁడుపృథివీరాజును విందునకుఁ బిలిచి విషాన్నము పెట్టించెను ఏమియు నెఱుఁగని పృథివీరాజు భోజనము చేసి సోదరి కడగండ్లు తప్పెనుగదా యని యానందించుచు నింటికి బయలుదేఱి మార్గమధ్యమున విషము తలకెక్కి పడిపోయెను. ఈవార్త విని తారాబాయి వచ్చి అనేకచికిత్సల చేయించెను; గాని ప్రయోజనము లేక పోయెను. పృథివీరాజు ఈలోకమును విడిచిపోయెను తారాబాయి సహగమనము చేసి భర్తతోఁగూడ పరమపదమున కేగెను.

---

# 3. దుర్గావతి.

బుందేలుఖండమున చందేలురాజు తన సంస్థానపుఁ బ్రజలను జాల ప్రేమతోఁ బాలించుచుండెను. ఆతని కొక కొమార్తె గలిగెను. ఆమె పేరు దుర్గావతి. తలిదండ్రులును, బంధువులును, సంస్థానమునందలి ప్రజలును ఆమె నొక్కతీరునఁ బ్రేమించిరి. దుర్గావతి అందఱకును ఆనందము గూర్చుచు చంద్రకళవలెఁ బెరిగి అప్పటి రాజపుత్రిక లభ్యసించు విద్యల నన్నిటిని నేర్చి సౌందర్యమున భువనమోహిని యయ్యెను.

అనేకరాజపుత్రులు దుర్గావతినిఁ గోరి రాయబారుల నంపిరి; గాని యామె తండ్రి అన్ని సంబంధములను పూర్వపక్షకోటికిఁ జేర్చివేసెను. తుదకు గఢామండలసంస్థానాధిపతి యగు గోండురాజు వర్తమానము చేయఁగా నాతఁడు ఆలోచనకుఁ బ్రారంభించెను.

గోండురాజు జాతియందును, విద్యయందును, నాగరికతయందును రాజపుత్రులకుఁ దీసిపోవును. ఇది యొకటియె వరునియెడలఁగల అయోగ్యత.

సంస్థానము చాలఁ బెద్దది; కాకున్నను గోండురాజునకు చాల బలము గలదు. స్వయముగ నాతఁడు శౌర్యసాహసములయందును, బలపరాక్రమములయందును అసామాన్యుఁడు.

అనేకరాజపుత్రులకు నాతనికి నఖండమైత్రి గలదు. వారు ఈతనికిఁ బ్రాణము లిత్తురు. ఈతఁడు వారికిని బ్రాణములను ధారవోయును.

దుర్గావతి కుసుమకోమలి; రతిసుందరి. గోండురాజు రసికుఁడు, మదనమోహనుఁడు. ఒకరియెడల నొకరు ప్రణయబద్ధులైరి. గోండురాజు పరుషుఁడు; గావున సాహసించి రాయబార మంపెను. దుర్గావతి ముగ్ధాంగన యగుటచే సాహసింపఁజాలకపోయెను. ఇంతియే భేదము. ఈమూఁడును వరుని యందుఁ గల యోగ్యతలు.

చందేలురాజు ఇది యన్నియుఁ జక్కఁగ నాలోచించుకొని "గోండురాజును దిరస్కరించిన అన్నివిధములను కష్టములును సంభవించును" అని నిశ్చయించుకొని గోండురాజునకు దుర్గావతి నిచ్చి యొక శుభముహూర్తమున మహేంద్ర వైభవముతోఁ బెండ్లి సేసి అల్లునిఁ గొన్నిదినములు తన యింట నుంచుకొని పిదప అరణములు ఇచ్చి అల్లుని సారెపెట్టి కొమార్తను గఢామండలమునకుఁ బంపివేసెను.

స్వస్థలము చేరిన పిదప గోండురాజు ప్రజాపాలనమునకు సింహాసనము నధిష్ఠించుట మాని ప్రియాలాలనమునకు ఉద్యానవనములయందలి నికుంజములలోఁ ప్రవేశింపఁజొచ్చెను. ప్రజల కష్టసుఖములను దెచ్చుటకు సంస్థానమునఁ బర్యటనము సేయుట మాని వాయుసేవనమునకై నర్మదానదీతీరములయందు విహారము ప్రారంభించెను. ప్రజలును, ఉద్యోగులును ఈతన్మయత్వము అచిరకాలమునందే వదలిపోవు నని భావించిరి; గాని మంత్రులచేతఁ బెట్టిన రాజముద్రికను గోండురాజు మరల స్వీకరింపలేదు. వివేకసహిత యగు దుర్గావతి సంస్థానాధీశ్వరునకు ఇది తగదని యనేకపర్యాయములు అనేకవిధముల బోధించెను; గాని ప్రయోజనము లేకపోయెను.

ఇంతలో నామె గర్భవతి యయ్యెను. నవమాసములును మోసి యామె శుభలగ్నమున కుమారునిఁ గనియెను. దౌహిత్రజననమునకు చందేలురాజు పరమానందభరితుఁ డయ్యెను. "ఈ బాలుఁడైనను మిమ్ము పరిపాలించు" నని సంస్థానపుఁ బ్రజలానందించిరి.

ప్రజల యాశాలతికను ఆనందసలిలసేచనమున కొనసాగించుచు రాజపుత్రుఁడు పదియేండ్లవాఁడు అగునప్పటికి గోండురాజు రక్తము క్షీణించి పరలోకమునకుఁ బోయెను. రాణి యగు దుర్గావతిమీఁద పతివియోగదుఃఖమును, ప్రజాభారమును ఒక్కమాఱుగ నమాంతముగ మీఁదఁ బడియెను; గాని యామె జంకలేదు. ఆమె కుమారుని మంగళమును గోరి దుఃఖమును దిగమ్రింగుకొని ప్రజాభారమునకు శిర మొగ్గెను. దుర్గావతి కుమారుని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి పరిపాలనమునఁ గల అవ్యవస్థ నంతను బోకడఁచి న్యాయమార్గమున ప్రజల నేలఁ జొచ్చెను. రాణి దుర్గావతార మని ప్రజలు భావించిరి. వారి యానందధ్యానములతోడను, మిత్రులగు రాజపుత్ర ప్రభువుల ప్రశంసలతోడను దుర్గావతి పాలనమున అయిదాఱు సంవత్సరములు కడచిపోయెను.

ఢిల్లీయందు అప్పుడు అక్బరు వర్ధమానచంద్రుఁడై యుండెను. కొలఁదిపాటి నిందలను, వేలకొలఁది పొగడ్తలను విడిచి, కేవలచరిత్రలను జదివిన వారికి అక్బరురాజనీతి కరతలామలకమే. లోకమునఁ గల మంచి యెల్లఁ దనకే యుండవలయును; గావున "యిట్టి రాజ్యమును బరిపాలించు రాణి మనకు నంకితురాలుగా నుండవలెను" అని నిశ్చయించుకొని అక్బరు

విఫలప్రయత్నుఁడై తుదకు దుర్గావతిమీఁద యుద్ధము ప్రకటించెను. అసఫ్ఖానుఁడు అను మొగులువీరుఁడు సేనాధిపతియై గఢామండలమును సాధించుటకు బయలుదేఱెను. దుర్గావతి వైరి నెదిరించి పోరుటకు సిద్ధపడెను.

అక్బరునకును దుర్గావతికిని ఇంతవఱకును వైరమును లేదు. మైత్రియు లేదు. ఒకరి ప్రసక్తి యొకరికి లేదు. ఎవరి తెన్నున వారుండిరి. అట్టిస్థితిలో నిప్పుడు ఈయుద్ధమేల? అక్బరుగూడ రాజసామాన్యుఁడే; గాని విశేషలక్షణములతో ఆకాశమునుండి యూడిపడలేదు. ఈయుద్ధమునకు మహాత్వాకాంక్ష కారణము గాకున్న మఱి యేమున్నది? యుద్ధమునకుఁ గారణము లేనప్పుడు సంధికి అవకాశము లేదు. సంధి యనిన తుని తగవుపద్ధతినో మఱియొక పద్ధతినో పరిష్కరించుట గాని ఇరు తెగలవారిలో నొకరిని చీవాట్లు పెట్టి పంపివేయుట గాదు. ప్రసక్తమైన యుద్ధము ఏభూభాగమును గుఱించియో, ఏవ్యాపారమును గుఱించియో, ఏమర్యాదను గుఱించియో మఱి యే యితరకారణమువలననో యైనచో సంధి చేయను వచ్చును; కుదురను వచ్చును. నిరపరాధిపైని తలవంచుకొని తన దారినిఁ బోవువానిమీఁద నిష్కారణముగ దుశ్చింతతో దండెత్తి వచ్చినవానికి ఏవిధముగ సంధి చేసినను లాభమే. అయినప్పుడు జయాపజయములకు దైవముమీఁదనే భారము ఉంచి పోరు సల్పక సంధి చేసికొననేల?

రాజ్యతంత్రమున సంధి యనిన విఱిగి మీఁదఁబడిన విపత్తు తప్పించుకొను నుపాయముగదా? మఱియు నిష్కారణముగనో సకారణముగనో దండెత్తివచ్చినవానిని పాతాళము

నకుఁ ద్రొక్కివేసి కసితీర్చుకొనునిమిత్తము సర్వమును సన్నద్ధము చేసికొనుటకు వ్యవధి చేసికొనుటగదా! అట్టి స్థితిలో అకస్మాత్తుగ నెత్తివచ్చిన అక్బరుతో దుర్గావతి సంధిచేసికొనుటకు సిద్ధపడక పోరుటకు సిద్ధపడనేల? ఇది యోచింపఁదగిన ప్రశ్నయే; గాని దుర్గావతి చేపట్టిన కారణముల నన్నిటిని చరిత్రకారుఁడు మన యెదుట ప్రదర్శింపలేదు. ఆకాలమున ఈప్రశ్న వచ్చినచో జవాబు ఎట్లుండునో స్థితిగతులు తెలియకపోవుటచే మనము చెప్పఁజాలము. అయినను ఏదో యొకవిధమున సిద్ధాంతీకరింపవచ్చును. ఈసందర్భములో తొలుదొల్త యుద్ధమునకే సిద్ధపడిన వ్యక్తి స్త్రీ యనుట మనము మఱువఁగూడదు. ప్రతివీరుని చంద్రహాసము మార్తాండుని సహస్రమయూఖముల యందు మిలమిల మెఱసిపోయినపుడు సాధారణముగా పురుషులకే భావోద్రేకము కలుగుచుండును. ఉద్రిక్తభావుఁడు ఎదుటివాఁడు; కత్తిచూపి మాటలాడిన తాను కత్తి విసరియే బదులు చెప్పును. ఇది బుసిపోని ప్రకృతిధర్మము; గావున నిష్కారణముగ నెత్తివచ్చినవానితో సంధి యేల? ఎదిరించెదను." అని నిశ్చయించుకొని దుర్గావతి యుద్ధమునకు సిద్ధపడి యుండవచ్చును.

ఎట్లయిన నేమి? తుదకు యుద్ధమే పొసఁగినది. దుర్గావతి వెంటనే అయిదు వందల ఏనుఁగులను, అయిదు వేల గుఱ్ఱములను, అసంఖ్యాకమగు కాల్బలములను తయారుచేసి తాను పురుషవేషము దాల్చి కత్తి దూసెను. ఆమెను జూచి సైనికులందఱును కాలాగ్నులవలె దుర్నిరీక్ష్యులైరి.

యుక్తసమయమున ఇరువాఁగులవారును కలియఁబడిరి.

చూచుచుండఁగనే పోరు ఘోర మయ్యెను. అచిరకాలము నందే తురుష్క వాహిని పలుచఁబడెను. అసఫ్‌ఖానుని వ్యూహము భగ్న మయ్యెను. ఆతని ధైర్యకంచుకము బ్రద్దలై పోయెను. గఢామండలసైనికులు నిప్పులు గ్రక్కుచు ఆతనిని రూపుమాపుటకుఁ బ్రయత్నింపఁజొచ్చిరి.

యవనచమూపతి ఢిల్లీనుండి మఱల ననంతసైన్యమును అంచెలమీఁద రప్పించుకొని మఱల ముట్టడి ప్రారంభింపఁగా గోండుసైనికులు తిరిగి విజృంభించిరి; గాని శత్రువులు అధికసంఖ్యులై యుండుటచేఁ దమ సైనికులు కొంతఱు వెనుదీయుచుండుటఁ జూచి యువరాజు యుద్ధములో నుఱికెను. అదిచూచి గోండుసైనికు లందఱును శౌర్యోద్రిక్తులైరి. మఱల దారుణ సంగ్రామము ప్రారంభ మయ్యెను. జయము నేపక్షమునకును నిశ్చయింపఁగూడని సమయమున తురకలసైనికుల నడుమనుండి వచ్చిన కఠోరశరము తగిలి బాలరాజు మూర్ఛిల్లెను. గోండుసైనికులు వెంటనే గగ్గోలుపడిరి.

ఒక యోధుఁడు వేఱొకచోట మహిషాసురమర్దనివోలె శత్రుమర్దనము గావించుచున్న రాణిచెంతకుఁ బోయి సంగతిఁ దెలుపఁగా నామె "విచారమునకును, ఆలోచనకును ఇది సమయము గాదు. నాకంటె గఢామండలము అదృష్టము చేసికొన్నచో చిట్టిబాబు జీవించును. లేకున్న లేదు. ఎట్లయినను ఇప్పుడు ఇక్కడనుండి వచ్చుటకు నాకు వీలులేదు" అని కచ్చితముగఁ జెప్పి యథాప్రకారముగనే పోరు సాగింపఁజొచ్చెను.

యుద్ధరంగము తుపానుసమయమునందలి మహోదధి వోలె నల్లకల్లోలముగ నుండెను. ఇరుతెగలవారును కొంతతడవు ఇటునటు నూఁగిపోయిరి. నిముసములు గడచిన కొలఁదిని యవనులకును ధైర్యమును, క్షత్రియులకు క్షీణతయుఁ బెరిగిపోఁజొచ్చెను. ఇంకను గొన్ని నిముసములు గడచునప్పటికి రాణివెంట మూఁడువందల క్షత్రియులు మాత్రము నిలిచిరి. తురుష్కులు చెలరేఁగిరి.

అయినను రాణి భీతిల్లలేదు. వీరవిహారము మానలేదు. అసఫ్ఖానుఁడు సొంతచేతులతో నామెను బంధింపవలయు ననియు లేకున్న సంహరింపవలయు ననియు నిశ్చయించుకొని రణఘోషము సేయుచు వచ్చెను; గాని రాణి ధాకకుఁ దాళఁజాలక వెనుకంజవైచెను. అతఁడు ఇక నెట్లును ఆమెను సమీపించుటకై తిగాదని నిశ్చయించుకొని దవ్వునకుఁ బోయి బాణవర్షము ప్రారంభించెను. రాణి యెదుటనున్న తురుష్కుల ఖడ్గాఘాతముల నన్నిటినిఁ దప్పించుకొని వారిని సంహరించుచుండెను. ఖానుని బాణములనుగూడ చాలవఱకు తప్పించుకొనిపోయెను; గాని యొక బాణము వచ్చి తటాలున శిరమున గ్రుచ్చుకొనియెను.

తోఁకత్రొక్కిన త్రాఁచువలె మండిపడుచు రాణి తటాలున నా బాణమును పెఱికివేసికొనెను; గాని రక్తప్రవాహమును ఆపఁజాలకపోయెను. ఇదియంతయుఁ జూచి యొక క్షత్రియయోధుఁడు సమీపించి "అమ్మా, మీరిఁక యుద్ధము సేయుటవలనఁ బ్రయోజనము లేదు. మనవా రందఱును నశించినారు. తురుష్కులు మిమ్ము కైదు చేయుటకుఁ బ్రయత్నించు

చున్నారు. ఏమియు బాధకలుగకుండ మిమ్ము నేను అవ్వలకుఁ గొనిపోయెదను. రండు" అని ప్రార్థించెను; గాని యందులకు ఆమె అంగీకరింపక "నేను క్షత్రియరమణినై యుండి వెనుకకు ఎట్లు వచ్చెదను? అమానుషము జరుగ నున్న దంటివి; గావున శీఘ్రముగ నన్ను సంహరించివేయుము" అని ఆత్రముతోఁ బలికెను. యోధుఁడు హతాశుఁడై "అది నావలనఁ గాదు" అనియెను. మాఱువలుకకుండ రాణి తనకుఁ దానై పొడుచుకొని చనిపోయెను. చుట్టునున్న క్షత్రియయోధులు రాణి శవము తురుష్కులకు చిక్కకుండఁ గొనిపోయిరి. దుర్గావతి కుమారుఁడు పిదప ప్రాణములు విడిచెను. మిగిలిన క్షత్రియయోధులందఱును శక్తియున్నంతవఱకును తురుష్కులను సంహరించి పిదప మడిసిరి. కోట యవనుల స్వాధీన మయ్యెను.

వీరనారియైన దుర్గావతి సమాధి యిప్పటికి జబ్బలపురముపద్ద నున్నది. బాటసారు లనేకు లచ్చటకుఁ బోయి చాల గౌరవముతోఁ జూచి అచ్చట మిలమిల మెఱయుచు నసంఖ్యాకములై పడియుండు గాజుముక్కలా సమాధిమీఁద నర్పించి పోవుచుందురు.

---

# 4. మీరాబాయి.

---

భోగలాలసుఁడగు ఉదయసింహుఁడు చిత్తోడుదుర్గమున మేవాడుసంస్థానమును బరిపాలించుచుండఁగా సార్వభౌమపదవి సంపాదించు నూహతో అక్బరు దండెత్తివచ్చెను. ఈవార్త వినిన వెంటనే ఉదయసింహుఁడు గజగజవడఁకి పోసాగెను.

కోటలోని పేరుమోసిన సరదారులందఱును వచ్చి కొలువు నిండిపోయిరి; గాని రాణా యగు నుదయసింహుఁడు యుద్ధప్రస్తావనముల జేయలేదు. అక్బరు రాకవలన ఆరక్తనేత్రులై యున్న తన సరదారులను జూచియే యాతఁడు భయభ్రాంతుఁడై మాటలాడఁజాలకుండెను. సంగతి యంతయు నెఱింగిన మంత్రి రోషముతో మండిపడుచుండియు శాంతము నభినయించుచు రాణాను బలుకరించెను. ఇప్పుడైనను ఏమి చెప్పునో యని సరదారు లందఱు నుత్సుకులై యుండఁగా రాణా సంధిప్రస్తావనము తెచ్చెను. అంతట సభయందంతట నొక్కటే కోలాహల మయ్యెను. అచ్చటచ్చట ఛీత్కారములు శ్రుతిగోచరము లయ్యెను.

మంత్రియు సేనాధిపతియు నెంతో కష్టముమీఁద కన్నీళ్లను నుడిచి "సరదార్లందఱును సంధి వలదు. రంధి నడుపవలెనని యున్నారు. మీరొక్కరే సంధిప్రస్తావము చేయుచున్నారు." అని విన్నవించిరి; గాని రాణా "రాజాజ్ఞ కభ్యంతరము చెప్పువా రెవ్వరు" అని చుఱచుఱఁ జూచుచుఁ బలికెను.

"నేను నేను" అని సరదార్లు ఒక్కరొక్కరే లేచి నిర్భీతిగఁ బలికి యూరకుండిరి. అది చూచి రాణా విపన్నుఁడై స్తబ్ధుఁడై పోఁగా మంత్రి లేచి "మీరు యుద్ధము సేయుట కంగీకరింపని చో సరదారు లందఱును మీయెడల ద్రోహులే యని నమ్ముఁడి. విశేషించి నేను వారిలోఁ బ్రథముఁడను. మొనగాఁడను" అని నిష్ఠురముగఁ బలికి కూర్చుండెను. సభలోనివారందఱును ఉత్సాహధ్వానములు సేయుచు మంత్రిని గౌరవించుట ముగిసిన పిదప సేనాధిపతి లేచి "యుద్ధము తప్పదు. మీరంగీకరించిన నొకటే యుద్ధము లేకున్న రెండు యుద్ధములు. తొలుత మిమ్ము రాజ్యభ్రష్టులం గావించి పిదప మేము మొగలాయీల నెదిరించెదము" అని నిక్కచ్చిగఁ బలికి యూరకుండెను. సభ్యులు మఱల కోలాహలము గావించిరి. రాణా చేయునది లేక యుద్ధము ప్రకటించెను. దర్బారు ముగిసెను.

యుక్తసమయమున యుద్ధము ప్రారంభ మయ్యెను. తామెంత ధైర్యముగ శౌర్యము గనఁబఱుచుచున్నను రాణా మొగము విపన్నమై యుండుటఁ గని క్షత్రియయోధులు ఉత్సాహశక్తిని గోల్పోవఁజొచ్చిరి. ఉత్సాహమునకు సంఖ్యాబాహుళ్యము ప్రాణము వోయుచుండఁగా మొగలాయీలు విజృంభింపఁజొచ్చిరి. సకలమార్గములయందును తురుష్కులు విజయమును బడసిరి. అక్బరు ఉదయసింహునిఁ బట్టుకొని చెఱలో బంధించెను.

రాజపుత్రులు కోటలోఁ బ్రవేశించి తలుపులు బిగించుకొనిరి. ప్రముఖులగు సరదారులు ఆలోచన సేయుటకు రాజసభకుఁ బోఁగా తక్కినవారు ఇండ్లకుఁ బోయిరి. వారి

లోఁ గొందఱకు స్వగృహములయందుఁగూడ నిరోధము తట స్థించెను. వారి భార్యలు, తల్లులు, అక్కసెల్లెండ్రు మున్నగు స్త్రీలు తెల్లమొగములు వేసికొని వచ్చుచున్న వారినిఁ జూచి కవాటబంధనము గావించి "రణరంగములనుండి పాఱిపోయి వచ్చినవారి మొగములు మేము చూడము. రాజును విడిచి వచ్చినవారిని మేము విడిచెదము. మానాభిమానములు లేని పురుషుఁడు భూమిమీఁద నుండిన నెంతో లేకున్ననంతియే. మమ్ము జూచుటకు మీకు సిగ్గు లేకున్నను మిమ్ముఁ జూచుటకు మాకు లజ్జ గలదు. మీకుఁ గలిగిన పరాభవము మమ్ము సహిం చుచున్నది. పొండు మేము మిమ్ము లోనికి రానీయము" అని తిరస్కరించిరి.

అమాత్యపురోగాములై కొలువుకూటమునకుఁ బోయిన యోధు లందఱును కర్తవ్యనిర్ధారణమునఁ బ్రవృత్తులైరి. "మొగలుల నోడించుట యెట్లు? రాణాను విడిపించుట యెట్లు?" ఈరెండువిషయములును జర్చకు వచ్చెను. ఎవరికిఁ దోఁచినట్లు వారు చెప్పిరి సంధిప్రయత్నములు ప్రారంభించి ఏదు ఱుపాటు గలిగించి క్రమాంతమున మీఁదఁ బడి శత్రువుల నోడించి ప్రభువును విడిపింత "మని కొందఱు చెప్పిరి." అట్ల యిన క్షత్రియులు సంధి కోడఁబడిరని యొక యపకీర్తియు మోసము చేసిరని యొక యపకీర్తియుఁ గలుగును ఇది కాదు మంచి యుపాయము" అని తక్కినవారు దానిని పూర్వపక్షము చేసిరి. వారు తెచ్చిన మార్గమును వీరును, వీరు చూపిన మార్గమును వారును కాదనుటలోఁ గాలము గడచిపోవుచుండెను.

రాణా పట్టుబడుట తెలిసిన తోడనే కోటయం దంత

టను విషాదము వెల్లివిరిసిపోయెను. కల్లోలము నలుమూలలను వ్యాపించెను. అంతటను నిరాశ తాండవింపఁదొడఁగెను. రాణియగు వీరాబాయి అంతయు విని, అంతయుఁ జూచి నిర్విణ్ణ యయ్యెను. "తురకలు గెల్చిరి. రాజపుత్రు లోడిరి. ఇఁక కోట తురకల యధీన మగును" "రాజపుత్రులు పరాభవము నెప్పుడును సహింపలేదు. నేఁడు తురుష్కులు వచ్చి అమర్యాదఁ గావింతురు." "క్షత్రియస్త్రీలను బెండ్లియాడుటలో నక్బరునకు అభిలాషయధికము. క్షత్రియులను జూచిన తురకభటులకు మతిపోవును" ఇట్టి యోచనలు అనేకము లుదయించి రాణి హృదయమునుఁ గలఁచివేయఁ గడఁగెను.

కోటలో నెటఁ జూచినను ఆయుధములు గుట్టలుపడియుండెను. ఎటఁ జూచినను ఔదాసీన్యము రూపొందియుండెను. ఏరమణి మోము గాంచినను దిగాలుపడియుండెను. ఇన్నిటినిఁ జూచుటచే తహతహలాడుచుండిన రాణి హృదయమున "దీనికిఁ బ్రతీకార మేమి?" యని యొక ప్రశ్న తోఁచెను. ఈప్రశ్న యెంతోసేపు నిలువలేదు. "వీరవిహారమే ఇందులకుఁ బ్రతికార" మని యామె నిశ్చయించుకొనియెను. తోడనే కోట నలుమూలలను జెదరియున్న వివిధము లగు నాయుధములు ఆమె పౌరుషమును, శౌర్యసాహసములను తట్టి మేల్కొల్పెను. చూచుచుండఁగా నామె మొగము జేవురించెను. చూపులు కఠోరశరము లయ్యెను. మేన అతిలాఘవము తోఁచెను. ఉత్తరక్షణమునందే యామె మగవేషము దాల్చి ఆయుధములను గైకొని అశ్వారోహణము గావించి కొలువునకు

బయలుదేఱెను. ఇది యంతయుఁ జూచుచున్న రమణులు కొందఱు రాణి ననుకరించిరి. కొందఱు ఆశ్చర్యచకితులైరి.

రాణి కొలువుకూటమునకు వచ్చునప్పటికి సరదారులు ఇంకను ఆలోచనలయందే మునిఁగియుండిరి. అందులకు చాల నసంతృప్తయై రాణి తటాలున గుఱ్ఱము దిగి కొలువు సొచ్చెను. అందఱును చకితులై లేచి నిలిచిరి. రాణి వారి నడుమ నిలిచి యిట్లు చెప్పెను.

"నేఁటితో రాజపుత్రుల రక్తము విఱిగిపోయినదా? రాణావారిని తురకల కప్పగించి మీరేమని యీకొలువులోఁ గూర్చున్నారు? రాణావారు బందెయందును; మీరు కొలువు నందునా? మీరు మేవాడుగద్దెను ధనాశతోఁ గొల్చినారు; గాని భక్తితోఁ గాదు. అభిమానముతోఁ గాదు. రాణావారి యెడల మీకు భయమును లేదు. భక్తియును లేదు. మీయందు క్షత్త్రియరక్తమును లేదు. పూర్వుల యంశయు లేదు. మీ ఖడ్గములకు నైశిత్యమును లేదు. మీకు సాహసమును లేదు. ఇంతవఱకును జితోడుదుర్గము అభిమానధను లగు వీరులకు నిలయము. ఇప్పుడు ద్రోహులగు భీరులకు మందిరము. రాణావారి సంధిప్రస్తావము విని మండిపడుచు నెగసిపడిన మీరె పుడు మొగలాయీల సింహనాదములు విని వెనుదీయుచుఁ దుల్లిపడుచున్నారా? ప్రాణములు నిలిచె నని మీరు అనుకొనుచున్నారు; కాని శూరులును వీరులును ఒక్కమాఱే చచ్చెదరు. మీరు అనేకపర్యాయములు చచ్చెదరు. కానిందు నాకు చింత లేదు; శత్రువు వచ్చి తలుపు తట్టుచున్నాఁడు. మీరు నో రెత్తకుండఁ బడియుండుఁడు. ఇదే నేను వెడలుచున్నాను.

చిత్తోడుదుర్గమున క్షాత్త్రము లేకపోలేదని శత్రువు తెలిసికొనును; గాని మీరు బెంగ పెట్టవలదు. మీరు శాశ్వతముగా నుందురు."

ఇట్లు చెప్పి యామె తటాలున గుఱ్ఱముమీఁద కెగిరెను. క్షత్త్రియులకు బల్లెములతోఁ బొడిచినట్లయ్యెను. పురుషులు దారి తెలియక గింజుకొనుచుండుట. స్త్రీ సాహసించి మార్గము చేసికొనుట. ఇంతకంటె శూరుఁడ ననుకొనువానికి మరణము మేలుగాదా? అందఱును ఇట్లు తలఁచి, "ఇక్కడ రాణి పొడిచి మనలను చంపినది. అక్కడ మనము వైరినిఁ బొడిచి బ్రతికి నత్తము" అని నిశ్చయించుకొని చూచుచుండఁగాఁ గాలాగ్నులై గుఱ్ఱము నెక్కి రాణి వెనుక బయలుదేఱి "తల్లీ, మా ప్రాణములు నీవి. మేము రాజపుత్త్రులము కాకపోలేదు. ముసుఁగుతొలఁగిపోయినది. చూడుము మాయందుఁగల క్షాత్త్ర తేజము" అని పలుకుచు యుద్ధరంగముఁ జొచ్చిరి.

విజయగర్వమునఁ బరవశుఁడై యున్న యక్బరు ఈనూతనోపద్రవమును విని జంకెను. మొగలాయిసిపాయిలు ప్రభువు నాజ్ఞ కాకమున్నే కత్తి కలిపిరి. సంకులసమరము ప్రారంభ మయ్యెను. మేఁకలమందలో బెబ్బులియు, గజయూథమున కేసరియు, దూదిరాశిలో అగ్నికణమును బడినట్లయ్యెను. యవనసైన్యము భయభ్రాంత మయ్యెను.

అక్బరుసైన్యము అతిస్వల్పసంఖ్యాకు లగు రాజపుత్త్రుల నైనచో సులభముగ జయించియుండును; గాని దాని కట్టి యదృష్టము పట్టలేదు. ఒక తురక కొక రాజపుత్త్రుఁడు లేని లోపము భయము తీర్చెను. ప్రతియవనుని భీతి దృఢముగ నెదిరిం

చెను. భయము, ధైర్యకంచుకమును బ్రద్దలుసేయనంతవఱకే మనుజునకు జయాశ. పిదప నిఁకేమున్నది? హతశేషులగు నసంఖ్యయవనులు పలాయనము చిత్తగింపసాగిరి. అక్బరును సంధిని సూచించు బావుటా నెత్తెను. అది చూచి రాణి పాఱిపోవుచున్న తురుష్కులను సంహరించు తన భటులను వెనుకకుఁ బిలుచుకొనియెను. అక్బరు ఉదయసింహుని వెంటనిడుకొని వచ్చి "నీశౌర్యప్రతాపము లద్వితీయములు. ఓడిపోవచ్చితిని. వచ్చి యోటుపడితిని. నీకత్తి కెదురు లేదు. నీప్రతాపమునకుఁ బ్రకాశము గలిగించినవాఁడ నని యెంచియైనను నన్ను ననుగ్రహింపుము" అని పలికెను. విజయగర్వితయగు వీరాబాయి అతిగంభీరముగ తల యూపి కన్నులతోఁ గరుణించెను. అక్బరు "బ్రతికితిని" అని ద్రుతగమనంబున వెడలిపోయెను.

రాజపుత్రయోధులు ఆనందధ్వానములు చేయుచు రాణిని, రాణాను ఏనుఁగుమీఁద నెక్కించి యూరేగించుచు మహావైభవముతో కోటలోనికిఁ గొనిపోయిరి. చిత్తోడుదుర్గము పూర్వశోభను దాల్చెను. కారణము రాణాప్రభావము గాదు. వీరభటుల శౌర్యము గాదు. సేనాధిపుల ప్రతాపము గాదు. అబల మగఁటిమి. ఎన్నఁడును యుద్ధమునకుఁ బోయి యుండని అసూర్యంపశ్యయగు రమణియాత్మబలము. సజాతీయసంబంధమువలన వ్యక్తులకు ఆనందోత్సాహములు వర్ధిల్లును. వీరాబాయి శౌర్యము చిత్తోడుదుర్గాధిదేవతకు ఉల్లాసము ఒదవించెను.

# 5. కర్మదేవి.

---

రాజపుత్రస్థానమునందలి పౌరింతసంస్థానమునకుఁ బ్రభువు అగు మోహిలరాజు మాణిక్యరాజునకు ఒక కొమార్త కలిగెను. లేకలేక కలిగిన సంతాన మగుటచే తలిదండ్రు లామె నతిప్రేమతోఁ బెంచుకొనుచు "కర్మదేవి"అని పేరుపెట్టిరి. మాణిక్యరాజు యుక్తసమయమున కర్మదేవికి విద్యాభ్యాసమునకుఁ బ్రారంభించెను.

గ్రహణశక్తి కలిగినది మొదలు కర్మదేవి యోధుల చరిత్రలను వినుటయం దధికాదరము చూపఁజొచ్చెను. ఇది యెఱింగి మాణిక్యరాజు రాజపుత్రస్థానమునకుఁ బ్రసిద్ధి గలిగించిన పూర్వయోధుల చరిత్రములను, భారతభాగవతరామాయణములయందలి రామకృష్ణాదివీరుల ఇతిహాసములనుకొమార్తెకు వినిపించుచుండెను. ఈకారణమువలన కర్మదేవి పదునాలేండ్ల జవ్వని యగునప్పటికి "వీరులే ధన్యులు. వీరవిహారమే ధర్మవిహితము. ఇహలోకమున సుఖమును, యశస్సును, పరలోకమున ఆనందమును వీరుల సొమ్ము" అని సిద్ధాంతము చేసికొనెను. మఱియు నప్పుడు రాజపుత్రస్థానము నలంకరించు యోధుల తారతమ్యమును నిశ్చయించుచు నామె యానందముతోఁ గాలము గడపసాగెను. అందఱ యందు సాధుకుమారుఁడనిన నామెకు అధికప్రీతి.

సాధుకుమారుఁడు పూగల్ పరగణాధిపతియగు రాణా రణవంగ దేవుని కుమారుఁడు. ఆతఁడు అసామాన్యవీరుఁడు. అనే

క దేశములను జయించిన జోదు. నాగూరు మొదలుకొని సింధు నదివఱకును గల భూభాగమునఁ గల యనేకవీరులు అనేకప ర్యాయము లాతని కోడిపోయిరి. ఎట్టి వీరులైనను గూడ సాధు అనిన గడగడవడఁకిపోవుచుండిరి.

శ్రవణమునకుఁ దోడుగ దర్శనముగూడ నగుటచే కర్మ దేవిహృదయము పూర్తిగ నాతనిమీఁద హత్తుకొనెను. సాధు ఎక్కడకు దండెత్తిపోయినను ఔరింతనగరమునుండియే పోవు చుండును. ఆతఁడు యుద్ధమునకుఁ బోవునపుడును, విజయలక్ష్మినిఁ జేకొని స్వస్థలమున కరుగునప్పుడును మాణిక్యరాజు అనేకప ర్యాయములు తన యింటికిఁ గొనిపోయి గొప్పగొప్పసత్కార ములును, విందులును జేయుచుండెను. ఈరూపమున సాధునకును, మాణిక్యరాజునకును మొదట పరిచయమును, పిదప స్నేహము నధిక మయ్యెను. సాధు తమ యింటికి వచ్చినపు డెల్ల కర్మదేవి ఏతలుపుమాటుననో నిలిచి ఆతని సంభాషణము విని రూపముఁ జూచి ఆనందపరవశ యగుచుండును.

ఒకనాఁడు కర్మదేవి మేడమీఁద కురు లార్చుకొనుచుం డఁగా సాధుకుమారుఁడు గుఱ్ఱముమీఁద ఆమేడక్రిందనుండి పోయెను. అప్పు డొకరి నొకరు చూచుకొనిరి ఈచూపు కర్మ దేవి ప్రణయమును స్థిరపఱిచెను; సాధునకు కర్మదేవియెడలఁ బ్రణయము గలిగించెను. వారొకరి కొకరు రహస్యముగ మనస్సులు ధారవోసికొనిరి. అక్కడ నుండి సాధు శీఘ్రముగనే వెడలిపో యెను; గాని మనస్సుమాత్రము "కర్మదేవి ఎప్పుడు నాస్వా ధీన మగు"నని యాందోళపడఁజొచ్చెను. ఆయువయువతులు

ఇతరేతరానురక్తు లగుట ఈశ్వరునకుఁ దక్క మఱెవ్వరికినిఁ దెలియదు.

ఇట్లుండఁగా కొమార్తె వివాహయోగ్య యగుచుం డుటఁ జూచి మాణిక్యరాజు వరాన్వేషణము ప్రారంభించెను. ఆతఁ డనేకరాజపుత్త్రులను గుఱించి విమర్శ చేసిచేసి తుదకు ముందరాధిపతి యగు రాజాచండుని నాల్గవకుమారుఁ డగు అరణ్యకమలుని నిశ్చయించెను. అరణ్యకమలుఁడు రూపము నందును, శౌర్యమునందును, ఐశ్వర్యమునందునుగూడ రాజపు త్త్రులలోఁదీసిపోఁడు మాణిక్యరాజు తాను తెచ్చిన సంబంధము నకు కర్మదేవి ఆనందముతో నంగీకారము చూపు నని తలం చెను. అరణ్యకమలుఁడు తనవలెనే కర్మదేవి సైతము వివా హామునిమిత్తము త్వరపడుచుండు నని యూహించి యుప్పొం గిపోవుచుండెను. కర్మదేవి చెలికత్తెలు మంచివరుఁడే లభించె నని యానందింపసాగిరి.

కాని తనకు అరణ్యకమలుని నిశ్చయించి రను వార్త కర్మదేవి వినిన వెంటనే చకిత యయ్యెను. "ఇదేమి యన్యా యము? తనకు ప్రాణస్నేహితుఁ డగు సాధును నాతండ్రి యేల మఱచిపోయినాఁడు?" అని యామె తహతహపడఁజొచ్చెను. కర్మదేవి యనేకవిధములఁ బరితపింపఁజొచ్చెను; గాని పైకి అతిగంభీరముగ నుండెను. తన నిశ్చయము నెవ్వరికినిఁ జెప్ప లేదు.

వివాహదినము సమీపించుచుండెను. ఏర్పాటు లన్ని యు నతిశీఘ్రముగను మిగుల గొప్పగను జరుగుచుండెను; గాని కర్మదేవి ముఖము ఆనందమునకు మాఱుగ విషాదచిహ్నము

లకును, విసుగులకును నిలయమై యుండుటఁ జూచి ఆమె చెలిక త్తెలు సందేహపడఁజొచ్చిరి.

ఒకనాఁడు కర్మదేవి గవాక్షమునఁ గూర్చుండి చింతించుచుండెను. వేళాకోళములు చేసి యామె నానందపెట్టఁ దలఁచి చెలికత్తె యొకతె వచ్చి ఆమె ముఖము చింతాక్రాంతమై యుండుటకు అబ్బురపడి సమీపించి చేతులు పట్టుకొని "సఖీ, నీవివాహము సమీపించుచున్నది. ఆడుచుఁ బాడుచు నవ్వుచుఁ గేకిసలు కొట్టవలసిన దినము లివి. ఇట్లు దుఃఖించెదవేల?" అని ప్రశ్నించెను. కర్మదేవి అందులకు సరియగు ప్రత్యుత్తర మీయక ఏదో ప్రస్తావన చేసి యీవిషయమును మఱపింపవలయు నని ప్రయత్నించెను; గాని ప్రయోజనము కలుగ లేదు. చెలికత్తె చెప్పక తీరదని పట్టు పట్టుకొని కూర్చుండుటచే కర్మదేవి తుదకు చేయునది లేకసంగతి యంతయు నెఱింగించి "నేను బ్రతికి యుండఁగోరితి రేని నాకు వ్యతిరేకము చేయవలదు" అని మాయయ్యతోడను, మాయమ్మతోడను, జెప్పుమని పలికెను. ఇది వినిన వెంటనే చెలికత్తె యులికిపడి "ఇదెట్లు? అంతయు సిద్ధమైనదానినిఁ ద్రిప్పుట యెట్లు?" అని తెల్లవోయెను. "నన్ను అరణ్యకములన కిచ్చి పెండ్లి చేయుటకు మీరు సర్వమును సన్నాహము చేసికొనినారు. నేను ప్రాణములు విడువవలయు నని సర్వమును సన్నాహము చేసికొనినాను. అది యెట్లో యిదియు నట్లే" యని కర్మదేవి యందులకు నిష్ఠురముగా జవాబు చెప్పఁగా చెలికత్తె హతాశయై వెడలి యిది యంతయు కర్మదేవి తలిదండ్రుల కెఱింగించెను.

వారికి ఈవార్త అశనిపాతమువలెఁ దోఁచెను. చెలికత్తెల కంఠములకును వజ్రాఘాతవలెఁ దోఁచెను. అందఱును చుట్టుముట్టి కర్మదేవి హృదయము త్రిప్పుటకుఁ బ్రయత్నించిరి; గాని ప్రయోజనము కలుగలేదు. "నాకు రెండు హృదయములు లేవు రెండు నాలుకలు లేవు. రెండవభర్తను నేనంగీకరింపను. నేను సాధు పదదాసిని" అని యామె కచ్చితముగఁ జెప్పెను. ఆమె తలిదండ్రులు తహతహపడిరి. చెలికత్తెలు గగ్గోలువడిరి.

"ఇదెట్లు పొసఁగును. నిశ్చయమైన సంబంధమును త్రిప్పివేయుట యెట్లు? మర్యాద పోయినను యుద్ధము పొసఁగును. అరణ్యకమలుఁడు ఊరకుండఁడు. బలవద్విరోధము మంచిది గాదు." మాణిక్యరాజు ఇట్లు చింతింపఁజొచ్చెను. అయినను ఆతఁడు కొమార్త మాట జవదాఁటఁజాలఁడు. తుదకు ఆమె యిష్టము వచ్చినట్లు చేయుటకే నిశ్చయించుకొని "నా కొమార్త యింతకుఁ బూర్వమే సాధుకుమారుని వరించియున్నది అది తెలియకఁ మీకు మాటఁ యిచ్చితిని. నా కొమార్తను సాధున కిచ్చి పెండ్లిచేయుటకు అనుజ్ఞ నియవలసిన" దని అరణ్యకమలునకును, "నా కొమార్త నీమీఁద బద్ధానురాగయై యున్నది. వచ్చి పెండ్లియాడవలసిన" దని సాధుకుమారునకును మాణిక్యరాజు వార్త లంపెను. అరణ్యకమలుఁడు మండిపడెను. సాధు పొంగిపోయెను.

తరువాత అచిరకాలమునందే కర్మదేవిని సాధు వచ్చి పెండ్లియాడెను ప్రజలందఱును ఆనందపరవశులై యుండఁగా అరణ్యకమలుఁడు ఈవార్త విని "నాకు ఇచ్చెద మన్న పిల్లను బెండ్లియాడి నాకవమానము గలిగించిన సాధును సంహరిం

చినఁ గాని నేను క్షత్రియుఁడను గాను” అని ప్రతిజ్ఞ పూని యుద్ధసన్నద్ధుఁడు కాసాగెను. ఇది విని యూరింతసంస్థానము నందలి జనులలో కొందఱు “ఈతప్పు కర్మదేవి” దనిరి. కొందఱు మాట త్రిప్పుకొనుట మాణిక్యరాజువంటివానికిఁదగ ద నిరి. వేఱొకకొందఱు “అరణ్యకమలునకు నిశ్చయించిన కన్య ను బెండ్లియాడుట సాధునకుఁ దగ” దనిరి. కొండొకకొందఱు “ఏది యెట్లయినను యుద్ధము తప్పదు. అదే మగునో మనము చెప్పఁ జాల” మని యూరకుండిరి. కర్మదేవియు, సాధుకుమా రుఁడును అరణ్యకమలుని ప్రయత్నముల వినియు నిశ్చింతులై బ్రహ్మానందపరవశులై యుండిరి. మాణిక్యరాజు ఆలోచనా ధీనుఁ డయ్యెను.

ఒకమాసము గడచినతరువాత సాధు అత్తమామల యనుజ్ఞను బడసి తన యేడువందల సైనికులు సంగరక్షకులై నడువ కర్మదేవిని వెంట నిడుకొని పయన మయ్యెను. “మా ర్గమున అరణ్యకమలునివలన నపాయము వచ్చు” నని శంకించి మాణిక్యరాజు తన అయిదువందల సైనికులను అల్లునకు సా యమిచ్చెను. ఇట్లు పండ్రెండువందల సైనికులతోఁ దను సాధు బయలుదేఱిపోవుచుండఁగా మార్గమధ్యమున భీకరారణ్యము లో అరణ్యకమలుఁడు వారి నడ్డగించెను. అంతట సంకుల సమరము ప్రారంభ మయ్యెను.

సాధుతోఁగూడ కర్మదేవియు వైరిసంహారము ప్రారం భించెను. కొంతసేపు అగునప్పటికి ఉభయసైన్యములయం దును చాలమంది భటులు కూలిరి. అది చూచి అరణ్యకమ లుఁడు తన కపజయము వాటిల్లు నని జంకి యొక యుక్తి

పన్నెను. ఆతఁడు యుద్ధము మాని "సైనికులను బండోరులు చంపుకొనుట మంచిది గాదు. నీవు నిజమైన క్షత్రియుఁడవేని నాతో ద్వంద్వయుద్ధమునకురమ్ము. విజయలక్ష్మి యెవరిని వరించునో కర్మదేవివారి సొత్తగును." అని కబురంపఁగా సాధు కర్మదేవి యనుజ్ఞను బడసి వల్లె యని ఖడ్గపాణియై అరణ్యకమలుని యెదుట నిలిచెను.

సాధును జూచిన వెంటనే అరణ్యకమలుని రోషాగ్ని ప్రజ్వలించెను. రక్తము కపోష్ఠం బయ్యెను. బాహువులు స్ఫురించెను. ఈశౌర్యసన్నాహము నాపుకొనఁజాలక యాతఁడు "కాచికొనుము" అని సాధుపై నుఱికెను. సాధుగూడ అప్రమత్తుఁడై యుండెను; గావున అతనితోఁ సరిగ కలియఁబడెను.
ఒకటిరెండుగడియ లావీరులు అద్భుతముగఁ బోరి, పిదప నిరువురును ఒక్కమాఱే మూర్ఛితులై పడిపోయిరి. సాధు ఆపడుటయే పాటుగ స్వర్గమునకుం బోయెను. అది చూచి కర్మదేవి చితిపేర్ప భటుల కాజ్ఞయిచ్చెను.

క్షణములో చితితయారయ్యెను. కర్మదేవి యానందముతో నచ్చటకు వచ్చి భర్త కళేబరమును చితిపై నధిరోహింపఁజేసి తన ఎడమచేతిని నఱికికొని దాని నొక భటునికిచ్చి "నీవు దీనిని మామామగారి కిచ్చి మీకోడలు మీకిఁకఁ గాన్పింపదు. ఆమె భర్తతో ఆనందధామమునకుఁ బోయినది; గావున జ్ఞాపకార్థము ఆమె తన చేతిని మీకుఁ బంపినది. "అని చెప్పు" మనియెను. వాఁడు ఆచేతినిఁ గొనిపోయిన తరువాత కర్మదేవి మఱియొక భటునిఁ బిలిచి తన కుడిచేతిని నఱుకు మనియెను. వాఁడందులకు జంకియు తుదకు చేయునది లేక అట్లే చేయఁగా

కర్మదేవి వాని కాహస్తము చూచి "నీవు దీనిని నాతలిదండ్రుల వద్దకుఁ గొనిపోయి యిచ్చి "మీకొమార్త మీయల్లునితోఁ గూడ పరలోకమునకుఁ బోయినది. పోవుచుఁ బోవుచు జ్ఞాపకార్థము ఈచేతిని మీకుఁ బంపినది." అని చెప్పు నాజ్ఞాపించెను. వాఁడు ఆచేతినిఁ గొనిపోయి అట్లే చేసెను.

ఇట్టి కోడలును అట్టి కుమారుఁడును తన కెట్లు దక్కెదరని కొంతతడవు రణరంగదేవుఁడు విచారించి తుదకు మనసు రాయి చేసికొని కోడలి కరమున కగ్నిసంస్కారము గావించి యచ్చోట నొక గొప్ప సరోవరమును నిర్మించి దానికి కర్మసరోవర మని పేరు పెట్టెను.

ఆసరోవర మిప్పటికిని గలదు.

# 6. మైనాబాయి.

ధారానగర సంస్థానప్రభు వగు ఆనందరావు ఇరువది సంవత్సరముల వయస్సు వచ్చునంతదనుక మాతామహుఁ డగు బడోదామహారాజు నింటఁ బెరిగి పిదప తల్లిచే నుద్బోధితుఁడై ధారానగరమున కరిగి "నాసంస్థానవ్యవహారము లన్నియు నాకు స్వాధీనము చేయుఁడు" అని యడిగెను; గాని మంత్రులు సేనానులును ద్రోహచింతనులై "ఈరాజ్యము మాస్వార్జితము. నీకేమియు లేదు. పొమ్ము" అని పోనడచిరి. మంత్రిప్రభృతులు ద్రోహులైనను ప్రజలుమాత్రము "మాప్రభువు ఎన్నఁడు వచ్చి మమ్ము పరిపాలించు" నని యాతనికొఱకు ఎదురుచూచుచుండిరి. అగుటచే వారిలోఁ బ్రముఖులు మంత్రుల నోడించి సంస్థానము నానందరావు స్వాధీనము చేసిరి.

కాని గద్దె యెక్కినదిమొదలు ఆతని కనేకకష్టములు కలిగెను. ఎప్పుడును సుఖ మను మాటయే యాతఁ డెఱుఁగఁడు. అయినను విసిగికొనక దైవమును నమ్మి యాతఁడు కష్టముల నెదుర్కొనఁగా నింతలో చనిపోయెను. అప్పటికి ఆతని భార్య యగు మైనాబాయి గర్భవతియై యుండెను. గర్భమున నున్న బిడ్డకొఱకు సంస్థానమును రక్షించుట విధి యని యామె యాభార మంతయు వహింపఁబోవుచుండగా మురారిరావు అను దాయాది దౌర్జన్యము చేసి సంస్థానము నాక్రమించుకొనెను. ఇంతలో రాణికి ప్రసవసమయము సమీపించెను. అప్పుడామె ధారానగరములో బ్రసవించుట మంచిది గాదని తలఁ

చి ఇందూరుపట్టణమునకు వెళ్లి యచ్చట మగబిడ్డను గని యెను. బాలునకు రామచంద్రరావు అని పేరుపెట్టి మైనా బాయి పరమానందభరితయై కుమారుఁడు కలిగెను; గావున "ఇఁక సంస్థానము స్వాధీనము చేసికొనుటకుఁ బ్రయత్నింపవచ్చును" అని తలఁచెను.

ఇందూరులో రాణి యిట్టి యాలోచనతో నుండఁగా ధారానగరము కోటలో నున్న కిల్లేదారు రాణిపక్షము నవలంబించి బాలునిపేర వ్యవహారమంతయు జరుపఁ జొచ్చెను. ఇది యెఱింగి మురారిరావు మోసము చేసి బాలుని మైనాబాయిని రూపుమాపఁ దలఁచి "మీయాజ్ఞకు బద్ధుఁడను. సంస్థానము బాలునకు వశము జేయఁగలవాఁడను. మీరు వచ్చి ధారానగరముననే నివసింపవలె" నని వర్తమానములు చేయుట ప్రారంభించెను.

కొన్నిదినములు జరిగిన పిమ్మట మైనాబాయి మురారిరావుమాటలు నమ్మి ధారానగరమునకు బయలుదేఱెను అది విని మురారిరావు తన పక్షమున నున్నవారిని అనేకులను ఆమెకు ఎదురు పంపెను. వారందఱును బోయి "మా ప్రభువు మాగ్రామము వచ్చుచున్నందులకు సంతోషము. మురారిరావు ఇప్పుడు కేవలము మీపాదములను గొలుచుచుఁ గాలము గడుపుటకు కుతూహలపడుచున్నాఁడు. తల్లీ, ఎట్టి క్రూరజంతువైనను ఒక్కొక్కప్పుడు శాంతముగఁ బ్రవర్తించుట సహజమే గదా? ఇంతకును మేమందఱమును మీపక్షమున వాదించుటచే కోరలు పెఱికిన పామువలె మురారిరావు మీపాదముల నాశ్రయింపఁదలఁచినాఁడు" అని యామెకు నమ్మఁజెప్పి ధారానగర

మునకుఁ గొనివచ్చి యొక భవనమున విడియించిరి. వెంటనే మురారిరావు ఆభవనమునకు విచ్చుకత్తులు గూనిన భటులను కాపలా వేసెను. దానిని తగులఁబెట్టుటకుఁగూడ నాలోచనలు సాగించెను.

ఇది యెట్లో తెలియఁగా రాణిగారి పరిచారకులు "తల్లీ, మోసముపోయి మనము బెబ్బులి గుహాలోఁ బ్రవేశించితిమి. విచ్చుకత్తుల భటులను కాఁపుపెట్టినంతమాత్రమున మురారిరావునకు తృప్తి కలుగుట లేదు ఆతఁడు ఈభవనమునకు నిప్పుముట్టింప నూహించుచున్నాడు; కావున తాము ఇక్కడ నుండుట క్షేమము గాదు. పురుషవేషము ధరించి తమ రిక్కడనుండి తప్పించుకొనిపోవుట మంచిది. కిల్లేదారు మన పక్షమున నున్నాఁడుగదా? వ్యవహార మంతయు నాతని కెఱిగించి ఉపాయము నెఱింగి వచ్చితిమి" అని పలికిరి; గాని మైనాబాయి అందులకు అంగీకరింప లేదు. "మీరు చెప్పినది నామంగళము నిమిత్తమే యనుట యథార్థమే; గాని యట్లు చేసిన నేనుగును? మనము మఱియొకచోటికిఁ బాఱిపోయినంతమాత్రమున మురారిరావునకుఁ బ్రతిక్రియ చేసినవార మగుదుమా? మనము పోయినచోటఁగూడ మఱల మురారిరావు ఇట్టి ప్రయత్నమే చేసిన నేమి చేయఁగలము? నాపుట్టింటివారునుగూడ నెప్పుడును పగఱకు వెన్నిచ్చి యెఱుఁగరు. వారి కీర్తికి భంగము కలిగించుపని నేనేల చేయవలయును? మీరు జాగ్రత్తగా నుండుఁడు. శత్రువులు దౌర్జన్యము తలపెట్టినచో మీప్రతాపము చూపి సాగిన శత్రుసంహారము గావింపుఁడు. లేకున్న వీరస్వర్గమునకుఁ బోవుఁడు. మన కివి రెండేమార్గములు. ఈసందర్భ

మున నాకు మరణము సంభవించినచో సహగమనము చేసిన రమణులు పోవు చోటికే పోఁగలను. ఇఁక మాఱుపలుకక మీాకు మీాపనిమీాఁద నుండుఁడు" అని చెప్పెను. అప్పు డొక దాసి "తల్లీ, మన కండఅకును బాలుఁడే జీవము. బాలునైన నిరపాయస్థలమునకుఁ జేర్చుట మంచిదిగాదా? నాబిడ్డ నిక్కడ నుంచి బాలరాజును సురక్షితస్థలమునకుఁ జేర్చెదను. ఇందుల కైన నంగీకరింపుము" అని ప్రార్థించెను. రాణి "యీాయుపాయము మంచిది" అని చెప్పి బాలుని ఈయఁగా దాసి తనబిడ్డను రాజపుత్రుని స్థానమున నునిచి రాజపుత్రుని తీసికొనిపోయెను. బాలుఁడు కోటలోఁ బ్రవేశించె నని వినిన తరువాత మైనాబాయి విచారరహితయై "నాఁకిఁక బెంగలేదు. మురారిరావు యుద్ధమునకు వచ్చినచో రానిమ్ము" అని చాల ధైర్యము వహించెను.

పిదప నామె తన భటులు ఎంత ప్రాణములకుఁ దెగించి తన్ను రక్షించుచున్నను వారివలన జయము గలుగుట పొసఁగ దని తలఁచి శిందేసర్కారునకును, ఇంగ్లీషువారికిని "నేనిట్టి విపత్తులో నున్నాను. వచ్చి సాయము చేసి రక్షింపవలసినది" అని సందేశము నంపెను; గాని వారెవరును రాలేదు. మైనాబాయి "సాయము వచ్చినవారికిఁ గూడ దేవుని సాయము లేకున్నఁ బ్రయోజనము లేదు; గావున నేను దేవుని నొక్కనినే సాయము గోరెదను" అని దేవునినే నమ్ముకొని ప్రార్థనలు సేయుచుండెను.

రాణి యిట్లు వారిని సాహాయ్యము గోరుట విని మురారిరావు "చూడు మిప్పుడే నిన్ను నేలఁబెట్టి కొట్టెదను" అని కో

ప్రోద్బలుఁ డయ్యెను. రాణి యందులకు "అభ్యంతరము లేదు. నీవు వీరుఁడవైనచో నేను సిద్ధముగనే యున్నా" నని బదులు పంపించెను. మురారిరావు మఱింత యాగ్రహపడి యుద్ధము నకు సిద్ధము కాసాగెను.

ఇంతలో బడోదానుండి మంత్రి తమ్ముఁడగు సఖారాంచిమణాజీఅను నాతఁడు గొప్పసైన్యముతో రాణికి సాయముగా వచ్చుచున్నాఁడని వార్త వచ్చెను. తోడనే మురారిరావు ధారానగరమును విడిచిపాఱిపోయెను. సంస్థానము నిరాటంకముగా మైనాబాయి హస్తగత మయ్యెను. ఇంతలో సఖారాంచిమణాజీ వచ్చి చేరికొనియెను. రాణి బాలునిపేర పాలనము ప్రారంభించెను.

సఖారాంచిమణాజీకి ధారానగరము వచ్చుటకు రెండు కారణములు గలవు రాణికి సాయము చేయుట ప్రత్యక్షకారణము. తన్మూలమున ధనసంపాదనము పరోక్షకారణము. ఇది పరోక్షమే యైనను దృఢతరమును, చిమణాజీని బడోదానుండి బయలుదేఱఁదీసినదియు నిదియే. అగుట నాతఁడు రాణి స్వయముగఁ బరిపాలనము సాగించుటకు అంగీకరింపలేదు. రాణి యాతని దుర్బుద్ధిని ఎఱింగి చాతుర్యమువలన ఆతని యాటలు సాగనిచ్చినది కాదు. చిమణాజీ చేయునది లేక తుదకు ఆమెకు మంత్రిగాఁ జేరెను.

వచ్చిన యాపదలు అన్నియు ధనసాధ్యములే యగుట వలన సంస్థానమునకు అప్పులు పెరిగిపోయెను. చిమణాజీయు, రాణియు చాల మార్గములఁ బ్రయత్నించిరి; గాని ప్రయోజ

నము కలుగలేదు. మఱల మార్గాన్వేషణము చేయనూహిం చుచుండఁగా చిమణాజీ స్వర్గమునకుఁ బోయెను. పిదప బాపూరఘునాథరావు అను నాతఁడు దివాను అయ్యెను. రాణి అతని సాయమున పరరాజ్యములమీఁదికి అనేకపర్యాయములు దండెత్తిపోయి విశేషధనము సంపాదించి అప్పు లన్నియు దీర్చివేసి సంస్థానమును నిష్కంటకము చేసెను. ఆమె ననేకవిపత్తు లెదుర్కొనెను; గాని వానికి ఆమె లొంగలేదు. అన్నిటిని జయించి ఆమె పెద్దవాఁడైన తరువాత కుమారునకుఁ బట్టము గట్టెను. ఆ దేశమున జనులు ఇప్పటికిని మైనాబాయిని పొగడి చేమొత్తిమ్రొక్కెదరు.

# 7. రాణీసాహేబుకువరు.

---

రాజాసాహేబుసింహుఁడు పంజాబుదేశమునందలి పాటియాలసంస్థానమును బరిపాలించుచుండెను. ఆసంస్థాన మాతనికిఁ బూర్వార్జితము; గాని స్వార్జితము గాదు. తండ్రి యనంతర మాతఁడు యథాశాస్త్రముగ సింహాసనము నెక్కెను. ఆసమయమునకుఁ దగిన మహోత్సవము లన్నియు ముగిసిన తరువాతఁ బరిపాలమున ప్రారంభ మయ్యెను.

వంశక్రమము ననుసరించి సింహాసన మెక్కుట సులభమే. అయినను పరిపాలనము సులభము గాదు. రాజుబిడ్డయైనంతమాత్రమున పాలనాసామర్థ్యము కలిగితీఱు నని యెక్కడను నిశ్చయము లేదు. నిలిచినను నిలువకున్నను ఆధిపత్యమునకును, ఐశ్వర్యమునకును వంశక్రమము కలదు; గాని తెలివితేటలకు లేదు. రాజాసాహేబుసింహునకు సింహాసన మెక్కక పూర్వ మున్న యానందము ఎక్కిన తరువాత నిలువదయ్యెను. ఆతని యసామర్థ్యమును గుర్తించి మంత్రులు, సేనాధిపతులు మున్నగు ప్రధానోద్యోగులు ద్రోహచింతను లైరి.

లోకములో నొక విధమైన మనుజులు తఱుచు కానంబడుచున్నారు. వారు స్వయముగఁ గ్రహింపఁజాలరు. ఒకరు చెప్పిన వినరు. అవివేకుల మని యంగీకరించుట యవివేక మనియు, నగౌరవకారణము అనియుఁ దలఁచి వారు బ్రతికియున్నంత కాలము నవివేకకృత్యములనే గావింతురు. అట్టివారి బుద్ధిని మఱలించుటకు ఎన్ని స్థలములయందో ఎందఱో ప్రయత్నిం

చిరి; గాని తుద కందఱును విఫలు లయిరి. తనకుఁ దెలియక, ఒరులు చెప్పిన విననివారికి సర్వజ్ఞతాహంకారము సాగరము వలె నపార మని తోఁచుచున్నది.

రాజాసాహేబుసింహుఁడు యథార్థమున సవివేకియే; గాని పైని వర్ణింపఁబడినవానిలోఁ జేరఁడు. ఆతఁడు తన యవివేకము నంగీకరించెను. "ఇట్లే యూరకున్న రాజ్యమున కపాయము వచ్చు"నని యూహించి యాతఁడు తన చెల్లెలిని పాలనావిషయమున సాహాయ్యముఁ గోరెను.

రాణీసాహెబుకువరు రాజాసాహేబుసింహునకు గారాబుచెల్లెలు. ఆఁడుదియే; గాని యామె రాజకార్యములయందు అసాధారణప్రతిభాశాలిని. యుద్ధవిద్యయందు అసమానప్రజ్ఞ నార్జించి జంకు నెఱుఁగని యోధురాలు. ఆమె బారీదువాబున కధీశ్వరుఁ డగు సరదార్ జయమల్లసింహుని వివాహ మయ్యెను. అన్నగారి యాహ్వానము నంగీకరించి పతి యనుమతిఁ బడసి యామె పాటియాలకు వచ్చి ప్రధానమంత్రి పదవి స్వీకరించెను.

స్త్రీ ప్రధానామాత్యపదవి స్వీకరించుటకు భారతదేశ చరిత్రమున నింతకంటె మఱియొక యుదాహరణము కాన్పింపదు. ఇతరదేశచరిత్రములకు ఈభాగ్య మబ్బనే లేదని మేము తలంచుచున్నాము. అనేకమంది రాణులు సింహాసనము నలంకరించి అసాధారణముగ రాజ్యపాలనము గావించి ప్రసిద్ధిఁ బడసియున్నారు; గాని వారి కందఱకును మంత్రులు పురుషులే. అగుటనే "ఆఁడుది రాజ్య పాలనము జేసె నన్న సంసర్థము లేదు. పురుషుఁడైనను స్త్రీయైనను సింహాసన మధిరోహించి

నంతమాత్రమున ప్రజాపాలనము నెఱవేఱదు. అంతయు మంత్రుల చేతులలో నున్నది. మంత్రులు పురుషులైనప్పుడు ఇఁక స్త్రీ పరిపాలనము చేయుటలో నాశ్చర్యము గాని ప్రశంసకుఁ గారణము గాని యేమున్నది?" అను ప్రశ్న కవకాశము గలిగినది. ఇప్పు డట్లు గాదు. అధీశ్వరత్వము పురుషునకును, సాచివ్యము స్త్రీకిని సంక్రమించినవి. అవకాశము లభించినచో స్త్రీబుద్ధి కసాధ్యము లేదని చెప్పుటకు ఇంతకంటె నేమి కావలెను.

అయితే భారతరమణు లందఱును మంత్రాంగము చేయువారే యని మాయభిప్రాయము. మనసంఘమున గృహరాజ్యాధిపత్యము పురుషునిది. సాచివ్యము స్త్రీది. ఈతీరునమన స్త్రీలకు మంత్రాంగనిర్వహణము ఉగ్గుపాలతో నేర్చిన వినోదము. ఈకారణముచే గృహమున రమణియే మంత్రాంగనిర్వహణము గావింపవలెను. లేకున్న నిఁక నాసంసారము గాఢారణ్యమునకు సులభోదాహరణమే చూచుట లేదా మనము పురుషుఁడే మంత్రిత్వమును గూడ నిర్వహించు కొన్ని సంసారములను?

కువరు మంత్రాంగమును జేపట్టిన వెంటనే పాటియాల సంస్థానపు రాజ్యాంగము చేయివెట్టి కలఁచినట్లయ్యెను. రాజపురుషులయందు గుసగుసలు ప్రబలెను; గాని యిది యెంతో కాలము నిలువలేదు. రాజభక్తిభరితులగు నుద్యోగులను జేపట్టి కువరు ద్రోహుల నందఱను తొలఁగించెను. ఒకటి రెండు మాసములయందే శాంతి నెలకొనెను. రాజును ప్రజలును

ఆశ్చర్యచకితులైరి. సంస్థానమునందలి స్త్రీ లందఱును ఆ రేచి తభ్రూచతురలై విజయగర్వమును బ్రకటింపఁజొచ్చిరి.

సర్వలక్షణసంపన్న యగు రమణి యెక్కడ నుండిన నక్కడి అలక్ష్మి తొలఁగిపోవును. పాటియాలలో విజృంభించినయలక్ష్మి కువరు వచ్చిన వెంటనే తొలఁగిపోయెను; గాని వెంటనే తనసొంత సంస్థాన మగు బారీదువాబులోఁ జెలరేఁగెను. ఆమె భర్త యగు జయమల్‌సింహునిమీఁద దాయాది యగు ఫతేసింహుఁడు తిరుగఁబడెను. ఈసంగతి తెలిసిన వెంటనే కువరు పాటియాలలో వ్యవస్థ చక్కబఱిచి విశ్వాసపాత్రుని తన స్థానమున నిలిపి అన్నసైన్యమును కొంతసాయము దీసికొని బారీదువాబునకు బయలుదేఱెను. ఈవార్త తెలియఁగనే ఫతేసింహుని హృదయమున భయము పాదుకొనెను. అయినను అతఁడు ధైర్యము చిక్కఁబట్టి ఫతేపురము వద్ద నామె నెదిరించెను. పోరు ఘోర మయ్యెను. శత్రువులను జయించి కువరు భర్తను జెఱ విడిపించి గద్దె నెక్కించెను. పంజాబుదేశ మంతయు నొక్కమాఱు మెఱపు మెఱసినట్లయ్యెను.

''ఆఁడుది సాచివ్యము చేయుటా? ఇంతకంటె పురుషున కవమానకారణము లేదు. ఆమె సామర్థ్య మేమో చూచి వత్తము'' అని ఆనందరావు లక్ష్మణరావు నను నిరువురు మహారాష్ట్రులు పాటియాలమీఁదికి దండెత్తి వచ్చిరి. వారి యాధిపత్యమునకు వెఱచి మార్గమున కొందఱు రాజులు వారికి ధనసాహాయ్యము చేసిరి. కొందఱు బలమును సాయమిచ్చిరి ఇది విని కొందఱు కువరుపక్ష మవలంబించిరి. ఎంతయైనను కువరు

సైన్యము ఏడువేలే యుండెను. అయినను దైవమును నమ్మి కువరు అంబాల మను పట్టణమువద్ద శత్రువులను దాకెను. సంకుల సమరము ప్రారంభ మైన సిదప శిక్షాలోపమువలన కువరుసైన్యము వెనుదీయుటకు సిద్ధపడెను. అది గ్రహించి కువరు "వెనుదీయవలదు. శూరునకు ఒక్కటే చావు. పాఱిపోవుట దుర్మణమే. అంతకంటె నికృష్టము లేదు. నిలువుఁడు. జయించిన కీర్తి కలుగును. లేకున్న వీరస్వర్గము లభించును" అని యుపన్యసించునప్పటికి సైన్యమునకు మఱల పురి యెక్కెను. మఱల కొంతతడవు సంకులసమర మగునప్పటికి అంధకార మావరించెను. ఇరువాఁగులవారును శిబిరములు చేరికొనిరి.

మహారాష్ట్రులందఱును అపాయమువలన శంకించి మేలుకొనియే యుండిరి. ఇట్లుండఁగా జాముదాత్రివేళ "రాణికి గొప్ప సైన్య మొకటి తోడు వచ్చుచున్న" దని మహారాష్ట్ర సైన్యములో వార్తలు ప్రాకిపోసాగెను. అందులకు వారు ఆలోచనలు కొనసాగించుచుండఁగా రాణి హఠాత్తుగ వారిపైఁబడెను. మహారాష్ట్రులు చెట్టొకపిట్టయై పోయిరి. రాణి విజయమును బడసి పాటియాల చేరుకొనెను.

అసంతృప్తికిఁ రెండు కారణములు ఉన్నవి. ఒక్కటి అన్యాయము ప్రబలుట మఱియొకటి కేవలము నసూయ వలని దుశ్చింత. అన్యాయమూలక మగు నసంతృప్తి న్యాయ్యము నెలకొనినవెంటనే అడఁగారును; గాని దుశ్చింతమునఁ బొడమినది అట్లు పోదు. కువరు మంత్రిపదవిని స్వీకరింపకపూర్వము పాటియాల సంస్థానపు ఉద్యోగులయందుఁ బొడసూపిన యసంతృప్తి దుశ్చింతామూలకము. అగుట నది రహస్యముగ

నింకను కొనలుసాగుచునే యుండెను. ఇట్లుండియుండి యది అంబాలయుద్ధము ముగిసిన కొన్నిదినములకు సహానుపట్టణము న జెలరేఁగెను. అచ్చటి సామంతప్రభువు దాని నణఁపఁజాలక కువరుసాహాయ్యము గోరెను. వెంటనే యామె రాజధానిలో చక్కని యేర్పాటులు చేసి సహానుపట్టణమునకుఁ బోయి అచ్చట మూఁడుమాసములు వసించెను. ఈమూఁడుమాసములయందును, అచ్చటి రాజద్రోహు లందఱును శిక్షితులై శాంతి నెలకొనినతరువాత అచ్చటి సామంతరాజు కువరునకు ఒక మదగజము నజరువెట్టెను. ఆమె దానిని ప్రజ్ఞాధ్వజముగా తన స్వాధీనమునందే యుంచుకొనెను. మఱియు నామె తన సంస్థానము భద్రముగ నుండుట కచ్చట దుర్భేద్య మగు నొక దుర్గమును గట్టించెను.

లోకములో నొక విధమైన మనుష్యు లున్నారు. వారు ఉన్నవారి నున్నట్లుండనీయరు. కొండెములు చెప్పుట వారి ప్రథమ ప్రయత్నము. కలహోత్పాదనము వారి పరమావధి. కొందఱిది వినోదముకొఱకు సేయుదురు. కొందఱు ధనకాంక్షులై సేయుదురు. ఎట్లయినను ఫలము ఒక్కటే. ఈమహానుభావుల దృష్టి రాజులపైఁ బ్రసరించిన రక్తపాత మగును. ప్రజలమీఁదఁ బాఱిన సంసారములు భ్రష్టము లగును. హోలాహారాణిగూడ వీరి దృష్టికి తీసికట్టు.

పాటియాలలో నిట్టివారు మఱల ప్రబలిరి. రాజుగుఱ్ఱపుఁ బనివచ్చినపుడు వారి ప్రయాసకు వినోదము కాదు కారణము. వారందఱును రాజునకు తీయనిమాటలతో నాదుడు సేసిరి. రాజాసాహెబుసింహాఁడు మాఱిపోయెను. "నేను పురుషుఁ

డను" అని యాతఁడు గర్వించెను. "నేను గావించినది కేవలము న కార్యకరణము. స్వయముగ నాధిపత్యమును స్త్రీపాలు సేయుటకంటె పురుషున కవమాన మేమి యున్నది? ఔను. కువరు సమానుపట్టణసామంతుఁ డిచ్చిన మదగజమును నాకు సమర్పింప లేదు. నా సెలవు లేనిదే తన సంస్థానములో కోట కట్టించెను. ఇది నేను పరిగణింపనే లేదు. నాకొఱకు వారెంత శ్రమపడి వీని నన్నిటిని గ్రహించిరి" అని యనుకొని యాతఁడు "నీవు నీసంస్థానమునకుఁ బొమ్ము" అని కువరున కాజ్ఞాపించెను. రాజున కీసంకల్పము గలిగించినవారలో రాణిగూడ ప్రముఖురాలే. ఆమెకుఁ గూడ పాలనాసామర్థ్యము గలదు. యువరాజు పేర తానే రాజ్యము చేయవలయు నని యామెకు బుద్ధిపుట్టెను. "కువరును దప్పించుటకు రాజునకు పురి యెక్కించుటయే యుపాయము" అని నిశ్చయించుకొని ఆమెగూడ రాజుతో కువరు మీఁద నిందలు మోపి చెప్పెను. తుదకందఱి యాశలును ఫలించెను. "అందువంటి రాజ్యమును ఈనిర్భాగ్యులు నాశము సేయుదు" రను బెంగతో కువరు తన సంస్థానమునకు వెడలి పోయెను.

అయినను కొండెగాండ్ర కంతటితో తృప్తి కలుగ లేదు. వారి బోధనలవలన రాజు బారీదుషాబుమీఁదికి దండయాత్ర బయలుదేఱెను; గాని యింతకంటె కృతఘ్నత లేదని పెద్దమనుష్యులు కొందఱు బుద్ధిసెప్పఁగా నాతఁడు వెనుదిరిగి పోయెను. పిదప నాతని యుద్యోగులు అన్నకును చెల్లెలికిని సంధిసేయుటకు ప్రయత్నములు సాగించిరి. వారి మాటలు

నమ్మి కువరు పాటియాలకు బయలుదేఱెను; గాని యంతలో అపాయము శంకించి వెనుకకుఁ బోయెను.

మఱల రాజాసాహేబుసింహుని యుద్యోగులకుఁ బని గలిగెను. వారు "నీనీడఁ జూచుకొని నీవు బెదరుచున్నావు" అని అమాయికత నారోపించి యామె మనసు విరిచిరి. కువరు ఆమాటలు విని పూర్తిగ నమ్మి పాటియాలకుఁ బోయెను. రాజు ఆమెను గొప్పభవనమున విడియించెను; గాని ఉత్తర క్షణమునందే అది కారాగారము అని యామె గ్రహించెను. అయినను కొన్నిదినములు అతిజాగ్రత్తతో నందేయుండి కువరు ఒకనాఁడు తన దుస్తులు దాసికిచ్చి దాసీ దుస్తులుతానుఁ ధరించి యాచెఱనుండి తప్పించుకొని స్వరాజ్యమునకుఁ బోయి చేరుకొనెను.

---



# 8. రామాబాయి.

మేవాడురాజ్యమునకు ఏలిక యగు జగమల్లమహారాజు చిత్తోడుదుర్గముమీఁదనుండి పరిపాలనము చేయుచుండఁగా ఢిల్లీశ్వరుఁ డగు నక్బరు తన సార్వభౌమత్వమును స్థిరపఱుచుకొనుటకు దండెత్తి వచ్చి కోట ముట్టడించెను. ఆకస్మిక మగు నీవిపత్తు నారసి రాజపుత్రులు కళవళపడుచుండఁగా అక్బరువద్ద నుండి రాయబారి వచ్చి "మీరు మాకు సామంతులై ఏటేటను కొంత కప్పము చెల్లించుచుండవలసినది. అందులకు మీకు అంగీకారము లేదేని యుద్ధమునకు సిద్ధపడవలసినది" యని సందేశము నెఱింగించెను. అందులకు చాల నసంతుష్టుఁడై "శీఘ్రముగా నీవు వెడలిపొమ్ము. యుద్ధమే సిద్ధము" అని చెప్పి జగమల్లమహారాజు కోట తలుపులు మూయించి సర్వమును సన్నద్ధము గావించెను.

అసంఖ్య మగు యవనసైన్యముతో పరిమిత మగు రాజపుత్రసైన్యము డీకొనెను. కోటలోనివారు రాచబిడ్డలు. దండెత్తి వచ్చినవారు పచ్చి తురకలు. యుద్ధ మెంత భయంకరముగా నుండునో వేఱుగ వర్ణింపవలసిన దేమున్నది?

ఒక దినము గడచెను. రెండవనాఁడు తన వారికి ప్రోత్సాహము కలిగించుటకును, శత్రుబలమును బరీక్షించుటకును జగమల్లమహారాజు బురుజులమీఁద సంచరించుచు శత్రుసైన్యము చాలదూరము వ్యాపించి అపారమై యుండుటఁ జూచి "ఈయుద్ధమున జయము కలుగుట పొసఁగదు. కోట

మొగలాయీల వశమును స్త్రీలు అగ్నిపాలును గావలసినట్లున్నది'.' అని సందేహించుచు దీనాననుఁడై యుండెను.

మొదటినుండియు వీరవిహారములయందు భర్తతో సరిగ పాల్గొనుచున్న రామాబాయి తానును బురుజులమీఁద సంచరించుచు భర్త దీనాననుఁడై యుండుటఁ జూచి కారణము నూహించుకొని సమీపించి, "నాథా, ధర్మయుద్ధము వలన జయము కలుగుట పొసఁగదు సెలవేని మాఱువేష మునఁ బోయి అక్బరును సంహరించి వచ్చెద" నని పలికెను. రాజు తొలుత సందేహించి ఆమె "భయము వలదు. సెలవు ఈయవలసినది" యని బలవంతపెట్టఁగా తుదకు "నీకంతధైర్యము కలదేని నీకుఁ దోఁచినట్లు చేయుము. గుప్తఖడ్గమును మాత్రము మఱచిపోకుము. అపాయశంక కలిగినప్పుడు రాజపుత్రస్త్రీలకుఁ దగునట్లు ప్రవర్తింపుము." అని సెలవిచ్చెను. రామాబాయి మహానందభరిత యయ్యెను.

పిదప నామె కావివస్త్రములను మెడనిండ పూసలపేరులును దాల్చి తురకఫకీరువేషముతో చేత నొక సిసాలును, మొలలో నొక గుప్తఖడ్గమును ఉంచుకొని కోట వెడలి యవనసైన్యము సొచ్చెను. అప్పుడు అక్బరు శిబిరమున నుండి ఆలోచనలమీఁద నాలోచనలు చేయుచుండెను. ఇట్టి సమయమున రాణి ఆగుడారమును సమీపించి "నేను షాదుషాహ నాశీర్వదింపవచ్చితిని" అని కావలివారితోఁ జెప్పెను. అక్బరు ఫకీరులనిన చాల గౌరవించును; గావున వెంటనే లోని కామెకు ప్రవేశ మిచ్చెను.

"నీవు భారతీయులతోడి పోరున అలసియుందు వని

తలఁచి ఈశ్వరగుణకీర్తనమున నిన్నానందపెట్టి బహుమతి పడ యుటకు వచ్చితి" నని విన్నవించుకొనియెను. అంతట ఫకీరు ఖిడేలు తీసి కంఠస్వరముతో మేళవించి యొక్క కీర్తన వాయించెను అక్బరు భక్తిబంధురమగు ఆకీర్తనను విని పరవశుఁడై నిమీలితాక్షుఁడై యుండఁగా ఫకీరు గుప్తఖడ్గమును తటాలునఁ దీసి చప్పునఁ బొడువఁ బోయెను. పాట యాగిపోవుటకు కారణము తెలియఁగోరి అక్బరు కన్నులు తెఱచి ఫకీరు ప్రయత్నమును జూచి అతిచాతుర్యముతో ఖడ్గమును గుంజుకొని "ఎవరు నీవు" అని గద్దించుచు నడిగెను.

రామాబాయి నిర్భయముగ సంగతి యంతయు నెఱింగించి "నీప్రాణములు తీయుటకు వచ్చి విఫలప్రయత్న నైతిని. ఇఁక నేనే మొగము పెట్టుకొని నాభర్త సన్నిధికిఁ బోవుదును? కావున నీవు నాతలతీయుము" అని పలికెను. అక్బరు మిగుల నాశ్చర్యపడి "నాభటులకుఁ గూడ స్త్రీలను జూపుట కనుజ్ఞ లేదు. ఇంతటి శౌర్యసాహసములు గల నిన్నంత మొందించుటకు నేను సాహసింపఁజాలను" అని బదులుపలికి ఆమెను ఒక పాలకిలోఁ గూర్చుండఁజేసి సగౌరవముగ కోటలోనికిఁ బంపివేసెను.

మఱునాఁడు యవనసైనికులు కొందఱు నిచ్చెనలు వేసికొని బురుజుల కెగఁబ్రాకుచుండఁగా రాణియు, రాణాయు నతిధైర్యముతో వారినిఁ గ్రిందికిఁ ద్రోయించుచుండిరి. రాజపుత్రులు త్రోసినకొలఁదిని తురుష్కులెక్కుచుండగా తురుష్కులెక్కిన కొలఁదిని రాజపుత్రులు పడఁద్రోయుచుండిరి. రాణియు రాణాయు నీయడావుడిలో నుండఁగా నొక తురక సరదా

రు దూరమునుండి యొక బాణము విడిచెను. అది రివ్వున వచ్చి రాణా ప్రాణములు తీసికొనెను.

పతి సమయుటఁ గని కన్నులయందు గిఱ్ఱునఁ దిరిగిన బాష్పములను అట్లె తుడిచివేసికొని పతి ఖడ్గమును ధరించి యుద్ధరంగమున నుఱికెను. ఆమెను జూచి క్షత్రియసైన్యము మఱింత సాహసముతోఁ దురకలను గసిమసంగఁ బొడ్చెను. కొంతసేపటికి రాణా పడిన వార్త అంతటను వ్యాపింపఁగా మొగలాయిసైనికులు మహానందముతో విజృంభించిరి. తుర కల యాధిక్యముఁ జూచి క్షత్రియులు మఱింత చెలరేఁగిరి. రాణి, తురకలు తన భర్తను చంపుమాపినందులకు తానెట్ల యిన నక్బరుని సంహారించి తీరవలెనని నిశ్చయించి ఆఁకొన్న యాఁడుసింగమువలె దుర్నిరీక్ష్యయై యెదురైన తురకల నెల్ల సంహారించుచు ముందునకు సాగెను. ఆమెను వెనుకకు నెట్టి వేయుటకు పేరుమోసిన తురకలు కొందఱు ప్రయత్నించిరి; గాని లాభము లేకపోయెను. ఏటికెదురీఁదు చేఁపవలె నామె ముందునకుఁ బోవుచునే యుండెను.

అక్బరు ఉన్న గుడారమును సమీపించునప్పటికి రాణి పెక్కుగాయములు తినుటవలన దుర్బల యయ్యెను. అది చూచి అచ్చట నున్న తురక సరదారు లామెను పట్టుకొని పా దుషా యెదుటకుఁ గొనిపోయిరి. అక్బరు ఆమె శౌర్యసాహస ముల కాశ్చర్యచకితుఁడై ఔషధోపచారములు చేయింపుమని పరిచారికల నాజ్ఞాపించెను. అంత తోడనే అతనియంతఃపురపరి చారికలు ఆమెను వైద్యశాలకుఁ గొనిపోయిరి.

వైద్యుల యుత్తమచికిత్సవలన నామె నాలుగైదు దిన

ములయందే కోలుకొని "నన్ను అగ్బరు నెదుటకుఁ గొనిపొం డు," అని అచ్చట నున్న పరిచారికలతోఁ బలికెను. వెంటనే వారు పోయి పాదుషాయనుజ్ఞను బడసి యామె కోరిక చెల్లించిరి. పాదుషా యామెకుఁ జాల గౌరవము చేసెను.

"నీగౌరవములతో నాకుఁ బని లేదు. నేను రణమును గోరి వచ్చితిని. లెమ్ము. ఖడ్గము పుచ్చుకొనుము" అని రాణి అగ్బరు నడిగెను. ఆతఁ డందులకు మందహాసము గావించి "నీశౌర్యమునకు సంతోషమైనది. ఇంత పతిభక్తియు, శౌర్యసాహసములును, పట్టుదలయు గల స్త్రీని నేనెన్నఁడును జూచియుండలేదు. అక్రను మగు కోరిక కోరుచున్నావు; గావున నేను నీయాహ్వానము నంగీకరింపఁజాలను. ఏమందువా? నేను స్త్రీలతో యుద్ధము చేయను" అని ప్రత్యుత్తర మీయగా "నేను రెండుమాటలు నిన్ను సంహరించుటకు వచ్చితిని. అందులకైన నీవు ప్రతిక్రియఁ జేయుము. నాపతి చెంతకుఁ బోవలయునని నాకు కోరిక కలదు. ఆలసింపక నన్ను సంహరింపుము" అని యామె మఱలఁ బలికెను. అందులకును అంగీకరింపక అగ్బరు ఆమెను సగౌరవముగ కోటలోనికిఁ బంపించి వేసెను.

రామాబాయి కోటలోఁ బ్రవేశించునప్పటికి రాణా చనిపోవుటయే గాక రాణి కైదువడుట విని అచ్చటి క్షత్రియులు ఎల్లరును కర్తవ్యమునుగుఱించి యోచించుచుండిరి. అందొకఁడు సంధిచేసికొందమని ప్రస్తావించెను. అది విని రామాబాయి మండిపడి "నీప్రభువును సంహరించినవానితో సంధి చేసికొనుమనుటకు నీకు నోరెట్లు వచ్చెను? నీవు క్షత్రియుఁడవు కావా? నీకు మానాభిమానములు లేవా?" యని నిందించె

ను. అదివిని యతఁడచ్చట నుండఁజాలక తలవంచుకొని వెడలి పోయెను.

తక్కిన సరదారులును వీరభటులు రాణి యెట్లు వచ్చె నని యాశ్చర్యపడుచుండఁగా నామె వారి సముఖమున నిలిచి చేయెత్తి "వీరులారా! చిత్తోడుదుర్గమునకు అలంకారభూతుఁడగు మహారాజు గతించెను. ఇఁక మనము చేయవలసిన దేమి కలదు? పగఁదీర్చుకొనుట ముఖ్యకర్తవ్యము. పిఁయినచో తరువాత రాజ్యరక్షణము చేసికొనవచ్చును! గావున మన మందఱమును శత్రుసంహారము గావింతము. క్షత్రియులకు వివాదము వివాహముతో సమానము. సంధి యనిన మరణతుల్యము. ఇఁక మీకుఁ జెప్పవలసిన దేమియున్నది? లెండు" అని పలికెను. తోడనే వారెల్లరును మహోత్సాహపూరితులై యుద్ధరంగమునకుఁ బోయిరి. రాణియు వారివెంట రణరంగమున కరిగి అసంఖ్యయవనులను సంహరించెను.

మఱునాఁడు రాణి యిఁక జయము కలుగుట కలలోని ముచ్చట యని నిశ్చయించుకొనియెను "అయినను యుద్ధము మానఁగూడదు" అనియు నామె నిశ్చయించుకొని సరదారుల నందఱను ఒకచోఁ జేర్చి "ఇన్ని చేసినను మనకు జయము కలుగునట్లు తోఁచుట లేదు; గావున పురుషు లందఱును ప్రాణము లున్నంతవఱకును యుద్ధము చేసి పిదప వీరస్వర్గమునకుఁ బోవలసినది. పిదప స్త్రీలందఱును జోహారు గావించి మిమ్ము కలిసికొనియెదరు" అని చెప్పెను. యోధు లందఱును అంగీకరించి పోయి శత్రువులను దాఁకిరి.

రాణికి ఇరువురు కొమార్తలు కలరు. పెద్దయామె

వయస్సు పదునేడు సంవత్సరములు. పేరు చంద్రావతి. చిన్నయామె ప్రాయము పదునై దేండ్లు. పేరు లీలావతి. రామాబాయి వారినిఁ బిలిచి "మన విషయమున భగవంతుఁ డన్యథా తలఁచినాఁడు. చిత్తోడుదుర్గమునకు వినాశము సంభవించినది. మేవాడురాజ్యము తురకల యధీన మగు దినములు వచ్చినవి. మన మందుల కేమి చేయఁగలము? ఈశ్వరేచ్ఛకు వ్యతిరేకము చేయఁగలవా రెవ్వరు? పురుషు లందఱును మరణము నిశ్చయించుకొని యుద్ధరంగమునకుఁ బోయినారు. ఇఁక స్త్రీలు మిగిలియున్నారు. మనము బ్రతికియున్నచో మానము నిలువదు. మర్యాద నిలువదు; కావున నేను జోహారు నిశ్చయించితిని. మీయభిప్రాయ మేమి?" అని యడిగెను. వారు తల్లి మాటల కంగీకరించిరి. పిదప ముప్పురును గలిసి కోటలోనున్న స్త్రీల నందఱ నొక్కయెడల సమావేశపఱిచి సంగతి యంతయు విచారించి చెప్పిరి. అందఱును అంగీకరించిరి. తోడనే చితులు నిర్మించుటకు పరిచారకులు పనిఁబూనిరి

"దినములు గడచిపోవుచున్నవి. మొగలాయిబిడ్డల కిది పౌరుషము గాదు. నేఁడు కోట కొట్టితీరవలయు" నని ప్రోత్సహించుచు అక్బరు సైన్యమునం దంతటను సంచరించుచుండెను. తురకవీరు లత్యుత్సాహముగా ద్వారములు పగులఁగొట్టుటకుఁ బ్రయత్నించుచుండఁగా కోటలోనుండి తలుపులు తెఱచికొని రాజపుత్రు లొక్కమాఱుగ బయటకు వచ్చి తురుష్కులను దాఁకిరి. పోరు ఘోరమయ్యెను.

ఇరువాఁగులవారును చాలఁ బట్టుదలతోఁ బోరిరి. ఒక్కమాఱు ఉభయపక్షములును ఇటునటు నూఁగిపోయెను.

ఉత్తరక్షణమున రాజపుత్రులు తురుష్కులలో లీనమైపోయిరి. తురకభటులు "అల్లాహో అక్బర్" అని యఱచుచుఁ గోటలోనికిఁ బరువెత్తఁజొచ్చిరి.

ఇది యంతయుఁ గనిపెట్టుచున్న రాజపుత్రుఁడు ఒకఁడు ఈవార్త స్త్రీల కెఱిగించి తాను తురకల నెదిరించి పడిసెను. వెంటనే స్త్రీలు చితుల నధిరోహించి అగ్ని ముట్టించుకొనిరి. చూచుచుండఁగా అగ్ని విజృంభించి వారిని స్వర్గలోకమునకుఁ గొనిపోయెను. భగభగమండుచున్న చితులను జూచి తురుష్కులు నిర్విణ్ణులైరి. అక్బరు విజయగర్వముతో నచ్చటకు వచ్చి జరుగుచున్న దంతయుఁ జూచి తెల్లవోయెను.

కోట తురకల స్వాధీన మయ్యెను.

# 9. రాగమ్మ.

ఉద్దండరాయపరాజు అను నామాంతరము గల రెండవ రాయపరాజు చాలఁగాలము పెద్దాపురసంస్థానమును పాలించి దివికిఁ బోయెను. మరణకాలమున కాతనికి ముగ్గురు కుమారులు ఉండిరి. మొదటి యాతఁడు తిమ్మరాజు. రెండవయాతఁడు బలభద్రరాజు. మూఁడవయాతఁడు సూరపరాజు. తండ్రి మరణించునప్పటికి ఈముువ్వురునుగూడ బాలురు అగుటచే తల్లి రాగమ్మ తిమ్మరాజునకుఁ బట్టాభిషేకము గావించి; తానే రాజకార్యములను నిర్వర్తింపసాగెను. రాగమ్మ గొట్టుముక్కల భగవాన్‌రాజుగారి కొమార్త.

ఆఁడుదియైన నేమి? రాగమ్మ క్షత్రియరమణిగదా? ఇఁక నామె శౌర్యసాహసములను వర్ణింపనవసర మేమి యున్నది? తిమ్మరాజు పెద్ద యగునంతదనుక సంస్థానప్రజ లందఱును కష్టమను మాట యైన నెఱుంగనట్లు పరిపాలించెను. తోడి సంస్థానప్రభువు లందఱును ఆమె సామర్థ్యమును మెచ్చుకొనుచు పాలనావిషయమున నుదాహరణముగఁ గైకొనసాగిరి.

ఇంతలో తిమ్మరాజు పెద్ద యయ్యెను. రాగమ్మ సంస్థానవ్యవహారము లన్నియుఁ బ్రత్యక్షముగ నాతని భుజాస్కంధములపై నిడెను. అయినను తిమ్మరాజు స్వతంత్రింపలేదు. తల్లి యనిన నాతని కధికగౌరవము. ఆమె ప్రేమభరాలస యగుమాతమాత్రమే గాదు. రాజ్యపాలనము నిర్వహించిన రాజకార్యధురీణ. అగుట నాతఁడు తల్లి యంగీకారముఁ బడయు

కుండ నేపనియుఁ జేసి యెఱుఁగఁడు. ఈకారణమువలన నాతని కృత్యము లేమియుఁ బ్రజావిమర్శకు అవకాశ మిచ్చెడివికావు.

తిమ్మరాజు తల్లి నెంత గౌరవించునో తమ్ముల నంత యాదరించును. అందును జేదోడువాదోడుగ నుండుటచే బలభద్రరాజుతో నాతని కేకప్రాణము. బలభద్రరాజుగూడ నన్న యెడల రామునియెడల లక్ష్మణుఁడువోలె భయభక్తులతో మెలఁగుచుండెను.

ఇది యిట్లుండఁగా హైదరాబాదునవాబుచే రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులకు నవాబుగా నియమింపఁబడిన అన్వరుద్దీను ఆసర్కారులయందలి కొందఱు సంస్థానప్రభువులు ఈయవలసిన కప్పములు వసూలు చేసికొనిరమ్మని రుస్తుంఖాను అను వానిని నియమించెను. హాజీహుస్సేన్ అను నామాంతరము గల రుస్తుంఖానుని ఈసర్కారులలోఁ బ్రవేశింపకుండఁ జేయవలయు నని మొగలితుర్తి కలిదిండి రామరాజును, నూజువీటి అప్పారావు వంశమునందలి సుబ్బన్నయు, నేకమై రెండుమూఁడు తడవ లేలూరువద్ద నెదిరించిరి; గాని ప్రయోజనము కలుగలేదు. రుస్తుంఖానుని ధాటి కోర్వఁజాలక వారు పెద్దాపురమునకుఁ బాఱివచ్చిరి. రుస్తుంఖానుఁడు మార్గమధ్యమున నున్న సంస్థానప్రభువులవలన కప్పములుగొనుచు ముందునకుఁ బ్రయాణము సాగించెను.

రాగమ్మ సాహాయ్యమును బడసి రామరాజును, సుబ్బన్నయు మఱల రుస్తుంఖానుని రాజమహేంద్రవరముచెంత నెదిరించిరి. పోరు మఱల ఘోర మయ్యెను; గాని మఱల రుస్తుంఖానుఁడే జయించెను అంతటఁ జేయునది లేక రామరా

జును, సుబ్బన్నయు, వారికి సాయము సేయవచ్చిన ఫిరాపురము ప్రభు వగు రావు వేంకటకృష్ణారావును తోటపల్లి ప్రాంతమునకుఁ బాఱిపోయిరి. రుస్తుంఖానుఁడు రాజమహేంద్రవరమును స్వాధీనము చేసికొని కొన్నిదినము లక్కడనుండి మజిల బయలుదేఱి పెద్దాపురము వచ్చి పాడవులమెట్టుమీఁద విడిసెను.

ఇది వఱకు పెద్దాపురసంస్థానమునకును రుస్తుంఖానునకు నేమియు సంబంధము లేనట్లు తోఁచుచున్నది. అయినను రాగమ్మ, రామరాజు సుబ్బన్నగార్లకు, బలసాహాయ్యముఁ జేయుట యాతనికిఁ దెలియకపోలేదు; గాని యాసంగతి మాత్ర మాతఁడు వెల్లడిసేయలేదు. ఆతని హృదయమునఁ జాల యోచనలు పెనవేసికొనిపోవుచుండెను. "వీఁడెందులకు వచ్చెను? యుద్ధమునకైన నట్లూరకుండె నేల? లేకున్న నిక్కడ నేమి పని?" అని రాగమ్మ ఆతని యాగమనమును గుఱించి యనేకవిధములఁ జర్చించుకొనుచు యుద్ధసన్నాహము లలో నుండెను.

ఇట్లుండఁగా రుస్తుంఖానుఁడు తిమ్మరాజుతో స్నేహపూర్వక మగు రాయబారములు ప్రారంభించెను. "మీసంస్థానము చిరకాలమునుండి యున్నది. ఈసర్కారులయందెల్ల నిది ధర్మమునకుఁ బ్రతిష్టఁ గాంచి యున్నది. మీసంస్థానమునెడల నాకు చాల గౌరవము గలదు. ఇఁక నేను ఇక్కడ నెన్నోదినము లుండుటకు వీలులేదు. మీకుమారుల నొక్కమాఱు మాకడకుఁ బంపినచో వారితో మైత్రిని దృఢపఱిచికొని నాపని మీఁద ముందునకుఁ బోయెద" నని యాతఁడు రాగమ్మకు వర్త

మానమంపెను. రాగమ్మ యందులకు తొలుత నంగీకరింపలే దు. అంతట రుస్తుంఖానుఁడు తనకుమారుఁడైన నూరుద్దీను హుస్సేనునిఁ బెద్దాపురము కోటలోనికిఁ బంపి యిట్లే చెప్పించెను. నూరుద్దీనుమాటలకు రాగమ్మ అభ్యంతరము చెప్పఁజాలకపోయెను. ఆతని సౌజన్యము నామె చక్కఁగ నెఱుఁగును. నూరుద్దీను కొన్నిదినములు పెద్దాపురమునఁ గొలువు సేసియుండెను. రాగమ్మ తన కుమారులను రుస్తుంఖాను బసకు బంపుటకు నిస్సందేహముగ నంగీకరించెను. నూరుద్దీను, తండ్రి కుటిలసంకల్పముల నెఱుంగఁడు.

యుక్త సమయమున తిమ్మరాజును, బలభద్రరాజును తురుష్కుల బసకు బయలుదేఱిరి. వెంట చల్లా పెద్దిమున్నగు విశ్వాసపాత్రులగు నైదాఱుగురు పరిజనులు మాత్రమే యుండిరి. రుస్తుంఖానుని యుద్యోగులు వచ్చి రాజపుత్రుల కెదురు సన్నాహములు జరిపి తోడుకొనిపోయిరి. రుస్తుంఖానుఁడు ద్వారమువద్ద కెదురువచ్చి వారిని డేరాలోనికిఁ గొనిపోయి సబహుమానముగఁ గూర్చుండఁబెట్టి కుశలప్రశ్నలు ప్రారంభించెను. నూరుద్దీను తన తండ్రి రాజపుత్రులకుఁ జేయు మర్యాదలు నూచి పరమానందభరితుఁ డగుచుండెను.

కాని ఉన్నట్లుండఁగా కొందఱు తురుష్కభటులు తటాలున సభాభవనము సొచ్చి కల్లోలము ప్రారంభించిరి. రుస్తుంఖానుఁ డొక ప్రక్కకుఁ దప్పుకొనెను. నూరుద్దీనును, రాజపుత్రులును ఆశ్చర్యచకితు లగుచుండఁగా కొందఱు తురకలు క్షణములో, క్రాఁగిన నూనెలో జొన్నకంకెలును, ఈఁతమండలును ముంచి వానితో రాజపుత్రులను గొట్టసాగిరి. నూరు

ద్దీను అది చూచి రాజపుత్రులను రక్షింపఁ బ్రయత్నించునంతలో నొక్క తురక క్రాఁగిన నూనె వారిపై గ్రుమ్మరించెను. క్షణములో రాజపుత్రులు ప్రాణములు విడిచిరి. నూరుద్దీను కన్నెత్తి చూడఁగా రుస్తుంఖానుఁ డెందును కాన్పింపఁడయ్యెను.

చల్లా పెద్ది యిదిచూచి క్షణములలో గుఱ్ఱము నెక్కి కోటవెనకు ఉడాయించెను. శుభవార్తకై యెదురుసూచుచున్న రాగమ్మ ఇది విని "మహమ్మదీయులు ఇఁక కోటమీఁద బడుదురు. చూచుచున్న, మన మానము దక్కదు" అని కోడంత్రను, తక్కిన స్త్రీలను త్వరపెట్టెను. క్షణములో నంతఃఅు ను జోహారుసేయుటకు లక్కమేడకు బోయిరి. చల్లాపెద్దిగూడ అక్కడకుఁ బోయి రాగమ్మ యాజ్ఞకై వేచియుండెను.

అపుడు రాణి రాగమ్మ చేతికి కుమారు నందించెను. రాగమ్మ నునుమని యెత్తుకొని "వత్సా! చిరంజీవి వగుము. త్రింశత్కోటిదేవతలును, త్రిమూర్తులును, ఆదిశక్తియు, నిన్ను రక్షింతురుగాక! నరసింహాస్వామియెడల మేమేమి యపచారము గావించితిమో నేఁడు ఇట్టి గతి పట్టినది. అయినను నిన్ను ఆనరసింహాస్వామియే పెద్దవానిం జేసి నిరపాయముగ మఱల నిన్ను పెద్దాపురపుసింహాసనముమీఁదఁ బ్రతిష్ఠింపఁగలఁడు. తండ్రీ, నీవు బాల్యమునందే తలిదండ్రులను గోలుపోయినవాడ వగుదువు. ఇంతకంటె నీకు మఱి యేలోపమును లేకుండుఁగాక" అని దీవించి రాణిచేతికిచ్చెను. రాణియు తక్కిన క్షత్రియస్త్రీలును బాలుని ముద్దుగొని మఱల రాగమ్మచేతికి ఇచ్చిరి. అప్పుడు రాగమ్మ యెదుట నిలిచియున్న కొంపెల్ల

మహాలక్ష్మీసోదెమ్మ యను పురోహితుని భార్యను జూచి యిట్లు చెప్పెను.

"చాలకాలమునుండి మీకునుమాకును సంబంధమున్నది. మీరు మాకనేకోపకారములను గావించియున్నారు. మీయాశీర్వాదబలమ్మునసే యింతవఱకును మేము నిరపాయులమై యుంటిమి; గాని పెద్ద సంస్థానమున కేలికలమై యుండియు మీకుఁ జేయఁదగిన యుపకార మొక్కటియుఁ జేయఁజాలకపోయితిమి. మాకాల మంతయు నాశలతోడనే చెల్లిపోయినది. నేఁటికి ఈసంస్థానమున కీరీతిని విచ్ఛిత్తి సంభవించినది. మావంశ మంతయు నేఁటితో నశించిపోవలసిన కారణము తటస్థించినది. అయినను ఎట్లో యీవంశాంకురము నిలిచి యుండవలయు నని మాకు వాంఛ గలదు. ఆయంకురమును నిలుపు భారము మీమీఁద నున్నది. ఈనిమసమునందే యీ పసిపాపని మీస్వాధీనము చేయుచున్నాను. ఈబిడ్డఁ డిఁక మీ బిడ్డఁడే; గాని మాబిడ్డఁడు గాఁడు. ఈబాలుని యభివృద్ధికి మీ యాశీర్వచనమే యాధారము. తుదకు మేమీ లోకమును విడిచిపోవునప్పుడుగూడ మీకు కష్టమునే గలిగింపవలసివచ్చినది. అయినను మావంశమును నిలుపవలసిన దని మిమ్ము ప్రార్థించుచున్నాను. ఈబాలుఁడు పెద్దవాఁడైన పిదప మీకుఁ గృతజ్ఞుఁడై యుండఁగలఁడు. ఇఁక మేము జాలము సేయుటకు వీలు లేదు. తురకలవలని మానభంగభీతి మమ్ము త్వరపెట్టుచున్నది. మీరు మాకిపుడు చేయవలసిన మహోపకార మిది. ఎన్ని కష్టము లనుభవించియైనను ఈబాలుని మీరు విజయనగరము చేర్పవలయును. ఈపాపని విజయనగరపు మహారాణి పాదముల

మీఁద వైచి మీరుగూడ నక్కడనే యుండి రక్షించుచుండ వలసినది."

ఇది విని సోదెమ్మ వల్లె యని పలికెను. ఈమాటలవలన నామె శరీరము పరవశ మయ్యెను. "మేము మీయన్నము తిని బ్రతుకుచున్నాము. ఇంతకంటె మాకు ఆవశ్యకకార్యము ఏమి యున్నది. నాకంఠములోఁ బ్రాణములు ఉండఁగా చిట్టిబాబున కేమియు నపాయము రానీయను." అని సోదెమ్మ పలికెను. తోడనే రాగమ్మ బాలుని ఆమె కిచ్చివేసి బాలుని మెడలో నున్న ఆభరణముల నన్నిటిని తీసి క్రిందఁబాఱవేసెను. "నా కూనా, మనము పోదము" అని సోదెమ్మ అక్కడనుండి బయలుదేఱెను.

అంతట రంగమ్మ "పెద్దీ, ఇంక జూడవలదు" అని పలికెను. తోడనే పెద్ది లక్కమేడకు నిప్పుపెట్టెను. క్షణములో అగ్నిహోత్రుఁడు విజృంభించెను. రాజస్త్రీలతోఁగూడ పెద్ది యాయగ్నిలోఁ బడి స్వర్గమునకుఁ బోయెను.

బాలుని ఎత్తుకొని సోదెమ్మ దేవిడీచెంతకు వచ్చునప్పటికి తురకలు ఎదురైరి. ముందు వచ్చుచున్న రుస్తుంఖానుఁడు "నిలువుము" అని యఱవఁగా సోదెమ్మ నిశ్చేష్టయై నిలువఁబడి పోయెను, "వీఁడు రాజపుత్త్రుఁడు. ఎక్కడకుఁగొనిపోయెదవు?" అని ఖానుఁడు మఱలనఱచెను సోదెమ్మ కప్పటికి తెలివి వచ్చెను. తోడనే యామె "అయ్యో, ఇదే మన్యాయ్యము? పదియేండ్లు సకలదేవతలకును మ్రొక్కి కంటిని. వీఁడునాగారాల కూచి. రాజపుత్త్రుఁ డనేవ రేల? రాజపుత్త్రుఁడు రాణివద్ద నున్నాఁడు" అని మొఱ్ఱపెట్టెను. "ఛూ, నీమొగమున కిట్టి

కొడుకా?" యనిఖానుఁడు మఱల పలుకఁగా "మే మంత చెడి పోయితిమా? ఎంతదరిద్రులమైనను బ్రాహ్మణులము; గావున మాకు తపోధన మనంతమై యున్నది. దక్షిణామూర్తి యను గ్రహమునఁ బొడమిన బాలునకు తేజస్సున కేమికొదువ?" అని సోదెమ్మ జవాబు చెప్పెను. దానిమీఁద వాదోపవాదములు పెరిగిపోయెను. తుదకు ఖానుఁడు "ఈ బాలుఁడు నీకొడు కేని వీనిఎంగలి తినుము" అనిఖండముగ నిపలికెను. చెంతనున్న సర దారుఁడు జామపండు అందించెను. సోదెమ్మ వెంటనే ఆపండు బాలునినోట నుంచి పిదప తాను తినివేసెను. ఖానుఁడు నిశ్శం కుఁడై బాలునితోఁగూడ సోదెమ్మను వెడలిపోనిచ్చెను.

"కులమున కేమి? రాజపుత్త్రుని రక్షింపఁగలిగితిని. క్షీర కంఠుఁడగు నీతఁడు బ్రాహ్మణ బాలునికంటె నేవిధమున దక్కువ? అయినను నాకుఁ బాపములేదు. పెద్దాపురరాజవంశమును నిలు పఁగలిగితిని. నాకంటె నదృష్టవంతు లెవరు?" అని యుప్పొం గుచు సోదెమ్మ పట్టణమునందున్న యింటికిఁ బోయి భర్తకు సంగతి యంతయు నెఱిఁగించెను అంతట నా బ్రాహ్మణుఁడు "ఈమహారాజు ఇక్కడ నుండుట మంచిదిగాదు" అని యప్పుడే భార్యతోఁ గూడ బాలుని ఎత్తుకొని మహాసంతసముతో విజయ నగరమునకు దారి తీసెను.

కాని కొంతసేపటికి ఖానుఁడు యథార్థము నెఱింగి బాలుని వెన్నంటెను బ్రాహ్మణదంపతులు చేబ్రోలు వద్దకుఁ బోవు నప్పటికి ఖానుఁడు సపరివారుఁడై అందుకొని సోదెమ్మ చేత నున్న రాజపుత్త్రుని గింజుకొని కైదు చేసెను. బ్రాహ్మణదంప తులు "ఈతఁడు మాబిడ్డ" యని యెన్నివిధములఁ జెప్పినను

ఖానుఁ డంగీకరింపలేదు. "పరీక్షించెదను" అని యాతఁడు కత్తులను పుస్తకములను ఎదుట నుంచి ఏడుమాసముల వయసుగల రాజపుత్రుని విడిచెను. తోడనే యాబాలుఁడు కత్తి మీఁద చేయివేసెను. అంతట ఖానుఁడు "ఇది పులిపిల్ల, మేఁకపిల్ల గాదు" అని బ్రాహ్మణదంపతులతోఁగూడ కైదు చేసెను. కొన్నిదినముల కీసంగతి విజయనగరమునఁ దెలిసెను. తోడనే అచ్చటి ప్రభువు దండుతో వచ్చి తురకల నోడించి రాయజగపతి యను పేరుగల యాబాలుని, బ్రాహ్మణదంపతులను విడిపించుకొని విజయనగరమునకుఁ బోయెను.

పిదప నమ్మించి యింత ద్రోహము చేసినందులకు నూరుద్దీను తండ్రిని దేశాకొయ్యలతో పొడిచి చంపెను.

పెద్దాపురము కొన్నిదినములవఱకును తురకలస్వాధీనమున నుండెను; గాని రాయజగపతి యెదిగి దానిని మఱల స్వాధీనము చేసికొనెను.

---

# 10. సావిత్రీబాయి.

ఢిల్లీవిజాపురరాజ్యములయందు భస్మరాసులను నిర్మించు శివాజీశౌర్యాగ్ని యొకప్పుడు కర్ణాటకముమీఁదఁ బడియెను. శివాజీ, కర్ణాటకమును స్వభుజబలముతో సాధింప నిశ్చయించుకొని వచ్చెను; గాని యింతలో ఢిల్లీశుని సైనికులు విజృంభించుచున్నా రని విని కర్ణాటకమును సాధించుటకు దాదోజీ అను సేనాధిపతిని నియమించి తాను వెడలిపోయెను. దాదోజీ తొలుత భయికోటను ముట్టడించెను. అది స్వాధీనమైనచో చుట్టుపట్ల నున్న దుర్గము లన్నియు నతిసులభముగ చేఁజిక్కు నని యాతని యభిప్రాయము. భయికోటయందున్నంత శౌర్య మెచ్చటను లేదని యాతఁడు విని యుండెను. అందులకుఁ దార్కాణముగా ఆదుర్గాధీశుఁ డగు ఏసాజీ దాదోజీనిఁ దీవ్రముగ నెదిరించెను.

ఇరువాఁగులవారును జాలఁ బట్టుదలతోఁ బోరిరి. కొంతసే పయిన తరువాత ఏసాజీ శత్రువులు చీకాకుపడునట్లు వీరవిహారము గావించుచు వెనుకనుండి వచ్చిన ప్రతివీరుని యాకస్మికాఘాతమువలన భూశయ్య నలంకరించెను. ఈవార్త వెంటనే కోటలోఁ దెలిసిపోయెను.

ఇది వినుటయే తడవుగ ఏసాజీభార్య యగు సావిత్రీబాయి కొందఱు దాసీవనితలతో నచ్చటకు వచ్చెను. ఏసాజీ గతప్రాణుఁడై యున్నను అతనిచేతులలోని డాలును, వాలును అట్లే యుండెను. రాణి యక్కడకు వచ్చిన తోడనే యింకను కళ తగ్గిపోని యేసాజీముఖము ఆమెకు వీరసందేశము నెఱిం

గించెను. ఈదృశ్యమును జూచిన వెంటనే రాణి హృదయము నఁ బొంగిపొరలుచున్న దుఃఖము తిరోహితమై ఆస్థానమున శౌర్యాగ్ని ప్రదీప్తం బయ్యెను. తోడనే భర్త చేతి డాలును, కత్తియు భార్య చేతికి వచ్చెను. కేవల మింతియే భేదము. ఏసాజీ, ఎంత ధైర్యముతో, నెంత సాహసముతో, నెంత పట్టుదలతో, నెంత యభిమానముతో యుద్ధరంగమున నిలిచెనో సావిత్రియు నంత ధైర్యముతో, నంత సాహసముతో, నంత పట్టుదలతో, నంత యభిమానముతో వైరి నెదిరించుటకు గుఱ్ఱ మెక్కెను. ఆమెనుజూచి వెంట వచ్చిన దాసీజనము గూడ నట్లే చేసెను.

ఏసాజీ పడిన వార్త భుయికోటసైనికుల కందఱకు నప్పుడు తెలిసెను. తోడనే యందఱు నన్ని దిక్కులకును బా ఱిపోఁజొచ్చిరి. విరోధులు కోట స్వాధీనము చేసికొనిరి. ఇది యంతయుఁ జూచి సావిత్రి ఒక్కమాఱు నలుమూలలు కలయఁజూచి కన్నులనుండి రోషాగ్నికలలు రాల్చుచు తొఁక త్రొక్కిన యురగకాంతవలె రోజుచు "ఓవీరవరులారా! ఏల పాఱిపోయెదరు? ఎక్కడకుఁ బోయినను మరణము తప్పదు. ఏల పాఱిపోయెదరు? ఇదియేనా మీరాజునెడల మీరు చూపుభక్తి? ఇదియేనా మీపూర్వులయెడల మీరు వెల్లడించు గౌరవము? ఇదియేనా మీదుర్గము నెడల మీకుఁగల యభిమానము? ఇంతటిదేనా మీశౌర్యము? తోడివారు ఱెక్క బలిమి చూపుచుండఁగా పిక్కబలిమి చూపుటకు మీకు సిగ్గు లేదా? తోడివారు పరుల కోటను బట్టుచుండఁగా సొంతకోట విడిచిపోవుటకు మీకు లజ్జ లేదా? చూడుఁడు. భుయి

కోటయందలి స్త్రీలు శస్త్రములను దాల్చి గుఱ్ఱముల నెక్కి నిర్భయముతో నిలిచియున్నారు. పురుషులైన మీరు పలాయనము చిత్తగించుట పౌరుషమా? మీమగంటిమి ఏగంగలోఁ గలిసినది? మీక్షాత్రము ఏమంటఁ గలిసినది? మఱలుఁడు. భుయికోట మనదే. రాజు చనిపోయెను; గాని రాణి పోలేదు. శత్రువులకు కోట స్వాధీన మైనది; గాని మనము స్వాధీనము కాఁగూడదు. ఒక మహారాష్ట్రీన కోడి యొక మహారాష్ట్రీఁడు పాఱిపోవుటా? నిలువుఁడు. దుర్గద్వారములతోఁ గూడ శత్రువుల వక్షఃకవాటములను భేదింపుఁడు. శత్రువుల శిరముల మీఁద పాదముల నుంచి కీర్తిపర్వతముల నారోహింపుఁడు" అని పెద్దయెలుంగునఁ బలికెను. భుయికోటభటులు చూచుచుండఁగా బెబ్బులులవలె భయంకరులై వైరిసైన్యము దాఁకెను.

మఱల సంకులసమరము ప్రారంభ మయ్యెను. అప్పుడు దాదోజీ యొక రాయబారినిఁ బంపి "స్త్రీలు యుద్ధరంగమునకు వచ్చుట మంచిది గాదు. ప్రాణముకంటె మానమే మీకు అధిక మగునేని వెనుకకు మఱలి యెందేని పొండు. వీరావేశమునకు లోనయి స్త్రీలు యుద్ధమునకు వచ్చిన అన్నివిధములను కష్టములు సంభవించును. మీభర్తగారు ఈయుద్ధమున మరణించినందులకు మీకు విచారముగా నున్నది. అయినను వారి విషయమున నిప్పుడు చేయఁగలిగిన దేమియు లేదు. రాజ్యము లేకున్నను మీ కేమియు లోపము గలుగదు. మీరు తొల్లిటివలె గౌరవముగను వైభవముగను జీవించుటకు శివాజీమహారాజు తగినన్ని యీనాళ్లనిచ్చి యాదరించును. వెనుకముందు లాలోచింపక అనువుగాని యపుడు సాహసించినఁ బ్రమోజ

నము గలుగఁబోదు. రక్తనదులు ప్రవహించుటకు అవకాశ ములు కల్పింపకుఁడు. మీభటుల ప్రాణములు కాపాడి మిమ్ము మీరు రక్షించుకొనుఁడు" అని చెప్పించెను; గాని యాతఁడు అనుకొనిన ప్రత్యుత్తరమును బడయలేదు. "పిఱికిపందలు చెప్పవలసిన మాట విని మనువర్తిమాట యెత్తకుఁడు. ఆయు ధోపజీవులకు స్వాతంత్ర్యమే గాని పారతంత్ర్యము లేదు. మీ యాత్మోన్నతి తెలిసినది. బాహుబలమునుగూడఁ దెలిసి కొననిండు" అని యామె యందులకు బదులు చెప్పిపంపెను.

విధి లేక దాదోజీ యుద్ధమునకు సిద్ధపడియెను. ఇట నబల. నాలుగైదువందల సైన్యము. అట పురుషుఁడు అనేక వేలబలము. ఇట్టి స్థితిలో యుద్ధము పొసఁగినపు డక్కడఁ బ్ర దర్శింపఁబడిన శౌర్యము నెవరు వర్ణింపఁగలరు? సావిత్రికి ఈ యుద్ధమున నెట్లయినను సంబరమే. దాదోజీకి మాత్ర మట్లు గాదు; గెలిచినఁ బ్రశంసలేకున్న విమర్శ. ఇరుతెగల వారి పట్టు దలయు నసామాన్యముగనే యుండెను. కొంత తడవునకు రా శిసైన్యము దుర్గద్వారములను సమీపించి పగులఁగొట్టసాగె ను. వెంటనే దాదోజీ మఱికొంత సైన్యమును దీసికొనివచ్చి వారిమీఁద విడిచెను అయినను లాభము కలుగునట్లు తోఁ చలేదు. దాదోజీ మఱికొంత బలమును దెచ్చుటకు యోచిం పఁజొచ్చెను.

ఉత్తరక్షణమున నేమి జరుగునో చెప్పఁగలవారు ప్రా యికముగా లేరని చెప్పవచ్చును. మహామేధావుల మనుకొను వారి యూహలుగూడ వ్యర్థ మగుట చాలస్థలములయందుఁ జూచుచున్నారము. అట్టి సమయములయందు ఆశ్చర్యపడుట

తక్క నెవరివలనను ఏమియుఁ గాదు. చూచుచుండఁగా రాణి సైన్యము దిగులుపడఁజొచ్చెను. రాణి యిది చూచి భటులకు ధైర్యము కలుగుటకు మెడలోని రత్నహారమును ద్రెంపి వారి ముందు వెదచల్లెను; గాని వారు రత్నములను ఏఱుకొనుచుం డఁగా శివాజీసైన్యము వచ్చి రాణిని ముట్టడించెను. వెనుక నుండి వచ్చి దాదోజీ రాణి గుఱ్ఱము వెనుక కాలు నఱికెను. పతనవేగమును దప్పించుకొని రాణి క్రిందికి దుముకునప్పటికి దాదోజీ ఆమె కుడిచేతి నెగురఁగొట్టెను. కత్తితోడనే ఆ చేయి దూరమునఁ బడిపోయెను. రాణి స్థితినిఁ జూచి నిర్విణ్ణులై యున్న భయికోటవీరులను శివాజీసైనికులు బద్ధులం గావించిరి. "చేయి పోయినఁ బోయె. కత్తిగూడ పోయినది" అని రాణి వగచుచుండఁగా దాదోజీవచ్చి యామెను కైదుచేసెను.

దాదోజీ తన మూర్ఖ మీతీరున నిష్కంటకమైన తరువాత సావిత్రినిఁ దీసికొని కొల్హాపురమున నున్న శివాజీమహారాజుచెంతకుఁ బోయెను. శివాజీ దాదోజీనిఁ జూచి బహుసంతసించెను. దాదోజీ తన ప్రతాప మంతయుఁ బొగడుకొనుట యైన తరువాత సావిత్రీబాయి నచ్చటకు రావించి యామె ధైర్యమును, శౌర్యసాహసములను, రణచాతుర్యమును బాగుగ వర్ణించెను; గాని శివాజీకి సావిత్రినిఁ జూచినవెంటనే చాలవిచారము కలిగెను. అగుట నాతఁ డనేకవిధములఁ నామె నూఱడించి "మీకోట మఱలఁ మీస్వాధీనము చేసెదము. జరిగినది మఱచిపొండు" అని ప్రార్థించెను; గాని సావిత్రి యందులకు అంగీకరింపలేదు. "ఇఁక నాకు కోటతోఁ బనిలేదు. నాఖడ్గమును నాకిచ్చి నావైరి నెదుట నిలుపుఁడు. మీరు దాత లేని

యీదానము నాకుఁ జాలును. మఱియొకటి నాకువలదు" అని యామె బదులుపలికెను. అందులకుఁ బ్రత్యుత్తరము చెప్పఁ జాలక శివాజీ యామెను బసకుఁ బంపివేసెను. గాని సావిత్రీ బాయి పరాభవమును సహింపఁజాలక కుమిలికుమిలి రెండు మూఁడు మాసములలో నిహాలోకమును విడిచిపోయెను.




---

# 11. వీరమతి.



గుజరాతీ దేశమున టుకటోడా యను గ్రామమున బిరజుఁడు అను రాజు ప్రజాపాలనము చేయుచుండెను. ఆతని కడ సారి చెల్లెలిపేరు వీరమతి. ఆమె అన్నదమ్ములకును, విశేషించి బిరజునకును విశేషప్రీతిపాత్రురాలు. వీరమతికి అక్కసెల్లెండ్రతోఁ గంటె నన్నదమ్ములతో సాహచర్యము అధికము. అగుటచే నామె వారితోఁగూడ మల్లవిద్య లభ్యసించి యౌవనవతి యగునప్పటికి వానియందుఁ జాలఁ బ్రవీణురాలయ్యెను. ఆమె అక్కసెల్లెండ్రవలె సుందరియే. చతురయే. ఇఁక విశేషము ఏమన? వీరమతి వీరాంగన.

వీరమతి వివాహయోగ్య యగుటఁ జూచి బిరజుఁడు "ఆమెకుఁ దగిన వరుని వెదకిరండు" అని పురోహితుల కాజ్ఞాపించెను. ఇది తెలిసి వీరమతి తన హృదయము జగదేవుని యందు లగ్నమై యున్నదనియు దాను మఱియొకనిఁ బెండ్లియాడ నని సఖులముఖమున అన్నగారికి విన్నవించెను. బిరజుఁడు చెల్లెలి విమర్శజ్ఞానమున కానందించి "మీకుమారుఁడగు జగదేవునకు నాచెలియలు వీరమతిని ఇచ్చెదను" అని ఉదయాదిత్యునకు వార్త నంపెను.

ఉదయాదిత్యుఁడు ధారానగరమున మాళవదేశమును బరిపాలించుచుండెను. ఆతని కిరువురు భార్యలు. పెద్దయామె వాఘేలీవంశపుఁ గన్య. రెండవయామె సోళంకీవంశపుఁ గన్య.

ఇరువురు రాణులకును ఒక్కొక్క పుత్రుఁడు కలిగెను. వాఘేలీ రాణి కొడుకు పేరు రణధవళుఁడు. సోళంకీరాణికొడుకు జగదేవుఁడు.

కాలక్రమమున రాణుల కిరువురకును మాత్సర్య మధికము కాఁగా ఉదయాదిత్యుఁడు వాఘేలీరాణిమీఁది యనురాగము పెంపున సోళంకీరాణి నిలు వెడలనడఁచెను. ఈయన్యాయ్యమునకు వగచి మంత్రులు మాధ్యస్థ్య మవలంబించి కృత్యాదవస్థమీఁద సోళంకీరాణికి రెండు గ్రామములును, రాజపుత్రున కుచిత మగు నొక ప్రాసాదమును రాజుచే నిప్పించిరి. ఆప్రాసాదము రాజనగరునఁ గాక నగరమున మఱియొకచో నుండెను.

ఇందులకు సోళంకీరాణి యంతగా విచారింపలేదు. సవతితోడి కాపురము చేయువారికి సాధారణముగ నింతటి యవస్థలు కాకున్న నీరీతి యవస్థలు తటస్థించుచునే యుండును. అందును సోళంకీరాణి రెండవరాణి. తనకు సంభవించునది సవతితోడి కాపురమని యెఱిఁగియుండియు నుదయాదిత్యునిఁ బెండ్లియాడిన ప్రణయముగ్ధ. క్షత్రియకాంతలకు కష్టము వచ్చినపుడు కసియు, పట్టుదలయు నధిక మగును; గాని విచారము పొంగదు.

ఇంతేగాక, సోళంకీరాణి పుత్రవతి. జగదేవుఁడు తేజోనిధి యగు ననుటకు చాల చిహ్నములు గలవు. వినతవోలె కుమారునిచే సవతియెడల నెన్నటికైన బదులు తీర్చుకొనుటకు ఆమెకు అవకాశములు లేకపోయెను.

సోళంకీరాణి చాల వివేకవతి; గావున గ్రామముల మీఁద వచ్చు నాదాయమును అనవసరవ్యయము చేయక చాల సొమ్ము మిగిల్చి కుమారునకు రాజోచితవిద్యలు నేర్పింపఁజొచ్చెను. కోటలో రణధవలునకు ఒక్కొక్క విషయమునకు అనేకోపాధ్యాయులు గలరు. బైట జగదేవునకు ఒక్కొక విషయమునకు ఒక్క యుపాధ్యాయుఁడే యుండెను. వారికి జీతము అధికము. వీరికి స్వల్పము. ప్రకృతపు ఆంగ్లేయపాఠశాలల యందును, కళాశాలలయందును ఆంగ్లభాషోపాధ్యాయులకును, దేశభాషోపాధ్యాయులకును నెంత భేదమో యంత భేదముండిన నుండవచ్చును. అయినను విద్య యనునది నూరిపోసెడు నది కాదు; గావున ఫలముమాత్రము విపరీతముగా నుండెను. సకలవిద్యలయందును రణధవళునిమతి వెఱ్ఱితలలు వేయుచుండఁగా జగదేవునిబుద్ధి నవనవాంకురములతో కొనలు సాగి వికసింపఁగడఁగెను. వందలకొలఁది వేతనములు గ్రహించు నుపాధ్యాయుల శిక్షణము గిడసబాఱిపోవుచుండఁగా పదుల కొలఁదిమాత్రమే జీతములు గైకొనిన గురువుల బోధలు శేకెత్తసాగెను. ఇందు వింత యేమి కలదు? ప్రపంచమునందంతటనుగూడ ధనికులలోఁగంటె దరిద్రులలోనే ప్రతిభాశాలు లధికముగ నున్నారు. ధనికులయిండ్లయందలి ధనపుసంచుల మూతులు ఎంత బిగిసికొనిపోయిన వారిబుద్ధులు అంత యిరుకుకొనిపోవును.

కోటలో వాఘేలీరాణి హృదయమున రణధవళుని గుఱించిన భావికల్పనములును, బైట ప్రజలయందు నిందలును పెరిగిపోవుచుండెను. కోటకు వెలుపల సోళంకీరాణి

హృదయమున జగదేవునిగుఱించినసంతోషమును, ప్రజల యందు స్తుతులును అట్లే పెరిగిపోవుచుండెను. ఇదియంతయు నుదయాదిత్యుని కనులు విప్పెను. "ఎప్పటికైన జగదేవునివల ననే నాకు సుఖము, ఆతనివలననే యానందము. ఆతనిచేతుల యందే మృతి" యని యాతఁడు ఊహించుకొనసాగెను.

ఈసమయముననందే బిరజునివద్దనుండి బ్రాహ్మణులు శుభ సందేశముఁ దెచ్చిరి. వీరమతి ప్రజ్ఞ ఇదివఱకే కర్ణతాడితమై యున్నందున నుదయాదిత్యుఁడు ఆమెను జగదేవునకుఁ బెండ్లి చేయుటకు ఆనందముతో సంగీకరించెను; గాని వాఘేలీరాణి తోఁ జెప్పకుండ నేపనియుఁ జేయుటకుఁగాదు. అగుట నాతఁడు "బిరజుఁడు మనకు సామంతుఁడు. మనకుఁ దగినవాఁడు కాఁడు. రణధవళునకు తోడివారి పిల్లను జేయవచ్చును. జగదేవునకుఁ బెండ్లిసేయవలసినభారము నామీఁదనే యున్నది; గావున వల దనక వీరమతిని అంగీకరించి జగదేవునకు ఏదో పెండ్లి చేసె ననిపించుకొనుట మంచిదిగాఁ దోఁచుచున్న" దనిచెప్పి ఆమెను అంగీకరింపఁజేసి వెంటనే టుకటోడా గ్రామమునకుఁదరలిపోయి వీరమతీజగదేవులకు వివాహముగావించి వారిని వెంటనిడుకొని వచ్చి పట్టణము చేరికొనియెను.

ఇది మొదలు రాజు సోళంకీరాణినిఁ గూడ నగరునందే యుంచుకొనెను. వీరమతి పాదము చల్లని దని అత్తగారు ఆనం దించెను. జగదేవుఁడు ప్రతిదినమును తండ్రితోఁగూడ సభకుఁ బోయి రాజకార్యములను తండ్రికంటె స్తుతిపాత్రముగ నిర్వ హింపసాగెను. ఆకారణమున కొలఁదికాలముననందే జగదేవుఁడు

"మంచి పరిపాలకుఁడు" అని ప్రఖ్యాతిఁ బడసెను. వీరమతి కొన్నిదినములు అత్తవారియింటనుండి పుట్టినింటికి వెళ్లెను.

వాఘేలీరాణి తమ్ము అనేకబాధలు పెట్టినను జగదేవుఁడామెను తన తల్లివలెనే గౌరవింపఁజొచ్చెను. ఆతఁడు రణధవళునిఁ జాల ప్రేమతోఁ జూచుచు దినదినమును సవతితల్లి మేడకుఁ బోయి సేవలవలన నామెనుగూడ సంతోషపెట్టుచుండెను. ఈసమయమునందే జగదేవుని కీర్తి నలుదిక్కులకును బ్రాకుటకుఁ బ్రారంభించెను రణధవళుఁడుగూడ జగదేవుని వలెనే సమర్థుఁడును, సుగుణియు నైనచో వాఘేలీరాణికి ఎట్లుండునో చెప్పఁజాలము; గాని రణధవళుఁడు అంతకంతకు కోఁతుల స్థితినుండి కొండముచ్చుల స్థితికి వచ్చుచుండుటఁ జూచి యామె జగదేవునియెడల నసూయావిష్టయయ్యెను. కొలఁది దినములయందే యామె శుద్ధాంతఃకరణముతోఁ దనమేడకు సేవింపవచ్చుచున్న జగదేవునిమీఁద తీరని నేరమును మోపి రాజునకు నమ్మకము పుట్టునట్లు చెప్పెను. వెంటనే రాజు "దేశము విడిచిపొమ్ము" అని జగదేవునకు ఆజ్ఞాపించెను.

ఉదయాదిత్యుఁడు ఇట్లేల వంచితుఁడు కావలెను? వాఘేలీరాణి గుణములు ఆతనికిఁ దెలియనివి గావు. జగదేవుని సౌజన్యము ఆతని హృదయమున నత్యధికానందమును గలిగించుచునే యుండెను. ఈసౌజన్యమే వాఘేలీరాణి హృదయమున అసూయాగ్నినిఁ బ్రజ్వలింపఁజేసి యింతపని చేయించెనని యూహించుట కాతనికి తగినంతబుద్ధియు లేకపోలేదు. అయిన నిట్టిది యేల సంభవింపవలెను? పురుషు లేమైనను జెప్పనిండు. భార్యయాజ్ఞకు బద్ధుఁడుకానివానిని మేము విన

లేదు. అయితే; వివేకవతులగు రమణులు తమ యాజ్ఞానువర్తులగు పతులకు అమర్యాద కలుగునట్లు చేయరు. అంతియగాక, పురుషులను దామే నడుపుచున్నట్లు ప్రకటన గానీయరు. దౌర్భాగ్యవశమున నిందులకు వ్యతిరేకము సేయు స్త్రీలు గూడ విశేషముగనే యున్నారు; గాని కావ్యములు కాంతాసమ్మితము లనుటలో నాలంకారికులహృదయములయందు ఇట్టి స్త్రీల యుదాహరణము లేదు.

సోళంకీరాణికి మూరెడు ఎగఁబ్రాకి బారెడు దిగఁజాఱినట్లు అయ్యెను. ఆమెకుఁ బ్రత్యేకముగ నియమింపఁబడిన భవనమునందే యుండిన నింతకంటె బాగుగ నుండియుండును. ఇట్టిది తటస్థించు సూచనలు లేకున్నను, అనుకొనుటకుఁ గూడ నవకాశములు లేకున్నను జగదేవునకు అప్రయత్నముగ లభించిన రాజానుగ్రహమును తిరస్కరించుట మంచిది గాదని యామె యూహించెనేమో మేము చెప్పఁజాలము. ఎట్లయినను వాఘేలీరాణి పిడికెఁడు చల్లి గంపెఁడు తీయు కర్షకునివలె సోళంకీరాణియెడల రవంతఅంగీకారము ప్రకటించి కొండంత తిరస్కారమును జూపెను.

ధారానగరమునకుఁ జాలదూరమున పట్టణ మను స్వతంత్రసంస్థాన ముండెను. అక్కడకుఁ బోయి ఉద్యోగమును సంపాదించుకొని పిదపఁ బిలుచుకొనిపోయెద నని తల్లికిఁ జెప్పి, జగదేవుఁడు తన ఖడ్గమును గైకొని తన గుఱ్ఱము నెక్కి బయలుదేఱెను. ఆతని నిర్గమనమును జూచి ప్రజలు అందఱును జాల తల్లడిల్లిరి. రాజు మౌర్ఖ్యము దేశమునందంతటను గర్హింపఁబడెను. దేశమున సోళంకీరాణి సౌజన్యము నెఱిఁగిన రమణు

లందఱును "వాఘేలీ, నేఁడు నీదినము. చేఁదుము. కుండ యింకను నిండలేదు. ఎక్కుము. కొండకు ఒక్కమెట్టే మిగిలి యున్నది" అని నిందింపఁదొడఁగిరి.

కొంతదూరము పోయినతరువాత జగదేవునకొక యా లోచన తోఁచెను. ఉద్యోగముకొఱకు పట్టణమున నెన్నిదిన ములు వేచియుండవలెనో. ఉద్యోగము లభించిన తరువాత నెన్నిదినములకు సెలవు చిక్కునో. అక్కడఁ బ్రయోజన మే మయినఁ గలుగునో లేదో; గావున ముందుగ నొకమాఱు వీర మతిని జూచిపోవుట మంచి దని యాతనికిఁ దోఁచెను. వెంటనే యాతఁడు గుఱ్ఱమును మఱలించి కొన్నిదినములకు టుకటోడా గ్రామోపాంతమున నున్న ఉద్యానమునుఁ జేరికొనెను. అక్క డకుఁ జేరునప్పటికి అస్తమయము అగుచుండెను. కొంచెమువ్ప టవిశ్రమింపఁదలఁచి యాతఁడు గుఱ్ఱమును నీరుత్రావించి ఒకచెట్టుకొమ్మకు కట్టి తానును దాహము తీర్చుకొని యొక పూలచెట్టుక్రింద నిదురించెను.

వాఘేలీరాణికి జగదేవుని ఇలు వెడలఁగొట్టించినంత మాత్రమునఁ దృప్తిలేదు. జగదేవుఁడు బ్రతికియున్నంతకాల మును రణధవళునకు పేరుప్రతిష్ఠయు రావని నిశ్చయించు కొని వెనుకనే పోయి ఆతనిని సంహారించుటకు నలుగురు దుర్మార్గులను నియమించెను అట్టిది సంభవింపవచ్చునని ముందే తలంచి జగదేవుఁడు సరియైనమార్గమునఁ బోవుట మాని వం కరటింకరదారులను బట్టి నడువసాగెను.

కాని దురంతకులు ఆతని విడువలేదు. వారు అనేకవిధ ముల జాడలుతీయుచు వెనుకనే వచ్చి టుకటోడాగ్రామో

ప్రాంతమున నిదురించియుండఁగా జగదేవుని పట్టుకొనిరి. మేలుకొనునప్పటికే కాలుసేతులు బంధింపఁబడుటచే జగదేవుఁడు ఏమియుఁ జేయలేక "ఈశ్వరా, నీలీల లనంతములు" అని తలంచి యూరకుండెను. దురంతకులు ఆతనిని దీసికొని యరణ్యమునకుఁ బోయిరి.

ఇదియంతయుఁ జూచుచున్న వృద్ధుఁడగు ఉద్యానపాలకుఁడు రక్షకభటులతో నీవృత్తాంతమెఱిఁగింపఁబోవుటకు తటాలున వెనుకకు దిరుగునంతలో నిరువురు ఆశ్వికులు ఖడ్గపాణులు కాన్పించిరి. కనుపించుటయే తడవుగ వృద్ధుఁడు సంగతియంతయుఁ దెలుపఁగా ఆశ్వికులు దొంగలుపోయినదిక్కునకుఱికిరి. వీరుపోయి చూచునప్పటికి దురంతకులు జగదేవుని మధ్యనిడుకొని "చంపుదమా? చంపునంత పని జేయుదమా!" యని జగదేవుని గుఱించి యాలోచించుకొనుచుండిరి. వారినిఁ జూచినంతనే ఆశ్వికులు బల్లెము లెత్తఁగా చోరులు తటాలున లేచి నిలిచి యెదిరించిరి. కత్తియుఁ గత్తియుఁ గలిసి పోరు ఘోరమగునంతలో ఆశ్వికు లిరువురు నిరువురుచోరులను సంహరించిరి. మిగిలిన యిరువురును బాఱిపోయిరి.

పిదప నాశ్వికులు జగదేవుని బంధనములువిప్పి గ్రామము జొచ్చి నగరునకుఁ గొనిపోయిరి. నగరు చేరునంతవఱకును జగదేవుఁడు అనేకవిధములఁ గొనియాడుచునే యుండెను. పిదప నగరున దాసీసుందరుల పలుకులను బట్టి ఆశ్వికు లిరువురును దన యర్ధాంగి యగు వీరమతియు, నామె చెలికత్తెయు నని యెఱింగి తన దేవి యంతటి వీరాంగన యగుటకును, ఆమెవల

ననే తన ప్రాణములు రక్షింపఁబడుటయుఁ జూచి బ్రహ్మానంద భరితుఁడై యామె ననేకవిధములఁ గొనియాడెను.

వీరమతి భర్తకు స్వయముగ సకలపరిచర్యలును జేసి ముఖము తేరికొనినపిదప పదనికటమునఁ గూర్చుండి "మాకుఁ దెలుపకయే మీరు ఒంటరిగ నేలబయలు దేఱి వచ్చితిరి?" అని ప్రశ్నింపఁగా నాతఁడు జరిగిన దంతయుఁ జెప్పెను.

మఱునాఁడు జగదేవుఁడు "నాకు సెలవు ఇమ్ము" అని యడుగఁగా వీరమతి "మీరెక్కడకో పో నేల? ఇక్కడనే యుండవచ్చును" అనియెను; గాని యందుల కాతఁడు అంగీకరింపలేదు. "మీయన్న నాతండ్రికి సామంతుఁడు, నన్ను ఇచ్చట నిలుపుకొనినచో మీయన్నకును, రాజ్యమునకును గూడ చాల ముప్పు మూడవచ్చును" అని యాతఁడు చెప్పి "వెళ్లకతీఱదు" అని తన నిశ్చయము నెఱింగించెను. "నేను ముందుపోయి ఉద్యోగమును సంపాదించుకొని వచ్చి పిదప నిన్ను పిలుచుకొనిపోయెదను" అనియు నాతఁడు చెప్పెను. "మీరు పట్టణసంస్థానమునకు వెళ్లకతీఱనియెడల నిప్పుడే మీవెంట రాకమానను" అని వీరమతి బదులు చెప్పఁగా జగదేవుఁడు ఎట్టకేలకు అంగీకరించి బావమఱఁదివద్ద సెలవుగైకొని భార్యతోఁ గూడ బయలుదేఱెను. పట్టణము చేరునంతదనుక మార్గమధ్యమున నేయాపత్తులు వచ్చినను తప్పించుకొనుటకు తన సైన్యమును గొంత వెంటఁదీసికొనిపోవలసిన దని బిరజుఁ డెంతో చెప్పెను; గాని జగదేవుఁడు అంగీకరింపలేదు "మీచెల్లెలు నావెంట నుండ నాకేమి విపత్తులు? వేవురువీరభటులకంటెను వీరమతి యొక్కతెయు ఎక్కువ సాయము; గావుననే నావెంట

నామె వచ్చుట కంగీకరించితిని. మీసైన్యము వలదు" అని యాతఁడు బదులు చెప్పెను. వీరమతియు జగదేవుఁడును మంచి యాయుధములు ధరించి గుఱ్ఱముల నెక్కి పయనము సాగించిరి.

ఒకటిరెండు పూటలలో నొకటిరెండు గ్రామములు దాఁటి వారు ఒక గ్రామమున ముందునకు దారియెట్లని యడుగఁగా "ముందు మార్గము రెండుగా చీలినది. ఒకమార్గము నిష్కంటకము. రెండవమార్గమున వారముదినములనుండి యొక పెద్దపులి బాటసారుల చంపుచున్నది." అని యచ్చటి వారు చెప్పిరి. "మనము బెబ్బులియున్న మార్గమునందే పోయి దానిని సంహరించి బాటసారుల భీతిఁ బోఁగొట్టుదము" అని వీరమతి పలికెను. జగదేవుఁడు వల్లె యనెను.

"సాహసము వలదు" అని యూరివారెంత వారించుచున్నను వినక వారు ఆమార్గమునందే బయలుదేఱిరి. కొంత దూరము పోవునప్పటికి ఎదుట పెద్దపులి కాన్పించెను. ఇరువురు బాటసారులు ఒక చెట్టుకొమ్మమీఁదఁ గూర్చుండి గజగజవడకి పోవుచుండిరి. వారిని "భీతి వల"దని సన్న చేసి జగదేవుఁడు పులిమీఁదికి బాణము విడిచెను. తోడనే పులి యాదంపతుల మీఁదఁ బడెను. వారికి ఏమియునపాయశంకయైనను గలుగక పూర్వమే పులిచచ్చెను; గాని దానిరోదనమువిని పొదలోనున్న ఆఁడుపులి మీఁదికి దూఁకెను. దానినిఁ గూడ వారు సులభముగనే సంహరించిరి; గాని యీపోరాటమున జగదేవునిగుఱ్ఱమున కపాయము గలిగెను. తటాలున గుఱ్ఱము దిగి మీఁద

నున్న తన పచ్చడము గట్టి జగదేవుఁడు చాలనుపచారములు చేసెను; గాని గుఱ్ఱము బ్రతుకలేదు.

చెట్టుమీఁది బాటసారులు క్రిందికి దిగివచ్చి జగదేవుని గుర్తించి "ప్రభూ, మేము నీబంట్లము. నీవు ఊరు విడిచిన తరువాత మీయమ్మ జరిగిన దంతయుఁ జెప్పఁగా మంత్రి ధీరసింహుఁడు నిన్ను వెదకుటకై బయలుదేఱెను. మేము ముందు గ్రామమున బస యేర్పఱచుటకై ముందువచ్చి యీవిపత్తునకు లోనైతి" మని చెప్పిరి. జగదేవుఁడు తన తల్లి కుశలవార్త విని యానందించి "రండు ధీరసింహునిఁ గలిసికొందము" అని యెను. భటులు వల్లె యని వెనుకకుఁ దిరిగిరి. జగదేవుఁడు వీరమతి గుఱ్ఱముమీఁద నెక్కి ఆమెను వెనుకఁ గూర్చుండఁ బెట్టుకొనెను. భటులు ఒకఁడు ముందును మఱియొకఁడు వెనుకను బయలుదేఱిరి.

కొంతదూరముపోవునప్పటికి వారికిఁ గొంద ఱాశ్వికులు ఎదురైరి. వారు శత్రువులో బాటసారులో యని యూహించుచుండఁగనే అతిరయమున వచ్చి తాఁకిరి. జగదేవుఁడును, వీరమతియు కత్తులు దూసి ఒక్కుమ్మడిగ వారిపైఁ బడిరి. వెంట నుండినభటులు నిరాయుధులగుటచే రాతిముక్కలు పరికొని పొదలచాటున నిలిచి ఆగంతుకులమీఁద రువ్వఁ జొచ్చిరి.

ఘోరయుద్ధము ప్రారంభమైన కొంతసేపటికి వీరమతి కత్తిదెబ్బ తిని ఆగంతుకుల నాయకుఁడు గుఱ్ఱముమీఁదనుండి క్రిందఁబడి రూపుమాసెను. అది చూచి తక్కినవారు మఱింత విజృంభించిరి. వీరమతి చేతికందిన మఱియొకనిమీఁద విసరఁ

బోఁగా కత్తి క్రిందఁబడిపోయెను. ఆమె వంగి దానినిఁ దీసికొనునంతలో శత్రువు ఒకఁడు రెండు బాణములు విడిచెను. వెంటనే యామె మూర్ఛిల్లెను.

ఇంతవఱకును జగదేవుఁడు నిశ్చింతతోడను స్వేచ్ఛగను యుద్ధము చేసెను. ఇప్పు డట్లు గాదు. మూర్ఛిత యగు భార్యను రక్షించుకొనవలెను. శత్రువులకు సమాధానము చెప్పుకొనవలెను. అర్థాంగలక్ష్మి పడిపోవుటఁ జూచి మనస్సు చిక్కఁబట్టుకొనవలెను. గంభీరహృదయుఁడు; గావున నాతఁడు విచారము లేక సందియము విడిచి స్వేచ్ఛగనే పోరసాగెను.

ఇంతలో మఱియొక యాశ్వికసంఘము వచ్చి కత్తి కలిపెను. జగదేవుఁడు చూడఁగా క్రొత్తఁగా వచ్చినవారు మొదట వచ్చినవారిని సంహరింపఁదొడఁగిరి; గాని పిదప పోరు ఎంతసేపో పట్టలేదు. ఒకటిరెండునిముసములయందే హతశేషులను బంధించి క్రొత్తగా వచ్చిన ఆశ్వికులనాయకుఁడు జగదేవుని యెదుటకువచ్చి నిలిచెను చూడఁగా నాతఁడు ధీరసింహుఁడు. జగదేవుఁడు వెంటనే యాతనిపైఁ బడి కౌఁగిలించుకొని ఆనందబాష్పములను విడిచెను. పిదప నిరువురును వీరమతికి ఉపచారములను ప్రారంభించిరి.

రెండుమూఁడునిమిషములయందే వీరమతి తేరికొని జగదేవునితోడను, ధీరసింగుతోడను, ధీరసింగు తెచ్చిన రొట్టెలను దిని పాలు ద్రావి కోలుకొనెను. అపుడు మంత్రి "ఇదియంతయు వాఘేలీరాణి చేసిన కుట్ర. ఇది యంతయు రాజునెదుట నిర్ధారణచేయుటకు నేను కొన్ని యాధారములను సంపాదించి యుంచినాను; గావున వెనుదిరిగి రమ్ము" అని

చెప్పెను; గాని జగదేవుఁడు అందులకు అంగీకరింపలేదు. "ద్రోహ మంత్రము వాఘేలీరాణిది యగుట యథార్థము. అది నిర్ధారింపఁబడుటలో సందేహము లేకపోవచ్చును; గాని యట్టిదియే సంభవించినయెడల వాఘేలీరాణికి అవమానము సంభవింపవచ్చును. ఆమె రాజపత్ని. నాయెడల ప్రేమ లేకపోయినను సవతితల్లి. నిజమును నిర్ధారించి ఆమెకు అవమానము కలిగించుటకంటె నేనే నిందను భరించుట మంచిది. ఇంతకును నాకొక శపథము కలదు. నేనిలువెడలునపుడు నాబాహుబలమునఁ గీర్తి సంపాదించిగాని నాతండ్రికిఁ గనఁబడఁగూడ దని నిశ్చయించుకొంటిని." అని జగదేవుఁడు బదులు చెప్పి మంత్రిని మఱల మాట్లాడకుండఁ జేసెను. అంతట ధీరసింగు తన గుఱ్ఱమును జగదేవున కిచ్చెను. "నాతల్లికి నాక్షేమము నెఱింగించి నామాఱుగ నీవే పుత్త్రుఁడవై ఆమెను గాపాడుచుండుము" అని చెప్పి జగదేవుఁడు ధీరసింహుని గుఱ్ఱము నెక్కెను. వీరమతి వెంటనే తనగుఱ్ఱము నెక్కెను. "ముందు మీకు శుభ పరంపర గలుగుఁగాక" అని దీవించి ధీరసింహుఁడు ఒక పరిచారకునిగుఱ్ఱము నెక్కి సపరివారుఁడై వెనుదిరిగెను.

కొంతదినములయందె వీరమతియుఁ జగదేవుఁడును పట్టణముసమీపించిరి. పట్టణప్రాంతమున నున్న సహస్రలింగతటాకమనుచెఱువుగట్టుమీఁదికి వెళ్లునప్పటికిఁ గొంచెము ప్రొద్దుండెను. జగదేవుఁడు గుఱ్ఱములను వీరమతిని అక్కడనుంచి "పట్టణములో బస చూచి వచ్చెద" నని వెడలిపోయెను.

ఇంతలో నీళ్లకై యచ్చటకు వచ్చిన యొకరమణి వీరమతి త్రిలోకసుందరియై యుండుటఁ జూచి సమీపించి చాతుర్య

ముతో నామెపేరు, మగనిపేరు, అత్తమామలపేరు, తలిదండ్రు లపేరు దెలసికొని తనదారినిఁ బోయెను. పక్షులు అన్నియు కులాయములకుఁ జేరుకొనుచుండుటఁజూచివీరమతి "పట్టణము న ఇంకనుబస కుదురలేదుగాఁబోలు"నని యనుకొనుచుండఁగా నచ్చట కొకపల్లకీ వచ్చెను. తోడనే యందుండి సుందరియగు నొకరమణి ఇవ్వలకువచ్చి ముసిముసినగవులతో వీరమతినిసభిా పించి "మీారిట్లు అన్యులవలెఁ బ్రవర్తించుట ధర్మమా? మీా రిచ్చటకు వచ్చుచున్నట్లు కాకిచేనైనఁ గబురుసేయఁగూడదా? నేను ఉదయాదిత్యమహారాజుగారి పినతండ్రికొమార్తను. జగదేవుఁడు నాకు వ్రేలువిడిచిన మేనల్లుఁడు. ఆతఁడు బసకొ అకు పట్టణములో తిరుగుచుండఁగా షికారు పోవుచున్న రాజు గారు చూచి ఆనవాలుపట్టి షికారు మానివేసి ఆతనితో నగరు నకు వచ్చిరి. మామేనల్లునివలన నీవు ఇచ్చట నుండుట విని నిన్ను దీసికొనిపోవుటకు వచ్చితిని. రమ్ము. పల్లకీ యెక్కుము" అని చెప్పి "మీారు గుఱ్ఱములను తీసికొనిరండు" అని తననౌక రులకు ఆజ్ఞాపించి చేయిపట్టుకొని లేవఁదీయఁగా వీరమతి కాఁ బోలు ననుకొని ఆమెతోఁగూడ పల్లకీ యెక్కెను. పల్లకీ బయ లుదేఱెను.

ఈవచ్చినయామె జగదేవుని మేనత్త యని వీరమతివ లెనే మాపాఠకమహాశయులుగూడ మోసపోవుట మాకు ఇష్టము లేదు. ఆమె జామోతీఅను నొక వేశ్య. ఆమెను పట్టణ మునందలి కొత్వాలు ఉంచుకొనెను. ఆతఁ డింక ననేకవార కాంతల నుంచుకొనియెను; గాని జామోతీమీాఁద ననురాగ ము అధికము. జామోతీ కొత్వాలువలన సంపాదించు అధిక

ధనముతోఁ దృప్తిబొంద లేదు. కొత్వాలునకు "లాలుదాసు" అను నొక కుమారుఁడు కలఁడు. ఆతఁడు తండ్రికంటెను జారుఁడు. లాలుదాసు దినదినమును తనకొక స్త్రీనుం దరిని అప్పగించునట్లును అందులకు తాను జామోతికి అధికధనము ఇచ్చుచుండునట్లును అంగీకరించెను. జామోతి అందులకు అంగీకరించి యింతవఱకును పట్టణమునందలి చాలమంది అబలల పాతివ్రత్యమును పాడుచేసెను.

అట్లు జామోతీ వీరమతినిఁ దనయింటికిఁ గొనిపోయి అభ్యంగనస్నానము చేయించి స్త్రీవస్త్రములు కట్టనిచ్చి మనోహర మగు నొకప్రాసాదమున విడియించి భోజనపదార్థములను దెచ్చి ముందుఉంచెను; గాని వీరమతి "మీ మేనల్లుఁడు వచ్చినఁగాని నేను అన్నము ముట్టను" అని చెప్పెను అందులకుఁ జేయునది లేక జామోతీ ఆపదార్థముల నచ్చటనే యుంచి బైటికి వచ్చి తలుపులు గొళ్లెము వేసి వెడలిపోయెను. అదిచూచి వీరమతి చాల సందేహింపఁజొచ్చెను; గాని యేమి యుదోఁచినది గాదు.

దాసీలు వీరమతికి తల యంటుచుండఁగా జామోతీ "జగదేవుఁడు అను బాటసారినిఁ బట్టుకొని కైదుచేసి దీపాలవేళకే రమ్ము" అని లాలుదాసునకు వార్త నంపెను. లాలుదాసును లంచములు మున్నగునాధనములవలన నగరమునందలి పోకిరిజట్టునంతను చేతిక్రిందికిఁ దీసికొనియున్నాఁడు; గావున అచిరకాలమునందే వారి సాయమున జగదేవునిఁ బట్టుకొని కైదులో వేసి జామోతీయింటికి వచ్చెను. జామోతీ

వానివలన నిర్ణీత మగు ధనము గైకొని వానిని వీరమతి యున్న మేడమీఁదికిఁ దెచ్చి విడిచెను.

లాలుదాసునుఁ జూచినతోడనే వీరమతి సందేహము బలపడెను. అందులకుఁ దార్కాణగా లాలుదాసు దుర్భాషలు ప్రారంభించెను. వీరమతి నయమున భయమున ననేకపథముల మందలించెను; గాని లాలుదాసు వినక ఆమె నంటఁబోయెను. తోడనే వీరమతి చట్టున మొలలోని గుప్తఖడ్గమును దూసి వానిని నఱికి వేసి ఆమొండెములను మూటగట్టి గవాక్షమార్గమున వీధిలోనికిఁ బాఱవేసి తలుపు లన్నియు లోపల బిగించుకొని ఈశ్వరుని నమ్మి కూర్చుండెను.

పట్టణ మను నామాంతరము గల అణహిలపురము ఆ కాలమున ఎటుచూచినను పండ్రెండు క్రోసుల పట్టణమైయుండెను. దానిని రాత్రులయందు కాపాడుటకు అనేకవేల రక్షక భటులు నియమింపఁబడియుండిరి. జామోతీ యింటి ప్రాంతమున నున్న రక్షకభటులు ఆమూట విప్పి చూచి గుండెబెదరుతో తమ యజమానుఁ డగు కొత్వాలు నక్కడకుఁదీసికొని వచ్చిరి. కొత్వాలు వచ్చి "లాలుదాసు ఎక్కడ నున్నాఁడు" అని యడుగఁగా "ఒక జగదేకరంభ కౌఁగిట" నని జామోతీ బదులు పలికెను. కొత్వాలు అపుడు జరిగినదంతయుఁజెప్పఁగా జామోతీ గుండెలు బాదుకొనుచు వీరమతి యున్న మేడకు వచ్చెను; గాని తలుపులు అన్నియు బిగింపఁబడియుండెను. ఎన్నిసారులు పిలిచినను వీరమతి పలుకలేదు. రక్షకభటులు తలుపులు ఎత్తివేయుటకు ప్రయత్నించిరి; గాని ప్రయోజనము

కలుగలేదు. ఇట్టి రహస్యపుఁ బనుల కుపయోగించుటకై జామోతీ యాప్రాసాదము నత్యదృఢముగాఁ గట్టించియుంచెను.

పిదప కొత్వాలుమూట యేగవాక్షమునుండి క్రిందఁ బడెనో యాగవాక్షమునకు నిచ్చెనవేయించి "ఎక్కిచూడు" మని యొకభటున కాజ్ఞాపించెను. యజమానుని సెలవు చొప్పున వాఁడు నిచ్చెనమీఁద నెక్కి వచ్చెను; గాని తల గవాక్షములో నుంచిన వెంటనే వీరమతి దానిని ఎగురఁగొట్టెను. ఆమె ఇట్లు పదునొకండుగురు భటుల పుఱ్ఱె లెగురఁ గొట్టెను. ఎవరు ఎక్కినను అట్లే జరుగు నని నిశ్చయించుకొని కొత్వాలు ఎంత చెప్పినను తక్కిన భటులు అందులకు అంగీకరింపలేదు.

ఒక యబల పండ్రెండుగురు వీరుల తలలెగురఁగొట్టుట, క్షణములో నగరమునందంతటను మాఱుమ్రోసెను. వెంటనే పెద్దపెద్ద యుద్యోగు లందఱు నక్కడకు వచ్చిరి. రాజుగూడ వచ్చెను. సేనాధిపతులుగూడ నిచ్చెన నెక్కుటకు భయపడఁ జొచ్చిరి. లోపలనున్న స్త్రీనిఁ జూచుటకు గవాక్షమునుండి లోనికిఁ జూడకతీఱదు. తల గవాక్షములోఁ బెట్టిన వెంటనే క్రిందఁబడిపోవును. కత్తి కలుపుటకు నిచ్చెనమీఁద నవకాశము లేదు." అని వారు చెప్పసాగిరి. అదివిని రాజు "మీరుండుఁడు" అని తానే నిచ్చెన యెక్కుటకు సిద్ధపడెను.

రాజునకు మతి పోయిన దని అందఱును జెప్పుకొనుచుండఁగా రాజు నిచ్చెన యెక్కి గవాక్షముచెంతకుఁ బోయి తల యెత్తకయే "రమణీమణీ, నీవెవ్వతవు? నాభటుల నిట్లేల సంహరించుచున్నావు? నేను ఈనగరము నేలు రాజను. నీకెవరివలననైన నపకారము జరిగె నేని చెప్పుము. వారిని శిక్షిం

కదను" అని పలికెను. అది విని వీరమతి "మహారాజా, నేను చావడాకులోత్పన్నుఁడగు బిరజమహారాజు చెల్లెలిని. ఉదయాదిత్యమహారాజుగారి కోడలిని. నాపేరు వీరమతి" అని తన్నెఱిఁగించి జరిగిన దంతయుఁ జెప్పెను. "జామోతీ మున్నగు నెల్లరను శిక్షించెదను. నీభర్తను వెదకించెదను. నేను నిన్ను కొమార్తగా భావించి ఆదరించెదను. నాయింటికి రమ్ము" అని రాజు చెప్పెను; గాని వీరమతి "నాభర్తను జూడకుండ నిక్కడనుండి కదలను" అని దృఢముగాఁ బలికెను. రాజు క్రిందికి దిగెను.

జగదేవుని వెదకుటకు రక్షకభటులు బయలుదేఱిరి. ఆతనిని కైదు చేసిన రక్షకభటులు ఇది యంతయు విని రాజునకు వృత్తాంతము చెప్పిరి తోడనే జగదేవుఁడు కారాగారమునుండి కొనిరాఁబడెను. రాజు ఆతని నాదరించి యిక్కడ జరిగిన దంతయుఁ జెప్పి నిచ్చెనయెక్క నాజ్ఞాపించెను. తోడనే జగదేవుఁడు నిచ్చెన యెక్కి పోయి వీరమతికిఁ దన్నెఱిఁగించి గవాక్షములోనుండి లోనికిఁ బోయి ఇంతపనిఁ జేసినందులకు ఆమెనుఁ జాల మెచ్చుకొని కౌఁగిలించుకొని ఆదరించెను. పిదప నిరువురును నిచ్చెనమీఁదినుండి క్రిందికి దిగివచ్చిరి. వీరమతినిఁ జూచి రాజు మున్నగువా రందఱును నమస్కరించిరి. రాజు కొత్వాలును, జామోతీని, ఇంకను ఈయపరాధముతో సంబంధము గలవారి నందఱను బంధించి తీసికొనిరావలసిన దని రక్షకభటుల కాజ్ఞాపించి ఆదంపతులను దనరథముమీఁద నెక్కించుకొని నగరునకుఁ బోయెను.

రాజు జామోతీని కైదులో వేయించి యామె యాస్తి నంతయు స్వాధీనము చేసికొనియెను. కొత్వాలునిఁ గూడ

గారాబద్ధునిఁ గావించి యంత యుద్యోగమును జగదేవున కిచ్చెను.

జగదేవుఁడు కొత్వాలు అయిన రెండుమూఁడు మాస ములకే పరిపాలనమునఁ గల అన్యాయ్య మంతయు మాయ మయ్యెను. జగదేవుఁడు శ్రీకృష్ణుని యవతార మనియు, వీర మతి అణహిలపురకాంతల పాతివ్రత్యమును రక్షించుటకు వచ్చిన దేవతయనియు నెల్లరు నానందింపఁజొచ్చిరి. కొలఁది కాలమునందే వీరమతి గర్భవతియై యొక శుభసమయమున కుమారునిఁ గనియెను. రాజు, జగదేవునకుఁ గుమారుఁడుపుట్టి నందులకు గొప్ప యుత్సవము చేసెను. జగదేవుఁడు కుమారు నకు జగద్ధవళుఁడు అని పేరుపెట్టి యీసంగతి తన తల్లికిఁ దెలు పుటకై దూత నంపెను.

కాలము ఇట్లు సంతోషముతోఁ గడచిపోవుచుండెను; గాని సంతోషముతో ననుమాటకుఁ గొంత పరిమితియున్నది. ఒకరి సంతోషము ఒకరి విచారమునకుఁ గారణము గావ చ్చును. సూర్యోదయమునకు జగమంతయు నానందించుచుం డఁగా గుడ్లగూబ గింజుకొనును. చంద్రోదయమునకు విశ్వ మంతయు సంతసించుచుండఁగా చోరులు సంజుకొందురు. జగదేవుని సామర్థ్యమువలన నగరవాసు లంపటమును సుఖించు చుండఁగా పూర్వపు కొత్వాలు ననుచరు లంపటమును రుసరుస లాడఁజొచ్చిరి.

ఇట్లుండఁగా నగరమున నొక క్రూరవ్యాధి పొడసూ పెను. దినమునకు వేలకొలఁది చనిపోవుచుండిరి. కాళికాదేవికి ఆగ్రహము వచ్చినదనియు కావుననే యిట్టి వైపరీత్యముపుట్టె ననియుఁ దలఁచి రాజు ప్రతిదినమును దేవినిఁ బూజింపసాగెను.

ఒకనాఁడు పూజాసమయమున "రాజా, రిక్తపూజలతో నాకు తృప్తి కలుగదు. సర్వలక్షణసంపన్నుఁ డయిన రాజపుత్రుని ఒకనిని నాకు బలి యిచ్చెద వేని శాంతించెద" నని గుడిలో నొకమాట వినఁబడియెను. రాజు అందులకు ఆశ్చర్యచకితుఁడై "అట్టి రాజకుమారుఁడు నాకుఁ గాన్పించుట లేదు" అనిపలుకఁగా "కలఁడు జగదేవుఁడు. అని మఱల వినఁబడియెను. ఈ మాట వినుటతోడనే రాజు ఖిన్నుఁడై యింటికిఁ బోయెను. ఆతఁ డన్నమైన ముట్టుట మాని వేసెను.

కర్ణాకర్ణిగ నీవార్త జగదేవునకుఁ దెలిసెను. ఆతఁడు వీరమతి దెసఁజూడఁగా నామె "ఇఁక యోచనవలదు. మీరును నేనును బిడ్డఁడునుగూడ బలిపోదము. ఇంతచేసినను మనము ఈ మహారాజు ఋణము తీర్చుకొనఁజాలము" అని పలికెను. వీరమతి సాహసమునకు ఆనందించి జగదేవుఁడు కుమారు నెత్తుకొని ఆనందముతో కాళికాలయమునకు బయలు దేఱెను.

ఈవృత్తాంతము పిడుగువలె రాజు చెవులఁ బడియెను. తోడనే లేచి యాతఁడు ఆలయమునకుఁబరుగెత్తికొనిపోయెను. అప్పటికి వీరమతియు, జగదేవుఁడును "ముందు బిడ్డని బలి యిచ్చి పిదప మనము బలిపోద" మని కూడఁబలుకుకొనుచుండిరి. అంతట రాజు వారిచెంతకుఁ బోయి "నారాజ్యమంతయు నాశనమైపోయినను మీరు దేవికి బలిపోవుటకు వలను పడదు. అని వారికి అడ్డుపోయెను. అంతట "రాజా, అడ్డకుము" అని దేవివెనుకనుండి యొకమాట వినవచ్చెను. రాజు సందేహించి చూడఁగా దేవివెనుక ప్రాతకొత్వాలు అనుచరుఁ డొకఁడు గూర్చుండియుండెను.

అంతట రాజు "ఇది యంతయు నీతుచ్ఛులు పన్నిన

పుత్ర" యని నిశ్చయించుకొని జగదేవునకు సర్వము నెఱిం గించి ఆదుర్మార్గులను శిక్షించి తనకొఱకు ప్రాణములను విడుచుటకుఁ గూడ సిద్ధపడిన ఆదంపతులను, వారి కుమారుని చాల నాదరించి వీరమతి యనుమతి నంది తన కొమార్తెయగు ప్రభావతిని జగదేవునకుఁ బెండ్లిచేసి చాల గ్రామము లరణ మిచ్చెను.

ఇంతలో నట ధారానగరమున ఉదయాదిత్యుఁడు వాఘేలీరాణి చేతి కీలుబొమ్మయై అక్రమములు ప్రారంభించుట వలన ప్రజలు తిరుగఁబడిరి. అదివిని శత్రురాజు ఒకఁడు దండెత్తి వచ్చి ఉదయాదిత్యుని, ఆతని రాణివాసమును కైదుచేసి రాజ్య మాక్రమించుకొనియెను. ఇదివిని జగదేవుఁడు మామగారి సెలవుఁ బడసి వీరమతితోఁగూడ బయలుదేఱి ధారానగ మునకువచ్చి శత్రువును దాఁకెను. మఱల పోరు ఘోరమయ్యెను. ఒకమూల జగదేవుఁడును, ఒకదెస వీరమతి శత్రుసంహారము చేయుచుండఁగా అణహితపుర సైన్యము శత్రువుల మీఁద మిడుతల దండువోలె పడి నాశనము చేసెను. పిదప జగదేవుఁడు తలిదండ్రులను తక్కినవారిని విడిపించి యథాపూర్వకముగ తండ్రిని గద్దెమీఁద నిలిపెను. ధీరసింగు ఇదే సమయమని యెంచి జగదేవుని సంగతి యంతయు నిండుకొలువునఁ బ్రకటపఱిచెను. తోడనే ఉదయాదిత్యుఁడు జగదేవుని యౌవరాజ్యమున నభిషిక్తునిఁ జేసి సోళంకీరాణినిఁ జాల నాదరించి అపరాధము క్షమింపఁ బ్రార్థించి వీరమతిని కొనియాడి వాఘేలీరాణిని శిక్షించెను. వీరమతి యిట్లు బ్రతికి యున్నంత కాలమును భర్తకుఁ జేదోడువాదోడుగ నిలిచి సకలసౌఖ్యములను గలిగించి ఆనందపెట్టి ధన్యురాలయ్యెను.

---

# 12. ఉమాబాయి.

---

శివాజీమహారాజు మనుమఁడగు శాహుమహారాజు సేనానులలో ఖండేరావు ఒకఁడు. ఆతని భార్య పేరు ఉమాబాయి. ఖండేరావునకును, పేష్వా యగు బాలాజీవిశ్వనాథునకును చాల స్నేహ ముండెను. వారిరువురును అన్నదమ్ముల వలెఁ బ్రవర్తించుచుండిరి.

కాని వారి యనంతరము వారి పుత్రులకు ఈస్నేహము నిలువలేదు. ఖండేరావు పెద్దకొడుకు త్ర్యంబకరావునకును, బాలాజీవిశ్వనాథుని కుమారుఁడు బాజీరావునకును మనస్పర్థలుఁ పెరిగి ఒకరి నొకరు అంత మొందించుకొనుటకుఁ బ్రయత్నములు ప్రారంభించిరి. తుదకు యుద్ధము పొసగఁగా త్ర్యంబకరావు సింహకిశోరమువలె ననంతవిక్రమముతో వీరవిహారము ప్రారంభించెను. అందులకు బాజీరావు తాళఁజాలక మోసము చేసి త్ర్యంబకరావును సంహరించెను ఈసంగతివిని త్ర్యంబకరావు తమ్ముఁడు యశవంతరావు "బాజీరావును సంహరించిగాని నాయన్నకు అపరక్రియలు చేయ" నని శపథము తాల్చెను. అంతట ఉమాబాయిగూడ యుద్ధసన్నద్ధురాలయ్యెను.

ఇది తెలియుటతోడనే బాజీరావు భయభ్రాంతుఁడై మాధ్యస్థ్యము చేసి రక్షింపవలసిన దని శాహుమహారాజును బ్రార్థించెను. అప్పుడు ఉమాబాయి తళేగాము అను గ్రామమున నుండెను. శాహు, బాజీరావు నక్కడకుఁ గొనిపోయి

ఆతనిని ఉమాబాయి పాదములమీందం బడవేసి "శూరనారీ శిరోమణీ, కోపము చాలింపుము. బాలాజీవిశ్వనాథుండును, నీభర్తయు అన్నదమ్ములవలె మెలంగిరి. అగుట నీబాజీరావు నీకు పుత్రసమానుండు. ఇంక మాఱుపలుకక నాండు. ఈతనికి ప్రాణభిక్ష నొసంగి రక్షింపుము" అని చెప్పెను.

ఆ మాటలు వినంగనే ఆమె హృదయము కలంచిన ట్లయ్యెను. చూచుచుండంగా నామె పెదవులు కంపితములు కాసాగెను. కన్నులు ఎఱ్ఱంబడి జ్యోతులవలె వెలింగెను. ఆమె యప్పటి రూపమును జూచి శాహూకూడ గడగడలాడెను; గాని ఇనుపతీంగె నుండి భూమిలోని విద్యుత్తు ఆకసమునం గలిసిపోయినట్లు ఆమె కోప మంతయు కన్నులనుండి బహిర్గతమై విద్యుత్తులోం గలిసిపోయెను. మనస్సు నిర్మలమయ్యెను అందు దయారసము పొంగి కెరటములు వేయుచుండంగా ఉమాబాయి బాజీరావు నాదరముతో లేవనెత్తి "అభయ మిచ్చితి" నని పలికెను. ఆగంభీరవాక్యము శాహూనకు ధైర్యము గలిగించెను. బాజీరావునకుం బ్రాణములు వోసెను. అక్కడ నున్నవారికి ఆశ్చర్యము గలిగించెను. అంతట శాహూ యశవంతరావు దెసం జూడంగా "మాతృశ్రీగారి యాజ్ఞకు బద్ధుండను" అని యాతండు పలికెను.

భారతరమణీ, స్త్రీప్రపంచమున కంతకును నీవు నాయకురాలవు. అయిననేమి ఫలము? నీకు ఈసంగతియే తెలియదు. నీయౌదాసీన్యమువలన నీసింహాసనము బురదపట్టియున్నది. పురుషుండు నిన్ను క్రిందికి ఈడ్చివేసినాండు: గాని యాపరాభవము నీ వెఱుంగవు. స్వార్థపరుండగు పురుషునకు దాసివై పో

యితివి. ఈదాస్యము ప్రణయమూలము గాదు; గావుననే నీకు మఱల నౌన్నత్యము గలుగలేదు. నీయధికారములను నీకుదెలుపు పురుషులు చాల నరుదుగ నున్నారు. అయినను నీకు బలము ఇంకను చాలకున్నది. నీయధికారమును నీకు వివరించుపురుషులు కొందఱు విజాతీయసాంప్రదాయములను నీనెత్తిమీఁదఁ రుద్దుచున్నారు. నీమాటలు కొంతవఱకు మాఱిపోయినవి. నీమనస్సు కొంచెము మాఱినది. నీలక్ష్యముగూడ మాఱుచున్నది. ఈక్రొత్తమార్గమున నీవు విజయము బడయఁజాలవు. అయ్యో, నీదేశమునకును, నీజాతికిని, అనురూపముకాని మార్గమునఁబోయి అసాధారణ మగు అధఃపతనము నభిలషించెదవా? వలదు. స్వప్రయత్నమే అభివృద్ధికిఁ బ్రథమసోపాయము. స్వీయసాంప్రదాయమే అభివృద్ధికి మూలము. మఱల అనసూయవై, సతివై, సావిత్రివై, సీతవై, ద్రౌపదివై, మమ్ముద్ధరింపుము. మహిషాసురమర్దనివై, భారతజాతిని నిష్కంటకము సేయుము. మఱల ప్రపంచమున కంతకును భారతజాతీయధర్మమును ప్రపంచాధిపత్యమునకుఁ బ్రతిష్ఠింపుము.

పిదపఁ గొన్నిదినములు జరిగిపోయెను. ఒకనాఁడు శాహుమహారాజ "అహమదాబాదు శాణాను గెలిచిరండు" అని యామె పుత్రులకు ఆజ్ఞాపించెను. వారు ఆనందముతో నందులకుఁ బ్రయాణమైరి. తన పుత్రులు బాలురు. సాహాయ్యమవసర మని ఉమాబాయి తానే వారికి సాయముగా బయలుదేఱెను.

"నమాతుః పరదైవత" మ్మని భారతీయుల సిద్ధాంతము. దీనికి ఎక్కడను పూర్వపక్షము లేదని నమ్మెదము. సంపత్తుల

వు, కుంకుమ, గాజులు ఎదుట నుంచుకొని సరదారుల సందఱి నొకచోఁ జేర్చి "జోరావరఖాన్ గర్వ మడఁచి, అహమ్మదాబాదులో నేను వి స్తరి వేయుటకు శపథము దాల్చితిని. మీ రేమి చేసెదరు? ఇంతకు మున్ను ఎప్పుడును మీరు ఓటమి యెఱుఁగరు. వెనుదీసియు నెఱుఁగరు. ఖానునకు తగిన సమాధానము చెప్పుదరా? అట్లు చేయలేనివారు ఈగాజులు తొడిగించుకొని ఈపసపు పూసికొని ఈకుంకుమ బొట్టు పెట్టుకొని అంతఃపురములకుఁ బొండు." అని యుపన్యసించెను. "మేము శత్రుకాంతల గాజులు పగులఁగొట్టించుటకే పుట్టితిమి. మఱి యొకటి చేయము" అని సరదార్లు అందులకు బదులు చెప్పి యుద్ధసన్నద్ధులైరి.

రాణి కుమారులిద్దఱితోడను ఏనుఁగుమీఁద నెక్కి వచ్చి క త్తి కలిపెను. కొంతతడవు అయిన తరువాత ఆమె బోధింపఁగా నామెసైనికులు పీనుఁగులను కోటగోడవద్ద పేర్చి ఆగుట్టలమీఁదినుండి గోడ లెక్కి క్షణములో కోట స్వాధీనము చేసికొనిరి. జోరావరఖాన్ అయిపులేకుండఁ బాఱిపోయెను. అంతట ఉమాబాయి శుద్ధిపుణ్యాహవాచనము చేయించి నాఁడు కోటయందే భుజించెను.

# 13. మల్లమదేవి.

రావు గోపాలకృష్ణరంగారావు బొబ్బిలిసంస్థానమును బరిపాలించుచుండెను. పూసపాటి విజయరామరాజు విజయనగరసంస్థానమును బరిపాలించుచుండెను. కాలక్రమమున ఈరాజుల కిరువురకును అంతఃకలహములు ప్రబలెను. విజయరామరాజు పగదీర్చుకొనుటకు వేచియుండెను.

ఇంతలో హైదరాబాదునుండి బుస్సీ యను పరాసు సరదారుఁడు హైదరుజంగు అను నొక తురుష్కునితోఁగూడి జమీందారులనుండి సిస్తు వసూలుచేసికొనుటకు ఉత్తరసర్కారులకు వచ్చెను. క్రూరమో, సౌమ్యమో, న్యాయ్యమో, అన్యాయ్యమో, వాని ప్రవర్తనము రాజమహేంద్రవరమున మకాము చేయునంతదనుక చరిత్రకారుల విమర్శకు అవకాశమీయలేదు. ఆతఁడు కోటిలింగక్షేత్రమున విడిసెను. జమీందారుల కందఱకును తాఖీదులు వెళ్లెను.

జమీందారులందఱును వచ్చిరి. నవలక్షకళింగాధినాథుఁడగు విజయరామరాజుగూడ సపరివారుఁడై వచ్చెను; గాని బొబ్బిలివారు రాలేదు. తాను బయలుదేఱుటకు ముందు విజయరామరాజు వారితో రాయబారములు జరిపెను మంచి ఫలితము గలుగలేదు. రావువారు రాయబారమును తిరస్కరించిరి. విజయరామరాజునకు మంచి యవకాశము లభించెను.

"జమీందారులందఱును దర్శనము చేసిరి; గాని రావువారు కానిపింపకుండుట కేమి హేతువు?" అని బుస్సీ ఆలో

చన ప్రారంభించెను. ఈసమయమునందే రాజు హైదరును బుట్టలోఁ బెట్టెను. "ఉత్తరసర్కారు లందెల్ల బొబ్బిలిదొరలు విక్రమసింహము లని ప్రసిద్ధి. ఈప్రసిద్ధి వారిని మన తాఖీదు నెడల లక్ష్యముచేయకుండఁజేసినది. విజయనగరమురాజు మన యాజ్ఞను కన్నుల నద్దుకొనెను. బొబ్బిలిరాజు ఎడమకాలితోఁ దన్నెను." అని హైదరు బుస్సీకిఁ జెప్పెను. "ఏమి రాజా!" యని బుస్సీ యడుగఁగా రాజు "ఇందు నేను చెప్పవలసిన దేమి ఉన్నది? నేను స్వయముగ వార్త నంపితిని. నారాయబారిని వారు అగౌరవపఱచిరి. నిజమునకు వారు విక్రమసింహులే. సందేహము లేదు. "చావో, బ్రతుకో, ఇంతకు తప్ప వారికినీతి తెలియదు" అని రాజు ప్రత్యుత్తర మిచ్చెను. "ఒక చిన్న పాళెగాఁడు మన యాజ్ఞలను జవదాఁటెను. ఇది మొదలు మనము పోవు ప్రదేశమంతయు జమీాందారులతో నిండియు న్నది. ఊరి కొక జమీాందారు, వీధి కొక పాళెగాఁడునుగా నున్నారు. బొబ్బిలివారినిఁజూచి వారందఱును బిఱ్ఱబిగిసెదరు. ఇది కొంచెము యోచింపఁదగిన విషయమే" యని హైదరు రాజు మాటలకు ప్రాణము వోసెను. "తమరు అక్కడకుఁ బోయి యడిగినను దస్తు వసూలగుట కష్టము. ఈప్రాంతముల యందెల్ల బొబ్బిలి మాత్రమే తలబిరుసు గలది" అని రాజు ఇంక నేమో చెప్పఁబోవునంతలో హైదరు మాకంత చేత గాదా యేమి? మాకు పౌరుషము లేదా? ఒక పాళెగాఁడు అంత పెంకెతనము చూపిన మేము ఏమి చేయఁగూడదు?" అని బుస్సీదెసకుఁ జూచుచుఁ బలికెను. దానిమీాఁద బుస్సీ "ఇంకను ముందునకుఁ బోవుటలో వారిసంగతి కనిపెట్టుదము.

చెను. కట్టకడపట వచ్చిన రాయబారులకు ఆతఁడు "మీరు బొబ్బిలి విడిచిపొండు. మీబొబ్బిలిని విజయరామరాజున కిచ్చెదము. మీరు ఆజ్ఞానువర్తు లగుదురేని మఱియొక పరగణా యెచ్చెద" మని చెప్పెను. దీనిమీఁద వెలమవారు యుద్ధము చేయుటకు నిశ్చయించుకొనిరి "కేవలము తిరుగుబాటు తప్ప మఱియేమియు లేదు. మనము ప్రభువుల మైనను పెద్ద సైన్యముతో వచ్చినను వారికి లెక్క లేకుండనుండెను. ఇట్టి దుర్బుద్ధి లేకున్నచో వారు మొదటనే మన దర్శనమునకు వచ్చి యుందు" రని బుస్సీయు హైదరును కూడఁబలుకుకొని యుద్ధమును నిశ్చయించిరి. రాజు పరమానందభరితుఁ డయ్యెను.

తుదకు బుస్సి బొబ్బిలికోటను ముట్టడించెను. అప్పుడు కూడ రంగారావు "విజయరామరాజు మాప్రబలవిరోధి. ఆతని మాటలను నమ్మి మాకోట ముట్టడించుట న్యాయ్యము గాదు. మేము తిరుగుబాటును అన్యాయ్యమును ఎఱుఁగము. కేవల నిర్దోషులను ఏదో యాధారమున బాధింపఁబూనుట మీవంటి సరదారులకు పౌరుషము గాదు. మాకు మర్యాదయే గాని ధనప్రాణములు ప్రధానములు గావు. మీసెలవునకు బద్ధులము. బొబ్బిలికోట విడువు మనిన మాకభ్యంతర ముండదు; గాని దానిని మావిరోధి కిచ్చెద మనిన అట్లు మీరు సెల వీయఁగూడదు. మేము అంగీకరింపఁజాలము." అని రాయబారములు నడిపెను. "అతివినయము ధూర్తలక్షణ మనుట కింతకంటె నేమి యుదాహరణము కావలెను? ఎంతసేపును నేను మీయనుగ్రహమునకు పాత్రుఁడ నైతి ననియే వారికి కడుపుబ్బు. ఎన్ని చెప్పినను మీరు కొండెములు వినుచున్నా

రనియు,అన్యాయ్యమున కొడిగట్టుచున్నా రనియు, తమది న్యా యపక్ష మనియునే గోల నామీఁద మాకు ఆగ్రహము కలి గించుటకు రంగారావు ఇన్నిపాటులు బడుచున్నాఁడు. ఇందు మీకు తెలియనిది ఏమున్నది?" అని రాజు చెప్పఁగా హైదరు "వ్యాఖ్యానము అవసరము లేకయే రంగారావు మాటల యాంతర్యమును మీరు గ్రహింపఁగలరు. ఎంత సేపును వెల మలు మనలను వంచించి తాటాకులు కట్టుటకు ప్రయత్నించు చున్నారు. రాయబారు లనుపేరుతో తన నౌకరులను బంపి మన యింటి యందే రంగారావు మనలను తూలనాడించుచు న్నాఁడు. విజయరామరావు తనకు విరోధి యగుట నిజమే కా వచ్చును. ఆతఁడు తనమీఁద మనవద్ద తాసికలు చెప్పునే య నుకొందము. అదియే నిజ మగునో తాను వచ్చి సందర్భము లన్నియు మనకు మనవిచేసికోరాదా? శత్రుత్వమును బురస్క రించుకొని వారు ఒండొరులను గౌరవింపకున్నచో మన మేమి చేయుదుము? మనకు వారు ఉభయులును సమానులే యైన పుడు ఒకరికి మర్యాదయు, ఒకరికి అమర్యాదయు చేయుటకు మనకేమి యవసరము వచ్చినది? "మీకు మావద్ద మర్యాదలు జరుగ వని భీతి" యను వెలమదొర మాటలకు మనకు మర్యా ద తెలియ దని యర్థము కాదా? తిరుగుబాటు అనిన నింతకం టె నిఁక నేమి? పెంకెతనమున కింతకంటె నేమి సాదృశ్యము కావలెను?' అని అందించెను. బుస్సీకి తిక్క తల కెక్కెను. వెల మవారి రాయబారమున లెక్కను, అవినయమును, రాజు మాటలయందు భయభక్తులును, హైదరువ్యాఖ్యానమున తత్త్వవిమర్శయు నాతనికిఁ దోఁచెను. కోట ముట్టడించినవానికి

ఇట్టి నిశ్చయము కలిగినపుడు ఇఁక చెప్పవలసిన దేమున్నది? "ఇఁక రాయబారములతోఁ బని లేదు. ముందు నౌబత్తు మాన్పింపుము" అని బుస్సీ కబురుచేయఁగా "మీరు కేవల మక్రమమునకుఁబడి కట్టినారు. నౌబత్తుమాకుకులక్రమాగతముగ వచ్చుచున్న బిరుదము. దానిని మాన్పింపు మనుటకన్న మాకు అమర్యాద లేదు. మా గౌరవములను మీరు పాటింపనపుడు మీ గౌరవములను మేము ఏల పాటింపవలెను? నిజముగ మీరుకప్పము వసూలుచేసికొనిపోవుటకురా లేదు. బాహుబలమునుజూపించుటకే వచ్చినారు. కావున మీరు నిశ్చయించుకొనినదే కానిండు. మేము నౌబత్తు మానము. కోట విడిచిపోము." అని అంత్యసందేశము నంపి రంగారావు వెలమలనుహెచ్చరించెను. రావువారి నౌబత్తునకు నిజాము భేరీ బదులు పలుకఁగా నిజాము ఫిరంగికి రావువారి శతఘ్ని జవాబు ఇచ్చెను.

పోరు ఘోరమయ్యెను. ఈయుద్ధములో వెలమలమొక్కవోని పౌరుషము, పిఱుదివియనిశౌర్యము, ప్రాణములమీఁది నిరాశ, శరీరములమీఁది నిర్లక్ష్యము, శత్రువులయెడలఁగల నిరసనము, అన్నమాట నిలుపుకొనుటయందలి పట్టుదల, పూర్తిగ వెల్లడి యయ్యెను. ఎంత చేసినను కోరుకొనిజయము దూరమునకే పోయెను. ఇఁక అపజయము గడియలలో నున్న దని తోఁచినపుడు రంగారావు కటారి నిచ్చి చెలికాని వేంకయ్య నంతఃపురమునకుఁ బంపెను.

చెలికాని వేంకయ్యశౌర్యము చరిత్రలయందును, జనులు చెప్పుకొను బొబ్బిలికథయందును అనంతమై యున్నది. అతఁడు యుద్ధరంగమున వీరాధివీరుఁడే; గాని యిప్పుడు కటికి

8

వాండ్రలో గోవధచేయువానికంటెను అధికుఁడు. రాజాజ్ఞచే నాతఁడు ఎదురు లేని యంతఃపురమున ప్రతాపము నెఱపు టకు వచ్చెను. ఆతనిం గాంచినతోడనే రాణివాసపు జనమం తయు వివర్ణ మయ్యెను. రాణి యగు మల్లమమాత్రము జంకు లేక కూర్చుండియే యుండి "వేంకయ్యా, వచ్చితివా? నీపని గానిమ్ము" అని సెలవిచ్చెను. "వ్యవధి లేదు. నావిధి నెఱవేర్పఁ బడినట్లు ప్రభువునకు వినిపించుటకు నాకు అవకాశము దయ చేయవలెను" అని విన్నవించి యాతఁడు గదిగదికినిఁ బోయి పీనుఁగులను లెక్కబెట్టుకొనుచు వచ్చెను.

తోడనే మల్లమ దాసి వేంకటలక్ష్మినిఁ బిలిచి కుమా రునిఁ జేరదీసికొని ముద్దాడి "నాయనా, ఇదియే కడసారము. మల్లమకడుపునఁ బుట్టుట కెంత తపముచేసితివో; గాని యేమి యనుభవించితివి! రెక్కలు రాకపూర్వమే దిక్కు లేనివాఁడ వైతివి. రావువారియింటఁ బుట్టినవారిలో దిక్కు లేకుండఁబో యినవారిలో నీవే ప్రథముఁడవు. నీకు దీర్ఘాయుర్దాయ మున్న చో రావువంశమున నిట్టి నికృష్టస్థితి నందినవారిలో కడపటి వాఁడవుగూడ నీవే యగుదువుగాక. నీ తల్లి జగ్గమ్మ; గాని మల్లమ్మ గాదు. నీతండ్రి అన్యాయ మెఱుఁగఁడేని నీకు చీమ యైనఁ గుట్టదు. నేను రావువంశమునకు దీపమ వైతివేని నీవు శత్రువంశములు భస్మపటలము సేయుదువు. పొమ్ము. నిన్ను పంచభూతములు, సూర్యచంద్రులు, భూదేవితల్లి, బ్రహ్మ, మహే శ్వరుఁడు, ఆదినారాయణమూర్తి రక్షింతురుగాక" అని మఱి యొకమాఱు ముద్దాడి "నీవు సకలము నెఱిఁగినదానవు. నా నాయనను నీవు రక్షింతువేని నిన్ను నానాయన రక్షించును

నీవు ఈతనిని చామర్లకోట చేర్చెదవేని నిన్ను ఈతఁడు ఆనంద ధామము సేర్చును. పో. ఇఁక నాయెదుట నిలువకు" అని దోసెఁడు వరహాలును బాలుని ఇచ్చి పంపివేసెను. దాసి వెనుకకుఁ దిరిగితిరిగి చూచుచుఁ బోయినంతనే అపూర్వవ్యాధశిఖామణి యగు చెలికాని వేంకయ్య వచ్చెను.

అప్పుడు మల్లమ "వేంకయ్యా, పనియంతయుఁ దీఱె నదా? లేదు. ఈరవంతయు మిగిలినది. రంగారావుదొరగారికి నీవు కుడిభుజమవు. వారికి పాపయ్య ఒక యెత్తు నీవొక యెత్తు. వెలమవీరు లెట్లున్నారు? నలువదివేలసైన్యములో నాలుగు వందల వీరులు. ఏమి చెప్పవచ్చును? మునిఁగిపోవుటకైనఁ జాలరు. కానిమ్ము. వెలమ లొకరికి లొంగరు. ఇంతకంటె నేమి కావలయును? నీవు రాజదర్శనమునకు త్వరపడుచున్నావా? ఇదిగో పంపితిని" అని యాతనిచేతికటారి నూడఁ బెఱుకుకొని "నారాయణమూర్తీ, నీకుఁ దెలియనిది లేదు. వెలమల హృదయము నీకు నివాసమే. క్షత్రియునిమనమున నెంత కుళ్లు ఉన్నదో నీకుఁ దెలియనిదా? మల్లమపవిత్రురాలేని క్షత్రియుఁడు నేఁటికి మూఁడవనాఁడు దిక్కులేనిచావు చచ్చును గాక" అని మూఁడుమాఱులు తూర్పుగాఁ దిరిగి దుమ్మెత్తిపోసి "శ్రీహరీ," యని కటారి విసరికొని ప్రాణములు విడిచెను.

ఇఁక పైసంగతి కిచ్చటఁ బ్రసక్తి లేదు. బొబ్బిలి కంతకును మల్లమయే ప్రాణము; గాని ఆమె శౌర్యము కానఁగాచిన వెన్నెల యైపోయినది. స్త్రీలు పరులకంటెఁ బడఁగూడ దనుట వెలమలలోఁగల దురాచారముల కెల్లఁ దలమానికము. భారత సంఘమున స్త్రీలను అంతఃపురములయందు బంధించివేయు

వర్ణములవారు, భారతాంగనల స్త్రీత్వమునే శంకించి రనుట బహిరంగరహస్యము. భారతరమణి యిట్టి నికృష్టస్థితికి వచ్చినపుడు ఇఁక భారతీయుల యాధిక్య మెట్లు నిలుచునని భారతసంఘమునకు ఘోషాపద్ధతివలనఁ దగిలినంత దెబ్బ మఱిదేనివలనను దగులలేదు. ఉత్తరభారతదేశమునఁగూడ ఘోషాపద్ధతికి లోపము లేదు; గాని అచ్చటి అంతఃపురస్త్రీలు మేలిముసుఁగులు ధరించి అవసరమైనపుడు బైటికి వచ్చెదరు. ఆంధ్రదేశమున ఇది కేవలము సహింపరాని స్థితిలో నున్నది. ఆంధ్రదేశమునందలి ఘోషాస్త్రీలు గదిలో గూడ మేలిముసుఁగు ధరించియే యుండవలయునేమో మాకుఁ దెలియదు; గాని వారు గుమ్మము దాఁటి ఇవ్వలకు రాఁగూడదనుట పిల్లలకుఁగూడఁ దెలిసినదే.

మల్లమవంటి శూరనారి ఇట్టి నికృష్టమరణముపాలుగాక రుద్రమదేవి, వీరాబాయి, తారాబాయి, దుర్గావతి మున్నగు వీరాంగనలవలె కత్తిచేఁబూని యుద్ధరంగమున కుఱికినచో బొబ్బిలికి ఇంక నెంతకీర్తి వచ్చునో ఇప్పుడు ఎవరు ఊహింపఁగలరు? కాని ఏమియుఁ బ్రయోజనము లేదు. మల్లమ యొక్కతయే గాక నాఁడు బొబ్బిలికోటలో మల్లమవంటి స్త్రీలు ఇంకనెంద ఱిట్టి మరణము పాలైరో చెప్పఁజాలము. పేరు లేకుండఁబోయినవారిని గుఱించి యేమి చెప్పుటకును అవకాశము లేదన్నందులకును అట్టి మల్లమ్మచరిత్రము ఇట్లు నిష్ఫలముగా ముగించుటకును మాకు జాల విచారముగా నున్నది.

---




# 14. ఖడ్గతిక్కన భార్య.

ఖడ్గతిక్కన మనుమసిద్ధిరాజువద్ద సర్వసేనాధిపతి. ఆతఁడు బుద్ధియందు బృహస్పతియు, బాహుబలమున పరశురాముఁడునై యుండెను.

యాదవులకు కాటమరాజు ప్రభువు. ఆతఁడు ధర్మము తప్పకుండ దేశము నేలుచుండెను. అయినను ఒకప్పుడు అనావృష్టిదోషము తటస్థించెను. పచ్చికబయళ్లన్నియు నెండిపోవుటచే యాదవు లందఱును సిద్ధిరాజు దేశమునఁ జొచ్చి తొలకరించువఱకును పశువులను చక్కఁగ మేపుకొనిరి. పుల్లరి వచ్చునని సిద్ధిరాజు అంగీకరించెను; గాని యాదవులు పుల్లరి నెగబెట్టి పశువులం దోడ్కొని స్వస్థలమునకుఁ బోయిరి.

ఒక దేశములోని పశువు లన్నియు నొక దేశములో మేయుట సరిగ వసూలు చేసినను, సరిగ ఇచ్చినను ఎంత పుల్లరి వచ్చును? కాని ఇఁక నిపుడు కర్తవ్య మేమి?

ఇప్పు డిది యయ్యెను. రేపు మఱియొకటి యగును. ఒకమాఱు లోకువ అయినచో మఱల లాభము లేదు. యాదవులేమో పెంకెపని చేసినారు. శిక్షింపవలెను. పుల్లరి పుచ్చుకోవలెను. పయిగా నేతత్ప్రయత్నమున కయినఖర్చులు పుచ్చుకోవలెను.

ఈయుద్దేశములతో గొప్ప సైన్యమును వెంట నిడుకొని సిద్ధిరాజు యుద్ధమునకు తరలెను. తిరునామాల తిప్పరాజు, శ్రీకంఠరాజు, పెదవేఁగిచొక్కరాజు, పెదవరదరాజు, అర్లు

కొండ అచ్చిరాజు, ఆదివన్నె మాదిరాజు, గయికొండ గంగ రాజు, ఉర్లకొండ సోమన్న, ఉదయాద్రి ఉప్పయ్య, చెన్నపట్ట ణము చంద్రశేఖరుఁడు, దేవముని వెంగళయ్య, పట్టుకోట బస వరాజు, కాళహస్తి పాపతిమ్మరాజు, వెలకంచి వెంగళపతి రాజు, ప్రభగిరిపట్టణము పద్మశేఖరుఁడు, మొదలగు యోధులు సిద్ధిరాజునకు సాహాయ్యముగా వచ్చిరి. ఖడ్గతిక్కన అందఱ కును మొనగాఁడై యుండెను.

ఇది చూచి కాటమరాజుగూడ యుద్ధసన్నద్ధుఁ డయ్యె ను. పల్నాటిప్రభు వయిన పద్మనాయఁడు, పల్లికొండ ప్రభు వయిన చల్లపిన్నమనాయఁడు, దొనకొండ అయితమరాజు, ఎఱ్ఱయ్య, భట్టావులరాజు, కరియావుల రాజు, నల్లభన్న, నాచ కూళ్లనాయఁడు, నేతిముద్దయ్యనాయఁడు, పాచయ్యనాయఁడు, ముప్పయ్యనాయఁడు, పుత్తమరాజు మున్నగు యాదవవీరులు కాటమరాజునకు బాసటయై నిలిచిరి. లింగధారి బ్రాహ్మణుఁ డగు బ్రహ్మరుద్రయ్య అందఱకును నాయకుఁడై యుండెను.

అటు వారు వచ్చిరి. ఇట వీరు కదలిరి. ఇరువాగులవా రును పాలేటియొడ్డున పంచలింగాలకొండక్రింద తలపడిరి.

"మీరుండుఁడు యాదవులను సవరించి వచ్చెదను" అని తిక్కన్న యొక్కఁడే సైనికులను వెంట నిడుకొని యుద్ధరంగ మునకుఁ బోయెను. పిన్నమనాయఁడు మున్నగువారు సైన్య ములను నడుపుకొనివచ్చి తిక్కన్నను తాఁకిరి. ఉభయవాహి నులయందు ననేకులు గతించువఱకును పోరు ఘోరముగ జరి గెను. క్రమక్రమముగ ఎదిరిబలముకంటె తనబలము సన్నగి ల్లుచుండుటచే తిక్కనకు ధైర్యము చెదరిపోయెను. అయినను

ఆతఁడు యుద్ధము మానలేదు. ఈసంగతి గ్రహించి పిన్నమ నాయఁడు ఎదురుగ నిలిచి "బ్రాహ్మణోత్తముఁడా, పోరు చాలిం పుము. మీరు బ్రాహ్మణులు. మేము యాదవులము. మీతో పోరుట మాకు ధర్మము గాదు. మామీఁద కోపము పూనుట మీకు ధర్మము గాదు." అని పలికెను.

స్వబలక్షయము, ఆమీఁద పగతుని సోత్ప్రాసము. అయినను తిక్కనకు పౌరుషము వచ్చుటకు బదులు అధైర్యము పెరిగిపోయెను. అంతట వెంటనే యాతఁడు గుఱ్ఱమును మఱ లించుకొని బసకు వచ్చెను.

వీథులలో పౌరు లెల్లరు నాతనిం జూచి హేళనము ప్రారంభించిరి. కొన్ని యెకసక్కెపుమాట లాతనిచెవులయందే పడెను. అయినను ఆతఁడు ఇంక నేమియుఁ జేయుటకు లేక ఇల్లు చేరికొనియెను.

గుఱ్ఱము దిగి యింటిలోనికి వచ్చునప్పటికి సకలోపచా రములును జేయు భార్య నేఁడు చూచియుఁ జూడనట్లు చూచి మఱియొక పనిమీఁద బోయెను. "నాయనా, వచ్చితివటోయీ" యని ప్రేమతో బుజ్జగించు తల్లి చూడకయే పోయెను. "అ బ్బాయీ, మంచి పని చేసితి" వని ప్రశంసించు తండ్రి "భూమి మీఁద మగవాఁడై పుట్టగానే సంబరమా? మగతనము లేని వాఁడు ఆఁడుదానికంటెను అధముఁడు. నపుంసకునికంటెను లోచ్చు" అని యీసడించిపలికెను. తుదకు దుస్తు లందుకొను టకు నౌకరులుగూడ హాజరు లేకపోయిరి.

తిక్కఁడు అంతయుఁ జూచి "స్వయంకృతాపరాధ" మనుకొనియెను. ఏమియు ననలేదు. భావరహితములగు దృష్టి

లను బఱపుచు నాతఁడు కుర్చీమీఁద కూర్చుండియుండఁగా లోపలనుండి యెవరో "స్నానమునకు లేవవచ్చును" అని సన్నాయినొక్కువలె పలికిరి. వెంటనే యాతఁడు స్నానమునకు నిర్దిష్టమైన స్థలమునకుఁ బోయి చూడఁగా నక్కడ నొక నులక మంచము, దాని వెనుక నీళ్లబిందె, దానిమీఁద పసుపుముద్దయు నుండెను. తిక్కని తలతిరిగెను. ప్రారంభమున కోపము వచ్చెను; గాని దాని ప్రథమవేగము మొగమును చిట్లింపఁజేయుటతో నది మునిఁగిపోయెను. "ఇది యేమి" యని యాతఁడప్రయత్నముగ అడుగఁగా, భార్య:—

క. "పగఱకు వెన్నిచ్చినచో, నగరే నిను మగతనంపు నాయకు లెందుఱ్
ముగురాఁడువార మైతిమి, వగ పేటికి జలక మాడవచ్చినచోటఱ్."

అని పలికెను. దానితో బీటలు తీసిన తిక్కనిహృదయమున బల్లెము గ్రుచ్చిన ట్లయ్యెను.

ఏమి చేయవచ్చును? చేసినది బుద్ధితక్కువపని. ఇప్పుడేమి చేసినను అట్టిదే యగును. అగుటచే మాట్లాడకుండ నాతఁడు భోజనశాలకుఁ బోయెను. తల్లి వడ్డించియుండెను. తిక్కన్న మాఱడుగక విస్తరిలో నున్న దేమో తినుచుండఁగా తల్లి చివరకు మజ్జిగ వడ్డించెను. అది మునుపటివలె గాక విరిగిపోయియుండెను. "ఏమమ్మా! మజ్జిగ విఱిగిపోయినది?" యని తిక్కన్న తల్లి నడిగెను. తోడనే యామె సంకోచము లేక:—

క. "అసదృశముగ నరివీరుల, బసమీఱఁగ గెలువలేక పందక్రియఱ్ నీ
వసివైచి విఱిగివచ్చిన, పసులఱ్ విఱిగినవి తిక్క పాలుఱ్ విఱిగెఱ్."

అని బదులు చెప్పెను.

చేసికొనిన భార్య యట్లు చెప్పెను. కన్నతల్లి యిట్లు చెప్పెను. మగవానికి ఈరెండు వ్యక్తులును ఇట్లయినపుడు ఇఁక ఆధార మేమి యున్నది? శిక్షించి మంచిదారికి తేవచ్చు ననిన తప్పు వారిది గాదు. శీలముగలస్త్రీకి మగఁడు పిఱికివాఁ డగుటకంటె సిగ్గులచేటు లేదు. కొడుకు పలాయితుఁ డగుట కంటె కడుపుమంట లేదు. "నేను చేసిన పనికి లోక మంతయు అసహ్యము చూపుచున్నది" అని తలఁచి తిక్కన వెంటనే గుఱ్ఱము నెక్కి యుద్ధరంగమునకుఁ బోయెను.

ఈమాటుతిక్కన ప్రవృత్తి యంతయు మాఱిపోయెను. మొదట నాతఁడు రాజునకు జయముగూర్చి ప్రశంసల నంద నగె నని నిశ్చయించుకొనియెను; గాని యిప్పు డట్లు తలఁచుట లేదు. రాజునకు జయము గలిగిన కలుగును. లేకున్న లేదు. తనకుఁ గలిగిన అపకీర్తినిఁ బాపుకొనవలెను. ఆతఁడు ముందు ప్రాణములకు తెగించెను. ఈదీక్షలో ఎందఱ ప్రాణములు పోవునో.

మఱల పోరు ఘోర మయ్యెను. రక్తనదులలో పీనుఁగు గుట్టలు కొట్టుకొనిపోయెను. యాదవు లనేకులు సమసిరి. అది చూచి పిన్నమనాయఁడు "బ్రాహ్మణోత్తమా, యుద్ధము చేయుట బ్రాహ్మణునకు ధర్మము గాదు. జయాశతో ముందున కుఱికిన తరువాత నేమగునో చెప్పఁజాలను; గాని బ్రహ్మహత్యాదోషము సంభవించుటకు అవకాశముగల నీతోడి పోరాటమునకు నాకు సాహసము గలుగుట లేదు" అని పలుకఁగా తిక్కఁడు "కట్టిపెట్టుము.ధర్మోపన్యాసము. నీచేతిలో కత్తిలేదా? నీమూతిమీఁద నున్నది మీసముగాదా? శస్త్రమును గైకొన

వలసిన నాయఁడవు నీవు బ్రాహ్మణునితో శాస్త్రార్థమునకు బూను చున్నావా? అది విడిచినను ఇది చేపట్టినను నీవు పనికి రావు. పనికిరానిమాటలు చెల్లవు. తొడచఱిచి ముందునకు రమ్ము. లేకున్న వెన్నిచ్చిపొమ్ము" అని దృఢముగాఁ బలికెను; గాని పిన్నమనాయనికి తిక్కనిమీఁద నుఱుకుటకు మనస్సు అంగీకరింపలేదు.

ఇది చూచి "నీవుండుము" అని కాటమరాజు సర్వసేనాధిపతి యగు బ్రహ్మరుద్రయ ముందునకు వచ్చెను. పిన్నమ నాయఁడు "సరియైన యుజ్జీ"యనియెను. అటు నిటు గూడ క్షాత్రమిళితమైన బ్రాహ్మ్యము. ఉభయత్ర రాజరక్షణమే యుద్దేశము. స్వార్థమేమియు లేదు.

గుఱ్ఱపుసకిలింపులును, కత్తుల మిలమిలలును అయినతరువాత ఇరువురునుగూడ "హరహరా" యని కత్తియుఁ గత్తియుఁ గలిపిరి. నాయఁడు "దూరమున నుండుఁడు. రెండగ్నిహోత్రములు పోరుచున్నవి. కన్నులుగలవారెల్లరును జూడవచ్చును" అని పలుకఁగా ముందు మూఁగియున్న యిరువాగుల భటులునుగూడ ఓసరిల్లిరి.

ఏమి చెప్పుదుము? ఈబ్రాహ్మణోత్తముల ద్వంద్వయుద్ధమును సవిస్తరముగ వర్ణించి యాత్మస్తుతిపరాయణుల మనిపించుకొనుట మాకిష్టము లేదు. ప్రకృతము లోకముయొక్క స్థితిమేమియు బాగుగ లేదు.

గుఱ్ఱములకు తగిన రౌతులు. రౌతులకు తగిన గుఱ్ఱములు తనకును, రౌతునకును దెబ్బలు తగులకుండ ఈగుఱ్ఱము సంచరించిన. తనకును రౌతునకును ఒకటి రెండు దెబ్బలు తగిలి

నను ఎదుటి రౌతు అధవా గుఱ్ఱము కూలవలెనని యాగు
ఱ్ఱము సంచరింపసాగెను. కత్తియుఁ గత్తియు రాపాడుటయే
గాని ఒకరికత్తికి ఒకరిశరీర మందలేదు.

ఇట్లు కొంతసేపు అయిన తరువాత ఇరువురదృష్టులును
గుఱ్ఱముల మీఁదఁ బడెను. ఇట్టి ప్రసంగములలో శాంతవృత్తి
యగు బ్రాహ్మణునకు ప్రసక్తి కలుగుటయే కష్టము; గాని కలి
గినచో నక్కడ నిఁక బ్రాహ్మణుఁడు ఆలస్యమునకు ఓర్వఁడు.
బ్రహ్మరుద్రయ్యగుఱ్ఱముమీఁద తిక్కన్న కత్తి విసరెను. తిక్క
న్న గుఱ్ఱముమీఁద బ్రహ్మరుద్రయ్య కత్తి విసరెను. ఇరువురును
గూడ మఱల కత్తులు ఎత్తునప్పటికి గుఱ్ఱములు కూలఁబడెను.
అంత నిరువురును పతనాఘాతములను తప్పించుకొని ద్వంద్వ
యుద్ధమునకు తలపడిరి.

శరీరము సాపాయము, నస్థిరము నని తలఁచు నిద్దరు
బ్రాహ్మణులు ధర్మము క్షాత్రము ప్రసక్తించినది తుది కందా
యమున నున్న ద్వంద్వయుద్ధము. ఇఁక నెందుల కాలస్యము?

ఇరువురును కత్తులను విసరిరి. బ్రహ్మరుద్రయ్య "బళీ
తిక్కన్నా" యనఁగా తిక్కన్న "మేలు బ్రహ్మరుద్రయా
యనియెను. ఒకరి కత్తి నొకరు లాగుకొనుటయే తడవుగ
వురును ప్రాణములను బాసిరి. హతాశుఁడై పిన్నమనాయ
వారిని సమీపించి గద్గదికవలన నేమియు మాటలాడఁజ
అంజలిబద్ధుఁడై బాష్పధార విడిచెను.

---

# 15. అర్గళసంస్థానము రాణి.

విహారదేశమునందలి అర్గళసంస్థానమునకు ప్రభు వగు గౌతమరాజు ఢిల్లీశ్వరునకు సామంతుఁడై యుండెను. అయి నను మహితప్రతాపుఁ డగుటచే చక్రవర్తికి కప్పము కట్టుట మానుకొనియెను. అందులకుఁ జాలఁగోపించి ఢిల్లీపాదుషాహ "అర్గళసంస్థానమును ముట్టడించి రాజును పట్టవలసినది. దుర్గ మును గొట్టి బొక్కసమును స్వాధీనము చేసికొని రాజుతోఁ గూడ ఢిల్లీకి పంపవలసినది" అని అయోధ్యనవాబునకు ముదల యిచ్చెను.

సహజముగ హిందూప్రభువుమీఁదికి దండయాత్ర. అందును సార్వభౌముని యాజ్ఞ. ఇఁకఁ జెప్పవలసిన దేమున్నది? నవాబునకు ఎక్కడలేని బలమును వచ్చెను. సైనికులకెక్కడ లేని ఊహలును తట్టెను. అచిరకాలమునందే అర్గళసంస్థానపు దుర్గము తురుష్కులచే ముట్టడింపఁబడియెను.

అర్గళసంస్థానాధీశ్వరుఁడు యథార్థమున చాల స్వల్పా దాయము గలవాఁడే. చతురంగబలముగూడ నాతనికిఁ జాల స్వల్పముగనే యుండెను. అయినను పౌరుషము, శౌర్యము, ధైర్యము మున్నగునవి అట్టివారికి స్వల్పముగ నుండవలయు ననిగాని ఉండుననిగాని యెచ్చటను నియమము నిర్ధారణయు లేవు.

మేము అనేకచరిత్రములను జూచినాము. చిన్నసంస్థా నాధిపతు లనేకులు అనేకపర్యాయములు పెద్దపెద్ద చక్రవర్తు

లతో మహాయుద్ధములు చేసియున్నారు. వారికి కలిగినది జయమా అపజయమా యనునది వేయఁదగిన ప్రశ్నగాదు. మఱేమన? మానవుఁడు పని చేయవలసినదియేగాని ఫలము చూచుకొనఁగూడదు. పని చేయుటలోనే మానవుని ప్రజ్ఞగాని ఫలమును పొందుటలో లేదు. ఒకఁడు ఒక కార్యమును సాధించుటలో అమానుషప్రజ్ఞను ప్రకటించును; గాని ఫలము తేలిపోవును. మఱియొకఁడు శ్రమలేకయే గొప్పఫలమును బడయును. ఈయిరువురిలో ప్రజ్ఞాధికుఁ డెతఁ డను ప్రశ్న వచ్చునెడల ఫలమునుబట్టియా నిర్ణయించునది?.

నాలుగులక్షుల సేనగలవానిని నాలుగువేల సేనగలవాఁడు ఎదిరింపవచ్చును. జయము ఎవనిదో యొకని దగును; గాని యిరువురది గాదు. అయితే యిరువురునుగూడ శౌర్యధైర్యములను గనుపఱుపవలసినవారే యగుచున్నారు. ఈ ప్రదర్శనమున స్వల్పబలుఁడు నిగ్రహింపవచ్చును. లేకున్న నిర్జింపఁబడవచ్చును. బలహీనుని బలాధికుఁడు జయించుటలో ప్రశంస లేదు. బలాధికుని బలహీనుఁడు ముప్పుతిప్పలు పెట్టినచో వానిది ప్రతిష్ఠ. జయముగూడ వానిదేయైనచో నచ్చట మహాకవి కలము పట్టవలసినదే.

యుద్ధమునకు నియమించినవాఁడు పాదుషాహా. యుద్ధముకు వచ్చినవాఁడు నవాబు. యెదిరించినవాఁడు చిన్నరాజు. మఱియొక భేదము. వారు తురుష్కులు. ఇతఁడు భారతీయుఁడు. రాజనీతివిషయమున ఈయుభయజాతులయందునుగలవ్యత్యాసము సామాన్యమైనది గాదు.

భారతీయులు ధార్మికజీవనమువిషయమున ప్రపంచము

నం దంతట నగ్రస్థానము వహింతు రనుట ఆత్మస్తుతి గాదు. అయితే వచ్చిన విపత్తు ఏమన? వారి ధార్మికజీవనము రాజనీతిలోఁగూడ మిళిత మైనది. అగుటనే భారతీయులకు పారతంత్ర్యము. భారతీయునకు సజాతీయునితో విరోధము ప్రాసఁగి నపుడు సర్వనాశము లేదు. విజాతీయునితోఁ బ్రసక్త మైన యుద్ధములు అట్టిఫలము నొసంగవు. అయితే విజాతీయులతోఁ బ్రసక్తము లయిన సకలయుద్ధములయందును భారతీయులకు ఓటమియే సంభవింపలేదు.

యుక్తసమయమున అర్గళసంస్థానాధీశ్వరుఁడును అయోధ్యనవాబును దలపడిరి. అధికారబలమును నవాబును, ఆత్మబలమును రాజును ప్రదర్శించిరి. పోరు చాల ఘోరముగ జరిగెను. మహమ్మదీయులు మతావేశముతోఁ బోరిరి. భారతీయులు శౌర్యావేశముతోఁ బోరిరి. రక్తనదులలో పీనుఁగుగుట్టలు కొట్టుకొనిపోయిన పిదప జయలక్ష్మి గౌతముని వరించెను. తురుష్కులు పలాయనము చిత్తగించిరి.

ఎంతయానందము ! అర్గళసంస్థానమునం దంతటను ఆనందతరంగములు వెల్లివిరిసెను. జయజయధ్వనులు మిన్నుముట్టెను.

అర్గళసంస్థానమున ప్రతికుటుంబమును, ప్రతి వ్యక్తియు నాఁడు పర్వదిన మని భావించిరి. పర్వమును సార్థకము సేయు తలఁపుననో, సహజ మగుభక్తివలననో, సంస్థానము రక్తసిక్త మగుటచే మైల సోకె నని భావించెనో, మఱి యేయితరాంతరంగికకారణముననో నాఁడు రాణి గంగాస్నానమే చేయవలయు నని సంకల్పించుకొనియెను.

ఎట్లు? పరాజితు లైన యవనులు ఇంకను కేవలమును దేశమును విడిచిపోలేదు. ఇట్టి స్థితిలో రాణి రాజున కెఱుక లేకుండ గంగాస్నానమునకుఁ బోవుటయా? ఈసందేహమును కొందఱు చెలికత్తెలు విన్నవించిరి; గాని రాణి వినలేదు. "సంకల్పము గలిగినది. గంగను సేవించితీరవలెను" అని రాణి తన దృఢదీక్షను దెల్పెను. ఇఁక నెవరును అడ్డుచెప్పలేదు. ముఖ్యలయిన దాసీలందఱును సిద్ధపడిరి. అందఱునుగూడ వేషములు మార్చికొని బయలుదేరిరి.

గంగానది కోటకు కొంచెము సమీపమునందే యున్నది. అందును వారు సమీపమునందలి రేవునకే పోయిరి. అయినను రాణి స్నానార్థము నదిలో దిగినవెంటనే ఆమెకు పూర్వాధికశోభ వచ్చెను. రాణి చెప్పినట్లు వచ్చు వేషమును మార్చుకొనఁగలదు; గాని దివ్యతేజము నెట్లు మాటుసేసికోఁగలదు ?.

రాణి నదిలో దిగినవెంటనే "గంగలో స్నానము చేయుచున్నది" అనువార్త నది పొడుగునను వ్యాపించెను. ఈవార్త తురుష్కభటుల మోములకు వికాసముగలిగించెను. నవాబు చెవులలో నమృతము వర్షించెను.

పాఱిపోవు ప్రయత్నమున నుండఁగా శత్రుస్త్రీ సులభముగఁ బట్టువడు ననువార్త. బళా! ఎంత చక్కని సంఘటనము ? గౌతముఁడు జయించినను ఏమి నష్టము? క్షణములో గౌతముని జీవశుకము పంజరమున చిక్కుకొనుచున్నది. గౌతముఁ డిఁక మృతప్రాయుఁడు. "రాణిని పట్టితెండు" అని మహో

త్సాహముతో నవాబు ఆజ్ఞాపించెను. అంతకంటెను మహో త్సాహముతో సిపాయిలు ముందున కుఱికిరి.

అప్పటి కప్పుడే రాణి పరిజనముతో స్నానము ముగించుకొని మార్గమధ్యమున నుండెను. హఠాత్తుగ తురుష్కులు ఆమెను ముట్టడించిరి. "స్త్రీలము. సమీపింపవలదు. మీరాడు తోడున బుట్టలేదా?" అని యొక దాసి కేకవేసెను. "వలదు దీనాలాపములు, పలాయితులు గూడ స్త్రీలే. నేఁడు మనకు సమానులతో సంఘర్షణము" అని మఱియొకతె పలికెను. "పలాయితునికంటె ఆఁడుదియే యుత్తమురాలు. కత్తికి కత్తితోడనే జవాబు" అని పలికి రాణి ఒడ్డాణము నూడఁబెఱికెను. అందఱు నట్లే చేసిరి. తురుష్కభటులు జలకలశములున్న స్త్రీలచేతులలో విచ్చుకత్తు లుండుటఁ జూచి నిర్విణ్ణులైరి.

"దూయుము కత్తి" అని రాణి సిపాయిని జూచి గద్దించి పలికెను. వాఁడు ఉలికిపడి చూచుచుండఁగా ప్రక్క నున్న వాఁడు కత్తి దూసెను. ఆవిద్యుల్లతను జూచి సిపాయి లందఱును కత్తులు దూసిరి. స్త్రీలెల్లరును కత్తులు త్రిప్పసాగిరి. వారి గజ్జెల చప్పుడు సిపాయిలకు ఉన్మాదావస్థను సంఘటించుటకు సిద్ధముగ నుండెను.

పదుగురు స్త్రీలు. నూర్గురు సిపాయిలు. ఎంత యంతరము! శౌర్యమునమాత్రము సిపాయిలు జంకిరి. క్షణములో వారికి కొందఱు తోడైరి. తురుష్కుల యెదుట స్త్రీబృందము నదియెదుట పంటకాలువవలె నుండెను.

ఇట్లు యుద్ధము జరుగుచుండఁగా అనేకభారతీయులు

పురుషులే చుట్టును మూఁగి చూడసాగిరి. ఒక్కఁడును ఉన్న చోటునుండి కదలలేదు. విప్పినకన్ను మూయలేదు. కొందఱు తెఱచిన నోరుగూడ మూయలేదు.

భారతీయులకును తక్కిన జాతులవారికిని ఇట్టియంతరము చాలదినములనుండి కాన్పించుచున్నది తన జాతిస్త్రీల యెడల నితరజాతీయులు ఇట్టి దుండగమును జేయుట చూచి కేని భారతీయులవలె భారతీయేతరులు నోరులు తెఱచికొని చూచుచు నూరకుండరు. పురుషులయెడలఁగూడ వా రౌదాసీన్యము వహింపను. యుద్ధములో దిగియున్నవానికిని తనకును సహజవైరమే యుండవచ్చును; గాని తన జాతివానిని మఱియొకజాతివాఁడు ఓడించుట అథవా ముట్టడించుటగూడ విజాతీయుఁడు చూడ లేఁడు.

నాఁటికిని నేఁటికినిఁ గూడ ఒక్క భారతీయులలో మాత్రమే యీదుర్లక్షణము కాన్పించుచున్నది. దీనిని గుఱించిన విమర్శన మెచ్చటను గాన్పింపదు. ఇట్టి యౌదాసీన్యమువలన పెక్కుసారులు భారతీయులకు అనేకవిపత్తులు సంభవించియున్నవి.

రాణికి ఆయాసము పొడసూపెను. దాసీలలో కొందఱు వీరశయ్య నలంకరించిరి. సాయము వచ్చు సూచన లేమియుఁ గాన్పింపకుండెను. అప్పుడు రాణి "ఇక్కడ మగవాఁడైన భారతీయుఁ డెవ్వఁడును లేఁడా?" అని గొంతెత్తి పలికెను. ఇది అభయచందు, నిర్భయచందు అను నిరువురు వీరులకు హృదయశల్యమై నాఁటెను. తోడనే వారు తురుష్కులపై నుఱికిరి. వారివెంట మఱికొందఱు వచ్చిరి.

స్త్రీలలో మఱల తొల్లిటిధైర్యము పొడచూపెను. ఈసాహాయ్యమువలన నిలిచిపోయిన రాణి ముందున కడుగు వేసెను.

తురుష్కులకు రెండు చిక్కులు వచ్చెను. ఒకటి హిందువులను జయించుట; రెండవది కదలకుండ వారిని నిలుపుట. జయప్రస్తావమున కింకను అవకాశము గలుగలేదు; గాని రాణి ఒక భారతీయుని కళేబరముమీఁదఁగాని ముందున కొక్క యడుగు వేయఁ జాలకుండెను.

అప్పటి కీవార్త కోటలోఁ దెలిసెను. వెంటనే రాజు యోధులను వెంటఁబెట్టుకొనివచ్చెను. క్షణములో తురుష్కవాహిని సన్నగిల్లెను. రాజు కంటఁబడిన తోడనే రాణియు, రాణి కంటఁ బడినతోడనే రాజును శౌర్యాతిరేకమున అవశులై గొబ్బరిపుచ్చెలనువోలె చేతికందిన తురుష్కుల తలలెల్ల చిదిమివేయఁజొచ్చిరి.

చూచుచుండఁగా తురుష్కులు సన్నగిల్లిరి. హతశేషులు పలాయనము చిత్తగించిరి.

అయితే రాజు వారిని విడువలేదు. మఱికొంత సైన్యము పంపవలసిన దని కోటలోనికి వర్తమానము చేసి రాజు నవాబున్న దిక్కున కుడాయించెను. రాణియు దాసీలును, కోటలోనికి వెడలిపోయిరి.

నవాబు రాజుపత్నినిమిత్త మెదురుచూచుచుండఁగా రాజు వచ్చి యెదుట నిలిచెను. పాపము కత్తి దూయుటకుఁ గూడ నవాబున కవకాశము లేకపోయెను. తమ యజమానుని యవస్థను జూచి కొందఱు యవనవీరులు రాజున కడ్డువచ్చి

పరలోకమునకుఁ బోయిరి; గాని యింతలో నవాబు తుపాకికైన దొరకకుండ పాఱిపోయెను.

అర్గళసంస్థానపు సైన్యము దయ యనుమాటను మఱచి దొరకిన యవనుల నందఱను యమలోకమున కంపివేసిరి. రాజు "చాలు నిఁక" అని భటులను వెంట నిడుకొని కోటకు బయలు దేఱెను.

దుర్గద్వారము చొచ్చునప్పటికి రాణి మంగళహారతి పట్టుకొని నిలిచియుండెను. అది చూచి రాజు "దేవీ, ఇది నాకుఁ దగదు" అని తాను పుచ్చుకొని రాణికి నివాళి ఇచ్చెను. జయజయధ్వనులతో అందఱును దుర్గములోనికిఁ బోయిరి.

యుక్తసమయమున రాజు దర్బారు తీర్చెను. ఈయుద్ధమున పాల్గొనిన స్త్రీపురుషు లందఱును సభకు వచ్చిరి. పౌరులు సభ నిండియుండిరి; గాని నిర్భయచందుమాత్రము అక్కడ లేదు.

భటులు అతఁడు వీరస్వర్గమును జూఱగొనె నని చెప్పిరి. అందులకై ప్రజలును, రాజును, అందఱికంటె నధికముగ విశ్వాసభరిత యగు రాణియు మిగుల వగచిరి. కొంతసేపు విచారముతో గడచిపోయిన పిదప రాజు తక్కిన యోధుల నందఱను వినుతించి గొప్పబహుమతులు చేసి సన్మానించి అభయచందునకు తన కొమార్త నిచ్చి పెండ్లిచేసెను.

---

# 16. శికందరుబేగము.

---

భూపాలుసంస్థానప్రభు వగు నజరుమహమ్మదు తన పూర్వులవలెనే ప్రజలను చక్కఁగా నేలి మంచివాఁ డనిపించు కొనియెను. ఒకనాఁడు ఈతఁడు తన కొమార్తె యగు శికంద రును కొలువుకూటమునకు రప్పించుకొని ఆమెతో వినోదించు చుండెను. ఈసమయమున నవాబు బావమఱఁది యగు ఎనిమి దేండ్ల ప్రాయముగల ఫౌజుదారుఖాన్ చిన్ని తుపాకితో నాడు కొనుచుండెను. అందఱును బాలికాబాలకుల విచిత్రచర్యలకు వినోదించుచుండఁగా హఠాత్తుగా బాలకుని చేతిలోని తుపాకి ప్రేలెను. దానివలన నెవరి కపాయము కలిగెనో యని యంద ఱును కంగారుపడి చూచునప్పటికి నవాబు అగు నజరుమహ మ్మదు క్రిందఁబడి విలవిల తన్నుకొని ప్రాణములు విడిచెను.

నజరుమహమ్మదునకు పుత్రసంతతి లేదు. అగుటచే నాతని కొమార్తె యగు శికందరుబేగమే రాజ్యాధికారిణి యయ్యెను. అయిన నామె బాలిక. ఏమి చేయవచ్చును? అప్పుడు సంస్థానమునందలి ప్రధానోద్యోగు లందఱును జేరి యాలోచించి, దేశమున అప్పుడు ప్రబలు లగుచుండిన ఈష్టు ఇండియాకంపెనివారి యనుమతినిగూడఁబడసి, శికందరుబేగము యువతి యైన తరువాత నజరుమహమ్మదు అన్నకుమారుఁడు అగు మునీరమహమ్మదుఖానునకు ఇచ్చి పెండ్లి చేయుటకును, అంతవఱకును నజరుమహమ్మదు భార్య యగు కుదిషియాబే గము పరిపాలనము చేయుటకును నిశ్చయించిరి.

కుదిషియా బేగము సింహాసన మెక్కినతోడనే రాజ్యమునందలి లోపము లన్నియు సవరింపఁబడెను. ప్రజ లందఱును సుఖించుచు బేగము సామర్థ్యమును గొనియాడసాగిరి.

శికందరు యువతి యయ్యెను. కుదిషియా రాజ్యపాలనమున విదగ్ధయయ్యెను. శికందరు హృదయమున ఐహికసౌఖ్యమునకు సంబంధించిన ఆశాలతికలు అంకురించి అల్లిబిల్లిగ నల్లుకొనిపోసాగెను. కుదిషియా నెమ్మనమున ప్రజాపాలనమునకు సంబంధించిన ఊహాలు విజృంభించి పెనవేసికొనిపోయెను.

స్త్రీలనిమిత్తము ఉద్దిష్ట మగు ఈగ్రంథమున మునీరమహమ్మదువంటి యువకుని హృదయస్థితిని వర్ణించుట మంచిది గాదు. అయిన నిప్పుడు ఆతనిహృదయమున కేవలసాంసారిక విషయములేగాక రాజకీయవిషయములుగూడ జాగరితము లగుచుండుటచే కొంతగాకున్నఁ గొంతయైనఁ జెప్పకతీఱదు. నజరు మహమ్మదు చనిపోయినప్పటినుండియు మునీరమహమ్మదునకు రాణిగారి భర్తకు జరుగవలసిన మర్యాద లన్నియు జరుగుచునే యుండెను. అయినను రాణిగారి భర్త యను బిరుదము ఇంకను లేఖ్యారూఢము కాలేదు. రాణిగారి భర్త కాఁదగినవానికిని రాణిభర్తకును జాల భేద మున్న దని మాయభిప్రాయము. అయితే రాణులకు భర్తలు కావలసిన పురుషులు తక్క తక్కినవారందఱును స్త్రీలును పురుషులునుగూడ మాతో నేకీభవింతురనియే మేము నమ్మెదము. రాణులకు భర్తలుగా నిశ్చయింపఁబడినవారుమాత్రమే గాక వారి నాశ్రయించుకొని రాజ్యాధికారము తమదే యైనట్లు సంచరించువారుగూడ

ఈసిద్ధాంతము నాక్షేపింపవచ్చును; గాని వారికైనను "నేఁడు కాకున్న రేపయినను" అని యొక మెట్టుక్రిందకు దిగక తీఱదు.

ప్రధానోద్యోగుల నిశ్చయమున కనుగుణముగ విధాత శికందరును యువతినిఁ జేసిపెట్టెను. అయినను యథార్థమున అంతమాత్రమునకు మునీరమహమ్మదునకు ఏమి లాభము? కుది షియా వాలకము చూచిన నేమియు బాగుగ లేదు. ఆమెకు కొమార్తె పెండ్లినిగుఱించిన యూహ తట్టినట్లే కాన్పించుట లేదు. పెండ్లికొడుకు ఏమియుఁ దోఁచక తహతహలాడిపోవు చుండెను. ఆతని యనుయాయులు "పెద్దలు గ్రహింపనప్పుడు పిన్నలు సూచింపకతీఱదు. అది తప్పుగాదు" అని యాతనికి చెవులలో మంత్రము లూఁదసాగిరి. కాని కొంతకాలము వఱకు నాతఁడు పైకిమాత్రము తేలలేదు. అయినను అనుయాయులు ఊరకుండక ప్రధానోద్యోగులతో నీప్రస్తావనలు చేయ సాగిరి. "బేగమువారికి తోఁచకుండిన మీరు చెప్పవలెను. పెండ్లి యగుటకు ఇప్పుడేమి యాటంకము లున్నవి?" అని వారు మాటిమాటికిని ఉద్యోగులను వేధించుచు "నీవు ఇట్లు ఊఱకుండిన ప్రయోజనము లేదు. బేగమువలెనే నీవును ఈవిషయమునుగుఱించి తలపెట్టకున్నచో ప్రజ లందఱును నీవద్ద నేదో లోప మున్నదనియు అగుటవలననే రాణి కొమార్తె పెండ్లిని గుఱించి యుబుసైన తెచ్చుట లేదనియు తలంతురు. జనులలో నిట్టియభిప్రాయము వ్యాపించుట నీకు చాల నష్టము" అని చెవిలో నిల్లుకట్టుకొని పోరసాగిరి.

ఇటు అధికారకాంక్షయు, అటు మిత్రుల ప్రోత్సాహమును తిక్క యెత్తించుటచే తుదకు పెండ్లికొడుకు ప్రాణము

లుగ్గబట్టి సాహసించి "ఏలినవారికి విశదము గానిది లేదు. అయినను తమ వాగ్దానమును జ్ఞప్తికిఁ దెచ్చుటకు సాహసించి నందులకు క్షమింపవలెను. శికందరు బేగమువారు ఈ దీనుని పరిచర్య లంగీకరించుటకు అవకాశముగలిగించుటకు తరుణము వచ్చినదని మనవిచేయుచున్నాఁడను." అని విన్నవించుకొనఁగా బేగము "అది విధి నిర్ణయము. దాని కడ్డు దలంచువారును అడ్డుకొనఁగలవారును ఎవరును లేరు. శికందరువివాహమును గుఱించి నాకంటెఁ దొందరపడఁదగినవా రెవ్వరును లేరు. అయినను రాజకీయమున కొన్ని యవసరములు త్వరగాఁ దీర్ప వలసినవికలవు.దూరమునుండి చూచుచున్నావు; గావున నీకుఁ దెలియవు. "ఈ రాజ్యమును అమ్మాయికి ఎప్పుడుఒప్పగింతును? నాకెప్పుడు ఈయాతన తప్పు" నని అనుక్షణమును తహతహ పడుచున్నాను. ఇప్పుడు ఈచిక్కులు తీరకముందే రాజ్యభార మును మోపిన శికందరునకు ఉక్కిరిబిక్కిరి యగును. అడవి యంతయు ఛేదించి ఉద్యానవనమును బెంచి సుకుమారురా లగు శికందరు నప్పు డందు ప్రవేశపెట్టవలయు నని నాయభి ప్రాయము. ఇంతకు నిప్పుడు నీకు ఈతొందర ఏలవచ్చినది? నీకు జరుగవలసిన మర్యాదలు సరిగ జరుగుట లేదా యేమి? నీయె డల నెవ రేమి యసందర్భములు సేయుచున్నారో చెప్పుము" అని మొగమోట విడిచి బదులు పలికెను. మునీరమహమ్మదు ఆమీఁద మాటలాడఁజాలక సిగ్గుపడి వెనుకకుఁ బోయెను. మిత్రుల తొందరల కాఁగఁజాలక ఆతఁ డింక నొకటిరెండు సారులు ఇట్టి ప్రస్తావనలు చేసెను; గాని రాణి అల్లే ఆతనికి ముఖపిధానము గావించి పంపివేసెను.

మునీరమహామ్మదు స్థితి యిట్లుండఁగా నిటు శికందరు యౌవనము పొడసూపినది మొదలు భర్తనుగుఱించి యనేకసుఖకల్పనలు చేసికొనుచు తదేకచిత్తయై యుండఁజొచ్చెను. కుదిపి యా మునీరమహామ్మదు దాసీలు శికందరునకుఁ గూడ బుద్ధులు గఱపి రాజ్యమునెడల లోభము పుట్టించెద రేమో యని ముందుగనే మేల్కాంచి రాజ్యవ్యవస్థయందలి వ్యాసఘట్టములను జూపి "నీయదృష్టయువలన నిట్టి చిక్కులనేకములు తీఱిపోయినవి. నీబాల్యమున అనఁగా రాజ్యపాలనము నామీఁద బడినప్పుడు గల చిక్కులు చూచితివేని తల్లడిల్లియుందువు. నాజీవిత మంతయు నిట్టి చిక్కులను దీర్చుటలో నంధకారబంధురమైపోయినది. ఈవయసునందే ఐహికసౌఖ్యమునకు ప్రారంభ మగు నీనవయౌవనమునందే నీవిట్టి కల్లోలములలోఁ జిక్కుకొన్న నిఁక నీకు సౌఖ్య మెక్కడది? ఆనంద మెక్కడిది? పెండ్లియాడిన ఫల మేమి కాన్పించును? నాది తల్లిప్రాణము గనుక నెట్లయిన నీచిక్కు లన్నియు సాధ్యమైనంత త్వరలో దీర్చివేసి నిన్ను సింహాసన మెక్కింపవలయునని చూచుచునే యున్నాను; గాని ఉన్న చిక్కులు ఇవి" అని తలుచు చెప్పుచు కాలము గడపసాగెను. పాపము ముద్దరాలగు శికందరు ఈమాటలు విని ఒడలు జలదరింప "అమ్మయ్యో" అని భీతిల్లుచుండెడిది.

శికందరునకు తండ్రి చనిపోయినప్పటినుండియు విశేషించి తల్లికి రాజ్యము వచ్చినప్పటినుండియు సంసారసంబంధములగు కష్టసుఖము లన్నిటియందును మునీరమహామ్మదే యవలంబనముగఁ గాన్పించెను. ఆమెకు తాను జాగ్రత్తతీసికొన

వలసిన వ్యక్తి మునీరమహమ్మదుఖానుకంటె నన్యము కానిపిం పలేదు. ఆమె హృదయమునం బొడసూపిన ఏభావమునం జూచినను మునీరమహమ్మదే అధిష్ఠానదేవతయై యుండెను.

భారతదేశమున బాల్యవివాహవాదులు చూపు బాల్యవివాహములవలనం గలుగు ప్రయోజనములలో ముఖ్యమైనదిదియే. ప్రేమించినవారినిం బెండ్లియాడుటా? పెండ్లియాడినవానిం బ్రేమించుటా? యను ప్రశ్నకు సమాధానము కుదురక ఇంకను అనేకులు చర్చలను పరిశోధనములను జేయుచునే యున్నారు. ఇది ఎప్పటికిం దేలునో మేము చెప్పంజాలము; గాని పెండ్లియాడినవానిం బ్రేమించుట మంచిదైనచో ఆపెండ్లి బాల్యమునం దగుటయే మంచిది. అట్లు గాకున్న ప్రేమకు ముందు వరణము తటస్థించును; గావున తారతమ్యవిచారణయందును గుణదోషవిమర్శయందును స్వచ్ఛంద మగు చిత్తవృత్తి గజిబిజిపడి నిగ్రహమును గోల్పోవునా యని సందియము గలుగుచున్నది. మోహమునకును, ప్రేమకును గల భేదమును, ప్రేమించుటయుం దెలిసినచోట ఎప్పుడైనను ఎట్టి చిక్కులును రాకుండుట యథార్థమే. అయితే బాల్యవివాహమున మోహమునకుం బ్రసక్తి లేకుండుటచే వివాహమైన ఉత్తరక్షణమునందే ప్రేమాంకురములకుం బ్రారంభ మగుటయు, కామముతోం గాని మోహముతోం గాని సంఘర్షణము కలుగకుండుటచే మనోనిగ్రహమునకు చలనము కలుగకుండుటయుం దటస్థించును.

దంపతులు, వివాహము, ఇంక నిట్టి మాటలు ఏవి విన్పించినను బ్రకృతము తత్వజ్ఞులదృష్టికి ప్రప్రథమమున ప్రేమ

గమ్య మగుచున్నది; గావున మేము తత్వజ్ఞులము గాకపో యినను, ఈచిన్ని గ్రంథమున, తత్వవిమర్శకు స్థలము చాల కున్నను, మునీరమహమ్మదుయొక్కయు, శికందరుయొక్కయు హృదయములను గొంచెము పరిశీలింపవలసియున్నది. శికందరు రాజపుత్రిక. ఒక సంస్థానమునకు ఉత్తరాధికారిణి మునీరమ హమ్మదునందిట్టి విశేషము కాన్పింపదు; గావున ఉభయుల ప్రేమకును ప్రవృత్తియందు భేదము గాన్పించుచున్నది శికం దరు రాజపుత్రిక గాకున్నను, ఒక రాజ్యమునకు ఉత్తరాధికా రిణి గాకున్నను ఆమెను మునీరమహమ్మదు ప్రేమించునా? ప్రే మింపఁడా? యనునది ఇపుడు తీఱని ప్రశ్నయే యైనను చర్చిం పక విడువఁదగినది గాదు. సుందరి యగు శికందరును పదిమంది సుందరకన్యలలోఁ గలిపి నీయిష్టమువచ్చిన కన్యను ప్రేమింపు (వరింపు) మనిన మునీరమహమ్మదు శికందరును నటాలున ఎన్ను కొనును; గాని ఇట్లే సుందరుఁ డగు మునీరమహమ్మదును పది మంది సుందరయువకులలోఁగలిపి నీచిత్తమువచ్చినవానిని ప్రే మింపు మనినచో శికందరు మునీరమహమ్మదునే వరించుటకు తగిన విశేష మేమియు నాతనియందు గాన్పింపదు. కావున మునీరమహమ్మదు ప్రేమ కృత్రిమము. శికందరు ప్రేమ స్వాభా వికము.

ఇఁకఁ బ్రకృత మనుసరింతము. మునీరమహమ్మదునకు రా జ్యతృష్ణ పెరిగిపోయెను ప్రముఖు లగు నుద్యోగులతోడ ను, సామంతులతోడను, సంగతి యంతయు విశదపఱిచి యా తఁడు తన వివాహమును గుఱించి కుదిపియాను త్వొందరపె ట్టసాగెను. తుదకు ఈవ్యవహారము తగవులలోఁ బ్రవేశించెను.

"ఈరాజ్య మంతయు నాయధికారముక్రిందికి వచ్చిపోవు నని కుదిషియా బేగము ఈవివాహమునకు కాలహరణము సేయుచున్నది" అని మునీరమహమ్మదు తగవు పెట్టెను. "నేను తత్వము పరిశీలించుచునే యున్నాను. నాకొమార్తను పెండ్లియాడుటకు ఈతనికిఁ గల ఉబలాటమున కంతకును రాజ్యతృష్ణయే ముఖ్య కారణము. ప్రేమనిమిత్తము గాక రాజ్యమునిమిత్తము పెండ్లి యాడఁ దలఁచియున్న ఈతనివలన నాకొమార్తకుఁ గలుగు సుఖ మేమో మీరే నిర్ణయింపుఁడు" అని కుదిషియా మంత్రి సామంతాదులను అడిగెను. ఈవాదముయొక్క వివరణముతో మాకిచ్చటఁ బ్రసక్తి లేదు. మంత్రులు, సామంతులు, ప్రధాన బంధువులు మున్నగువారెల్లరును రాణిపక్షము వహించిరి. మునీరమహమ్మదుమాటకు ప్రోద్బలకము లేదయ్యెను. ఆతని వివాహప్రస్తావము పూర్వపక్షమైపోయెను. అందఱును జేరి మునీర మహమ్మదును నలువదివేల రూపాయలు ఇచ్చి "ఇఁక శికందరు నెడలను, భూపాలసంస్థానము నెడలను ఆశవదలుకొనుము" అని యాశీర్వదించి పంపివేసిరి.

పిదప రాణి శికందరును మఱియొక బావగారికొడుకు అగు జహాంగీరునకు ఇచ్చి వివాహాము చేయుటకు నిశ్చయించెను.

అయినను రాజ్యలోభమువలన ఆమె ఈసిద్ధాంతము నాచరణలోఁ బెట్టుటకు సాహసింపదయ్యెను. గతసంగతు లన్నియు బాగుగఁ బరిశీలించెను; గావున జహాంగీరు ఏమియు మాట్లాడకుండ నూఱకుండెను.

నిశ్చయమైన సంబంధము ఈతీరున విఘాతమై క్రొత్తసంబంధము మఱల నిర్ధారణమయ్యెను. యథార్థమున శికందరునకు జరుగఁబోవు వివాహము పునర్వివాహ మని చెప్పుటకు సందేహ మక్కఱలేదు. సంపత్ప్రధానుఁడు; గావున మునీరమహమ్మదు శికందరునెడల గల యాశను క్షణములో నలువదివేల రూపాయల కమ్ముకొనియెను; గాని శికందరు హృదయము ఆతనినుండి మఱలి మఱియొకనిమీఁద నెట్లు పొత్తుకొనియెనో మేము చెప్పఁజాలము. మహమ్మదీయులసంగతి యట్లుండ భారతీయులలోఁగూడ రాజులయందు రజస్వలావివాహములును, స్వయంవరములును బరిపాటియే యైనను అనేక రాజపుత్రికల కిట్లు రాజకీయవిషయములను అనుసరించియే వివాహములు జరిగినవి. భారత దేశచరిత్రముగూడ నిట్టి యనేకవివాహములకు ఉదాహరణముల నిచ్చినది.

శికందరు చేసిన పని ప్రేమవతులకుఁ దగినది గాదు. ఇంతకు పూర్వక్షణమునందే ఆమె ప్రేమనుగుఱించి చాల చర్చఁజేసిన మాకు ఇంతటిలోనే యిట్లు వ్రాయవలసివచ్చుట చాల దురదృష్టమే. అయినను భవిష్యద్విషయములకు జాగ్రత్తపడుట తక్క గతమునకుఁ జేయవలసిన దేద్దియు లేదు. వెనుకటి విషయమును ఉపసంహరించుకొనవలసిన యావశ్యము మాకేమియుఁ గాన్పించుట లేదు.

కృత్రిమకారణములకు విలువయు, నిలుకడయుఁగూడఁ దక్కువయే. శికందరు వివాహము నింకను నిలిపియుంచుటకు తుదకు ప్రముఖోద్యోగులకుఁ గూడ సనిష్ట మగుచున్న దని యెఱింగ కుదిషియా తానే వివాహప్రస్తావము తెచ్చి వారి

సందియములను బాపి శికందరును జహాంగీరున కిచ్చి మహావై భవముతోఁ బెండ్లిగావించెను.

రాజును బెండ్లియాడిన యువతి రాణి యగుట నిజమే. అట్లే రాణినిఁ బెండ్లియాడిన పురుషుఁడు రాజగునా? "ఏల కాఁగూడదు" అని శంకించికొని వివాహము ముగిసిన మఱు నాఁడే జహాంగీరు నవాబు నని ప్రకటించుకొనెను; గాని కుదిపియా యందుల కంగీకరింపలేదు. ఉభయులకును వైరము ప్రబలెను. ఇరువురునుగూడ సైన్యములను వృద్ధిచేసికొని కయ్యమునకుఁ దలపడిరి. జహాంగీరుపని తన్నఁబోయి బోరగిలఁబడిన ట్లయ్యెను. ఆతఁడు అత్తగారిని కైదు చేయఁబోయి తానే కైదీ యయ్యెను. జహాంగీరు మూఁడుమాసములు కారాగృహమున విశ్రాంతి ననుభవించెను.

కాని యంతలో ఇంగ్లీషువారును, మఱికొందఱు సన్నిహితులును పిలువనిపేరంటముగనే జోక్యము కలిగించుకొని ఎవరిని మందలింపవలసినట్లు వారిని మందలించి రాజ్యమంతయు జహాంగీరు ఏలునట్లును, కుదిపియాబేగము ౬౦౦౦౦ రూపాయలయాదాయముగల యొకజమీందారీనిఁ గైకొని దానితోఁ దృప్తిపడునట్లును మాధ్యస్థ్యము నెఱవేర్చిరి. జయనినాదముతో జహాంగీరు సింహాసన మెక్కెను. "పోరు లేనిది చేరెఁడు అయినను జాలు" నని కుదిపియా సంతోషించెను.

రాజగుట వేఱు. రంజకుఁ డగుట వేఱు. జహాంగీరు బండార మంతయు ప్రజలకు రాజ్యసంపాదన ప్రయత్నమునందే వెల్లడి యయ్యెను. కొలఁదిదినములయందే ప్రజ లందఱు నాతనిని "అసమర్థుఁడు, దుర్మార్గుఁడు" నని పిలువఁజొచ్చిరి.

జహాంగీరునకును శికందరునకును మనస్సులు కలియ లేదు. ఎన్ని విధముల బుద్ధి చెప్పినను జహాంగీరు గ్రహించుకొనఁజాలక పోవుటయే గాక పయిపెచ్చు శికందరును బాధించుటకుఁగూడ బ్రారంభించెను. ఆయవమానమును సహింపలేక శికందరు పెక్కుసారులు తల్లిచెంతకుఁ బోయి యుండుచువచ్చెను. అయినను ప్రయోజనము కలుగలేదు. దుష్టుల స్నేహమువలన జహాంగీరునకు దుర్వ్యాపారము లధిక మయ్యెను. అందులకు సాయము అపకీర్తియు నధిక మయ్యెను; గాని ఆయుర్దాయము మాత్రము అధికముగా లేదు. ఆతఁడు తల్లిగర్భమున తొమ్మిది మాసము లుండెను. సింహాసనమునఁగూడ తొమ్మిదియే—మాసములకు బదులు సంవత్సరములు ఉండెను. అంతియే. అంతటితో నంతయు నంత మయ్యెను.

మేము నిజము చెప్పెదము. జహాంగీరు మరణమువలన శికందరునకు దుఃఖమును, ధైర్యమునుగూడఁ గలిగెను.

లోకములో దుర్మార్గుల అర్థతః అశక్తుల మార్గములు చాల విచిత్రములుగ నుండును. కొందఱు తమ మరణానంతరముగూడ ఏడ్పింతురు. మఱికొందఱు మరణానంతరముగూడ ఆజ్ఞలను చలాయింపఁజూతురు. రాజకార్యధురంధరులు మరణశాసనమును మంచి యుద్దేశముతోడను, మంచినిమిత్తమునే సృజించియుందురు; గాని జహాంగీరు తన మరణశాసనమును తన ఉంపుడుకత్తె కొడుకు అగు దస్తగీరు అనువానికి రాజ్యము వచ్చునట్లు చేయుటకు సృజించెను. ఆతఁడు తన భార్యను దలఁపలేదు. కడుపునఁబుట్టిన కొమార్తె యగు శహాజహానునుగూడ స్మరింపలేదు. మరణసమయమున నాతని హృదయమున ఉంపు

చుక త్తెయు, నామె కొడుకును మాత్రమే ప్రవేశించిరి. అప్పుడు భగవంతునకుఁగూడ అక్కడ రవంత ప్రదేశము దొరకలేదు. మరణసమయమున అజామిళుఁడు ఉంపుడుకత్తె కొడుకగు నారాయణుని స్మరించి ముక్తుఁ డయ్యెను. జహాంగీరుగూడ నట్లయ్యెనో లేదో మేము చెప్పఁజాలము; గాని యాతఁడు "దస్తగీర్, జహాంగీరురాజ్యము నీదే. నీవు నవాబ వగుము. సుల్తానవగుము భూపాలసంస్థానముకేది తుదకు హిందూస్థానమంతయు నీదేయగుఁగాక" అని దాసీపుత్రుని ఆశీర్వదించుచు ప్రాణములు విడిచెను.

పతి మరణానంతరము శికందరు సింహాసన మెక్కెను. శహాజహాను పెద్దది యగునంతదనుక శికందరే పరిపాలనము చేయుటకు నిశ్చయ మయ్యెను. ఆమె సింహాసన మెక్కిన వెంటనే ప్రజ లందఱును సంతోషించిరి.

ఎప్పుడు శికందరు సింహాసనారూఢ యయ్యెనో అప్పటి స్థితిగతులను బట్టి చూచిన పురుషుఁ డయినను ఆరాజ్యమును మంచి స్థితికిఁ దెచ్చుట చాల కష్టమైన పని. శికందరు చేసిన రాజకార్యసంస్కరణము లనేకము లున్నవి; వాని నన్నిటిని చూపుట కిక్కడ స్థలము చాలదు. అయినను ఒకటి రెండు.

అంతకు మున్ను కొన్ని వస్తువులను కొందఱు వర్తకులే విక్రయింపవలయు నను నియమ ముండెను. శికందరు అన్నివస్తువుల నందఱు నమ్ముకొనవచ్చు నని నిర్ధారణ చేసెను. రక్షకభటులు తక్కువగా నుండుటచే దేశమున జారచోరాదుల బాధ లధికముగా నుండెను. రక్షకభటుల సంఖ్యను వృద్ధిచేసి ఆబాధలును రక్షకభటులవలన సంభవించు బాధలును గూడ

ప్రజలకుఁ గలుగకుండునట్లు చూడసాగెను. అంతకు మున్ను తహాసీల్లు వద్దైరాలు మక్తా కిచ్చెడివారు. శికందరు తానే గ్రామాధికారులవద్దనుండి శిస్తు వసూలు చేసికొనఁజొచ్చెను. టంకశాలను చాల మంచి స్థితికిఁ దెచ్చి స్వీయముగా పరీక్ష చేసికొనఁగడఁగెను. అంతకు మున్ను రాజ్యము ఋణముల పాలయ్యెను. శికందరు ఋణ మంతయు ఆఱు సంవత్సరము లలోఁ దీర్చివేసెను. ఇట్లు ఆమె అనుపమానప్రతిభతో ప్రవర్తించుచుండుటఁ గాంచి పరరాజులుగూడ ఆశ్చర్యచకితులు కాసాగిరి.

కాలము నిలిచియుండదుగదా? చూచుచుండఁగా శహాజహాను వరయోగ్య యయ్యెను. శికందరు తన తల్లివలె కొమార్తవివాహమును నిలిపియుంచలేదు. బఖీ బాకరమహమ్మదు ఖాను అను యువకునిఁ దెచ్చికొమార్తకు వివాహముగావించెను.

సరే. శికందరు కొమార్త కొక లోటు తీర్చినది. ఇఁక రాజ్యము సంగతి? ఇఁకే మూఁడు సంవత్సరములలో రాజ్యము శహాజహానుని కీయవలసియున్నది? ఏమి సంగతి?

ఏమియు లేదు. శికందరునకు రాజ్యపాలనమున విసుగు పుట్టలేదు. దానిమీఁది యాశపోలేదు. బ్రతికియున్నంతకాలము రాజ్యమును తాను పాలింపవలెను.

శికందరునకు ఇట్టి యూహా వాదములలో నస్వాభావికత లేదు. రాజ్యము తన చేతిలో నున్నయెడల తాను రాణి. కొమార్త కిచ్చినచో తాను రాణిగారి తల్లి. ఇంతకు ముందు తాను రాణియై ఇప్పుడు రాణితల్లి యగుటలో ప్రశంస లేదు.

కీర్తి లేదు. వైభవము లేదు. అధికారము లేదు. ఐహికవాంఛలు విషువలేనివారికి ఏమియు లేదు. అంతయు అంధకారము.

రాణితల్లికి ప్రజలు గౌరము సేయుటలో సందేహము లేదు; గాని ఆగౌరవమునకు కారణము రాణి. తన ప్రజ్ఞ గాదు. ఎవతె సింహాసనారూఢయై యున్నదో ఆమె తన కడుపునఁ బుట్టకున్నచో తాను ప్రజాసామాన్యములోఁ జేరవలసినదే. రాజ్యాధికార మెప్పుడు నెఱుఁగని యామెకు దానినిమిత్తము చాలకాలము నిరీక్షించియుండనియామెకు లోకమునందలి అందఱుస్త్రీలతోఁబాటు పుట్టిన రమణికి రాణికి తల్లియగుట సర్వకారణమే; గాని శికందరువంటి రాజ్యతంత్రజ్ఞురాలికి, దుస్థితిలో నున్న రాజ్యమును చక్కచేసిన ప్రభ్వికి, సింహాసనచ్యుతయై రాణి తల్లి యనిపించుకొనుట అవమానకరము. ఇదివఱకు తన యాజ్ఞానువర్తులై యున్నవారందఱును ఇఁక తన కొమార్త యాజ్ఞయైనఁగాని తనకు పలుకరు. ఏమి బ్రతుకు ?.

శికందరు కొమార్తకు రాజ్యము నీయకుండుటకే నిశ్చయము చేసికొనియెను. ఇందులకు ఉపాయములు ఆలోచించుటలో నామె చాల శ్రమపడఁజొచ్చెను.

ఇంతలో హిందూస్థానమున సిపాయికలహము సంభవించెను. ఆంగ్లేయులకు ఇక్కడ నిలువ నీడ లేనట్లుండెను. హిందూస్థానమున నున్న ఆంగ్లేయులకు అందఱకును సంఘమరణము వ్రాసియున్నట్లు తోఁచెను. ఎక్కడ జూచినను "దొరను, దొరసానిని పొడువుఁడు". అను వీరాలాపములు వినవచ్చెను. ఇంగ్లీషువారి మరణవార్తలుగూడ మెండయ్యెను.

ఇప్పుడు శికందరు అదృష్టము గొప్పదా? శహాజహాను దురదృష్టము హెచ్చయినదా? అని విచారణప్రారంభించినచో మంచిదే; గాని యిది సామాన్యముగ తీఱునది గాదు. తర్కపండితులు చేపట్టిరేని నెలలు గడచినను ఈవాదమును విడువరు. అంతవఱకును మేము గ్రంథరచనమును నిలిపియుంపఁజాలము. మాకు వాదములయందుఁగాని వివాదములయందుఁగాని యభిలాషలేదు. వాని క్రూరమార్గములకు వానిని విడిచి శాంతమార్గము నవలంబించుట మాయభిమతము; గాన యీ తగవును ఎట్లో మేమే పరిహరించి ముందులకుఁ బోయెదము. ఏమి మార్గము? ఏది గొప్పదో అదియే గొప్పది; గాని రెండింట నేది గొప్పది అని తగవుపడుటకంటె ఇప్పుడు శహాజహాను దురదృష్టమును శికందరు అదృష్టమును కలియుటవలన ఇట్టిది సంభవించె నని మాయభిప్రాయము.

శికందరు ఇంగ్లీషువారిపక్షము నవలంబించెను. మరణమువాతఁ బడనున్న ఇంగ్లీషువారి ననేకులను శికందరు రక్షించెను. పర్యవసానమునకు ఇంగ్లీషువారి యునికికిని భారతీయులమీఁద అధికారమునకును శికందరుసాహాయ్యము చాల ముఖ్య మయ్యెను. ఆపదతీఱినతరువాత ఇంగ్లీషువారు శికందరు చేసిన యుపకారమును స్మరించిరి. అంతకు ముందు తీసికొనిన భైరసియాప్రాంతమును ఆమెకు తిరిగి యిచ్చివేసిరి. ఆమెకు నాలుగుతోపులకు అధికార మిచ్చిరి. "స్టార్ ఆఫ్ ఇండియా" అను బిరుదము నిచ్చిరి. మరణకాలమువఱకుభూపాల సంస్థానమునకు ఆమెయే స్వామిని యని తీర్మానించిరి. అనఁగా,

శికందరు తాను బ్రతికియుండఁగా తన రాజ్యమును కూఁతున కీయనక్కఱ లేదు.

శికందరు చాలకాలము రాజ్యము నేలిన పిదప వార్ధకము వచ్చెను. అప్పుడు ఆమె రాజ్యమును బిడ్డకుఇచ్చి మక్కామున్నగు యాత్రలను చేసి అనేకధర్మకార్యములనుజేసిభూమిమీఁద చిరకీర్తిని విడిచి స్వర్గమునకుఁ బోయెను.

# 17. పృథివీరాజుభార్య.

ఈమె రాఠోడువంశజుఁ డగు పృథివీరాజు పత్ని. సక్తావతవంశమునకుమూలపురుషుఁడైన సుక్తరాజునకుఁ గొమార్త. ఏచరిత్ర కర్తయు నీమెపేరు నీయలేదు. ముందు వర్ణింపఁబోవు ఒకవిషయముతప్ప తక్కిన యీయామె పూర్ణజీవితము ఎచ్చటను దొరకుట లేదు.

ఎఱుఁగుదురుగదా భారతీయులలో అక్బరాస్యు లెల్లరును అగ్బరుపాదుషాహ పేరు. ఒకనాఁటిరాత్రి కొలఁదిగడియలలో ముగిసిన యీచరిత్రాంతర్భాగ మైనను మనకుఁ దెలియుటకుఁ గారణము ఈపాదుషాహాయే. ఈతఁడు లేకుండినను, ఈతని ప్రవృత్తి మఱియొకవిధమున నుండినను ఈవీరాంగన నిజముగ నామరూపములు లేకుండఁ బోయియుండునేమో.

భారతదేశచరిత్రమును వ్రాసిన ఇంగ్లీషువారేమి, భారతీయు లేమి. మొగలుచక్రవర్తులలో ఔరంగజేబును కడు దుర్మార్గునిగను యీయక్బరుని కడు సన్మార్గునిగను వర్ణించియున్నారు. రష్యాదేశచరిత్రకు ఒక "గ్రేటు" ను సంఘటించిన ఇంగ్లీషువారు భారతదేశచరిత్రకుఁ గూడ ఒక "గ్రేటు" ను సంఘటించినారు. ఆగ్రేటుపీటరు. ఈగ్రేటుఅగ్బరు; గాని తత్వవిమర్శ చేయువారు ఈయిరువురు గ్రేటులలో విశేషతారతమ్యమును గమనింపఁగలరు.

రాజనీతిని చేపట్టెదరా? అట్లయిన అగ్బరు నిజముగ గొప్పవాఁడే; (గ్రేటే) గాని యీతని చరిత్రమునుగుఱించి భారతీయులు విమర్శనము చేయవలసివచ్చునపుడు తమపత్

మున గూడ రాజనీతినే ప్రమాణముగాఁ గైకొనుటయుంచిది. అయితే అట్లు ఎవరును చేయుట లేదు. ఏసూత్రముల ననుసరించి దేశచరిత్రమునురచింపవలెనో ఆసూత్రములను మననము చేయుచు భారతదేశచరిత్రమును వ్రాసినపెద్దమనుష్యుఁడు ఇంతవఱకును బయలు దేఱలేదు.

సామ్రాజ్యపాలనమున అగ్బరురాజనీతిని అణుమాత్రమైనను విడిచియెఱుఁగుఁ డనుట మాకు సమ్మతమే; అయితే ఆతని రాజ్యతంత్రానుసరణమువలన భారతదేశమునకు ఘటిల్లిన దేమి? ఇదియే చర్చింపఁదగిన ప్రశ్న. మనవారు తెలిసియో తెలియకయో విడుచుచున్నది గూడ నిదియే.

కాని ఈప్రశ్నయొక్క ఘనతను, జటిలతను ఈగ్రంథమున చర్చించుటకువీలు లేదు. పృథివీరాజుభార్యయొక్క అణుమాత్ర చరిత్రమును ప్రకాశింపఁజేసిన ఈఘాదుపాహాయొక్క ఒక్క చెయిదమును ఈతని ముఖ్యగుణముయొక్క శతకోటికిరణములలో ఒక కిరణమును చూపుటకే ఇందు కొంచెము స్థలము గలదు. ఈవిషయమునగూడ కల్లెమును జారవిడిచి కలమును పోనిచ్చుటకు వీలు లేదు.

ఏచరిత్రమువలన అగ్బరుహృదయమున ఘనీభవించిన నైచ్యము ప్రకట మగుట కవకాశము గలిగినదో ఆయీపృథివీరాజు భార్య చరిత్రమును తొలుదొలుత ఆంధ్రుల కెఱుక పఱిచిన "అబలాసచ్చరిత్రరత్నమాల" యను గ్రంథమున, ఒక భారతీయస్త్రీ రచించిన చరిత్రమున రెండవ పేరాలో "అగ్బరుఘాదుపాహా యితరతురుష్కప్రభువులవలె తన ప్రజలను బాధింపక వారివారి ధర్మమును రక్షించుటచే సర్వధర్మ

సముఁడని ప్రసిద్ధుఁ డయ్యో” నని యొక వాక్యరత్నము స్వర్ణాక్షరములలోఁ బొదుగఁబడియున్నది. చాలింపుఁడు ఇంతటితో ఈవిషయమును వినవలసిన దింకను ముందు గలదు.

ఘనత వహించిన అగ్బరుపాదుషాహా ప్రతిసంవత్సరమును డిల్లీనగరమున “నౌరాజాఉర్సు” అను నొక గొప్ప యుత్సవమును జరిగించుచుండెను. హిందూముహమ్మదీయసమ్మేళనమును, సామాన్యభాషాసింహాపీఠమున హిందీభాషను స్థాపించుటయు భారతదేశోన్నతి కావశ్యకము లని బోధింపఁబడు ఈదినములలో ‘‘నౌరోజాఉర్సు’’ అను పదముయొక్క అర్థము ప్రజలకు సులభముగనే తెలియువచ్చును; గాని దానిని వివరింపకుండ విడిచిపెట్టుట గ్రంథకర్త యైనవానికి ధర్మము కాదేమో యని భీతి గలుగుచున్నది.

భారతాంగనలపట్ల అగ్బరును ఔరంగజేబునుగూడ సమానముగనే ప్రవర్తించిరి; గాని యొక భేదముమాత్రము గలదు. అగ్బరు మాయలమారి. ఔరంగజేబు దాఁగుడుమూఁతల కిష్టపడువాఁడు కాఁడు. ఇదియే భేదము. ఈభేద మెంత విపరీతఫలముల నొసఁగెనో గమనింపుఁడు. ఔరంగజేబు ఏభారతాంగనమీఁద కన్నువేసినను మొదట యుద్ధము తప్పినది గాదు. పర్యవసానమున కొన్ని ప్రయత్నములలో నెగ్గెను. కొన్నిటిలో పరిభూతుఁ డయ్యెను. అగ్బరు అట్లు గాదు. ఈతఁ డేరట్టును లేకుండఁగనే అనేకభారతాంగనలను దన యంతఃపురము జేర్చుకొనియెను. అంతేగాదు. ఆభారతాంగనల సోదరులను, మేనల్లుండ్రను, ఇంకను ఇట్టి దగ్గఱబంధువులనుగూడ లోపు చేసికొని వారిమీఁద తన రాజముద్రికను సగిలించెను. ఈ

తీరున ఈయిరువురుతురుష్కులును భారతీయులకు ఫలముమాత్రము సమానముగనే చూపినను భారతీయులు ఒకనిని నేటికిని నిందించుచున్నారు. ఒకనిని "గొప్పవాఁడు. మహానుభావుఁ" డని పొగడుచున్నారు. స్నేహమున విష మైనఁ ద్రాగింపవచ్చునన్నారు పెద్దలు. ఇదియే కాఁబోలు.

"నౌరోజాఉర్సు" అనునది అగ్బరు ప్రతిసంవత్సరమును జేయు ఒక గొప్ప యుత్సవము. ఇది అద్వితీయము. ప్రపంచములో అనేకవిధము లైన దేశము లున్నవి. అనేకవిధములైన జాతు లున్నవి. అనేకవిధములయిన సంఘము లున్నవి. అనేకవిధములైన సిద్ధాంతము లున్నవి. అనేకవిధములైన రుచులున్నవి. ఈయనేకత్వములోఁగూడ కొంచె మైన పోలికమాత్రము లేకున్నది లేదు. గొప్పవాఁ డయిన అగ్బరుచేఁ బ్రారంభింపఁబడిన యీనౌరోజా ఉర్సునకుమాత్రము అణుమాత్రసామ్యము గలదిగూడ ఎచ్చటను ఇదివరకు జరిగిపోయిన యేకాలమునందును లేదు. ఇఁకముందుగూడ ఉండునని తోఁచదు.

విశాలమయిన ఒక రహస్యప్రదేశమున అందఱును స్త్రీలు. లావణ్యవతులైన యువతులు. అచ్చట దుకాణము లుండును. విహారస్థానము లుండును; గాని అమ్మువారును స్త్రీలే. కొనువారును స్త్రీలే. అన్నిపనులకును స్త్రీలే. మగవాఁ డయిన వాఁ డెవఁడును—కన్నులు తెరువని పసిబిడ్డగూడ అక్కడకు రాఁగూడదు. ఆప్రాంతమునగూడనుండఁగూడదు. అటు చూడఁగూడదు. బహిరంగముగ దానినిగుఱించి మాట్లాడఁగూడదు. నిర్ణయ మేమో దానినిగుఱించి మనమున స్మరించుటగూడ దోష మే. స్త్రీయైనచో అందుల కెవ్వ తెయైన రావచ్చును. అందు

మంత్రులభార్య లుందురు. సేనాధిపతులభార్యలు ఉందురు. సర దారులభార్యలు, ఇతరోద్యోగుల పత్నులు, చెలికాండ్ర నెచ్చెలులు, వర్తకుల ప్రియురాండ్రు, ఆశ్రితుల అర్ధాంగులు అందగత్తెలైనచో నౌకరుల ఇల్లాండ్రుగూడనందు ప్రవేశింపవచ్చును. అంతేగాదు. ప్రవేశింపవలెను రాజపత్నులుగూడ యథేష్టముగ నందు విహరింతురు. అచ్చట తారతమ్యము లేదు. కలిగినంత వైభవము ననుభవించుట కచ్చట నెవ్వరికి నేవిధ మయిన యభ్యంతరమును లేదు. ధైర్య మున్నఁ జాలును. నిష్ఠురమైన ఆయుత్సవమున యెడ తెగని ఆవిద్యుత్ప్రవాహములో ఒక్క పురుషుఁడుమాత్రము అర్థతః స్త్రీవేషము దాల్చిన ఘనుఁడగు నొకఅగ్బరుమాత్రము ప్రవేశించును. ఆతనికెవరు నడ్డు చెప్పఁగూడదు. ఆతనికొఱకే ఆయుత్సవము ఏర్పడినపుడు ఇఁక చెప్పవలసిన దేమున్నది? దీని పేరే "నౌరోజాఉర్సు."

వేలకొలఁది స్త్రీలలో నొక పురుషుఁడు. అబ్బా! ఎంత యనౌచిత్యము నెఱుఁగని హృదయము! ప్రకృతిధర్మమును తెలిసియున్న పెద్దలు అనేకపురుషులలో నొక స్త్రీ యెట్లు ఉండఁ జాలదో అట్లే అనేకస్త్రీలలో ఒక్క పురుషుఁడు నిలువలేఁడని చెప్పెదరు. నిలుచుట రసాభాస మనిగూడ వచియింతురు; గాని అగ్బరున కట్టి యభ్యంతర మేమియు లేదు.

అగ్బరు అందు ప్రవేశించిన పిదప అక్కడ నేమి జరుగునో ఏపురుషునకుఁ దెలియును? దానిని వివరించి చెప్పుటకు మాకేమి యెఱుక? అంతయు పరమరహస్యము. రహస్యభేదము చేసినవారికి తల నిలువదు.

ఒక తురుష్క ప్రభువు నాదిరుషాహా యని ప్రఖ్యాతి గల పాదుషాహా భారతీయుల ననేకులను ఒక దొడ్డిలో త్రిప్పించుకొనిపోవుట కెట్టి యవకాశమును లేని యమక్రోడమునఁ జేర్చి తాను ఖడ్గహస్తుఁడై యందు ప్రవేశించి వీరవిహారము చేసెడువాఁడు. అక్బ రీయగ్బరు నీ "నౌరోజాఉత్సవము" ఆనంద మనుభవించెడివాఁడు; గాని యాతనికి దుర్మార్గుఁ డని యపఖ్యాతి వచ్చెను. ఈతనికి నీతిపరుఁ డని బిరుదము లభించి నది. చరిత్రకారుల ప్రతిభ యిట్లు వెలుఁగుచున్నది.

యథాపూర్వముగ పృథివీరాజు భార్య నౌరోజాఉత్సవములో ప్రవేశించి ఆనంద మనుభవింపసాగెను. స్త్రీలందఱును అతిచాకచక్యముతో నుండిరి. ఉత్సాహము వెల్లివిరిసిపోవుచుండెను. నవ్వులు, సకిలింతలు, పాటలు, నృత్యములు, ఆలింగనములుఁ, ప్రశంసలు, విజృంభించిపోవుచుండెను. పదమంజీరముల ఝుణఝుణలు, కరకంకణముల గణగణలు, మొలనూలుగంటల ధణధణలు, మిళితములై మృదంగధ్వనులతో వియ్య మందుచుండెను. మూతి విరువులు, ముక్కు కదుపులు, కంటితిరుగుడులు, చేతివిసరులు, కాలిచాపులు మేఱమీఱిపోవుచుండెను

ఇట్లు కొంతసేపు జరిగిన తరువాత అలసిపోయిన యువతులు ఒక్కరొక్కరుగ యింటిదారి బట్టిరి. చూచుచుండఁగా స్త్రీసంఘము తఱిగిపోయెను. "ఇఁక చాలు విహార" మని పృథివీరాజు భార్యగూడ బయలుదేఱెను.

బైట నున్న పాలకిని సమీపించుటకు ఆమె యతిరభసమున జనుచుండఁగా ఒక వివిక్తప్రదేశమున స్త్రీ యెదురుపడి "లావణ్యవతీ, రమణులయందెల్ల నీవు తలమానికమవు." అని

పలికెను. రాజపుత్రయువతి తొలుత నిర్విణ్ణయై అంతలో దిటవు తెచ్చుకొని "ఎవరు నీవు" అని గట్టిగా నడిగెను. అందులకు వ్యక్తి "నీసేవకుఁడు. నీయనుగ్రహము నాసించు పాదుషాహా" అని బదులు చెప్పి కాఁగిలించుకొనుటకు చేతులు చాపెను. తోడనే ఆమె "తుచ్ఛుఁడా, నిలువుము" అని క్రుద్ధభుజంగియై ఒడ్డాణముగా ధరించియున్న మడత కత్తిని దూసి విసరఁబోయెను. "నిలువుము" అని కెవ్వన కేక వేసి అంతట పాదుషాహా తుపాకికైన అందకుండఁ బాఱిపోయి తల నిలుపుకొనియెను.

పిదప నామె నిష్కంటకముగ నిలుచేరుకొనియెను.

# 18. రాణీసంయుక్త.

---

శాలివాహనశకము పండ్రెండవ శతాబ్దప్రారంభమున ఢిల్లీని అనంగపాలుఁ డను క్షత్రియుఁడు పాలించుచుండెను. ఆతని కిరువురు కొమార్తెలు మాత్రమే కలిగిరి. పెద్ద కొమార్తె యగు కమలాదేవిని అజమీరుసంస్థానాధీశ్వరుఁ డైన సోమేశ్వరునకును, రెండవకూతురును కన్యాకుబ్జాధీశ్వరుఁ డగు విజయపాలునకు నిచ్చి పెండ్లిచేసి అనంగపాలుఁ డంతరించెను. ఇందు పెద్దకూఁతురు కొడుకు పృథివీరాజు, చిన్నకూతురు కొడుకు జయచంద్రుడు.

అనంగపాలునకు పుత్రసంతానము లేకపోవుటవలన తన రాజ్యము నంతను పృథివీరాజున కిచ్చెను.దీనిమీఁద జయచంద్రునకు చాల కోపము వచ్చెను. ఈరూపమున పృథివీరాజును జయచంద్రుడును విరోధు లైరి.

చక్రవర్తి పృథివీరాజా? జయచంద్రుఁడా? ఎవరికివారే చక్రవర్తు లని భావించుకొనుచున్న యీయక్క సెల్లెండ్ర కొడుకుల కిరువురకును ఈవిషయమున చాల పట్టుదల యుండెను. తుదకు జయచంద్రుఁడును. తానే చక్రవర్తి నని ప్రకటించుటకు రాజసూయయాగమును దలపెట్టెను. ఆయజ్ఞమునందే నవలావణ్యవతియై యున్న తన యేకపుత్రిక యగు సంయుక్తకు స్వయంవరమునుగూడ చేయవలయుఁ నని యాతఁడు నిశ్చయించుకొనియెను.

యుక్తసమయమున రాజసూయయాగమునకు వలయు సాధనసామగ్రి యంతయు సమకూర్పఁబడెను. చుట్టములు, పక్కములు, సామంతులు, స్నేహితులు, ఆశ్రితులు మున్నగు వా రెల్లరును జనుదెంచిరి. వేదవేదాంగములయం దసామాన్యు లని విఖ్యాతి వడసి జయగంటలం గట్టుకొనిన విద్వత్ప్రకాండు లనేకు లాహూతులై వచ్చిచేరిరి. పట్టణ మంతయు జనసంకుల మైపోయెను. ముహూర్తము సమీపించెను. మంగళస్నానము గావించి ధర్మపత్నీద్వితీయుఁడై బ్రాహ్మణశ్రేష్ఠుల వేదఘోషములతో మిళితములై సామంతాదుల జయఘోషములు బ్రహ్మాండ మంతయు ప్రతిధ్వను లీనుచుండ జయచంద్రుఁడు యజ్ఞశాలను సమీపించెను.

పృథివీరాజు సన్నిహితజ్ఞాతిని చంపి జయచంద్రుని యాగమునకు విఘాతము కలిగించుట చూడ మాకు చాల నాశ్చర్యము గొలుపుచున్నది. ఇట్లు వ్రాయుటకు చరిత్రకారుల కేమి యాధారములు గలవో తెలియదు. మేమిది కేవల మబద్ధ మని చెప్పుటకు సాహసింపలేము; గాని యనేకపర్యాయములు తన ఘాటి కోర్వలేక పాఱిపోయిన జయచంద్రుని,యాగమును భగ్నముసేయఁ బృథివీరాజు ఇట్టి నీచపుఁబని కొడిగట్టుట కవసర మేమి వచ్చెనో యూహింపఁజాలకున్నాము. రాజుల నందఱను జయించి యెల్లరచేఁ గప్పములు గొనిగదా రాజసూయము సేయవలసినది? జయచంద్రుఁ డట్టి ప్రయత్నము లేవియుఁ జేసినట్లు గాన్పింపదు. జయచంద్రుని రాజసూయమును విచ్ఛిన్నము సేయుటకు పృథివీరాజు తన యఖండదోర్వీర్యమువలనను బూనుకొనవచ్చును. పూర్వవైరమును బురస్క

రించుకొనియు సిద్ధపడవచ్చును; గాని యుద్ధము సేసి దానిని, ధ్వంసము సేయవలయునే గాని మానాభిమానములు లేని సామాన్యజనులు చేయు నిట్టి కృత్యమును చేయుట పృథివీరాజునకు కలంకకారణ మని నిస్సందేహముగఁ జెప్పవచ్చును. లోకములో తను శత్రువుల యింట వివాహాదిశుభకార్యములు జరుగునపు డోర్వలేనివారు కొంద ఱాశౌచము పట్టుచు నెల్లరకును దెలియునట్లు ప్రతిస్థలమునందు జాటిచెప్పుచును, గంధపుబొట్లు పెట్టుకొనియు, దొంగవార్తల నంపుచును కార్యవిఘ్నమును గలిగించుట గలదు; గాని యట్టి పని పృథివీరాయని యంతవానికిఁ జేయఁదగినదియా?

ఎట్లయినను జయచంద్రుని యాగము విచ్ఛిన్నమైపోయినది. ఈపరాభవబాణము జయచంద్రుని నల్లగుండెకు తీవ్రముగ నాఁటెను. మఱల పృథివీరాజుపై జయచంద్రుఁడు కత్తిగట్టు నని ప్రజలు తలంచిరి. సైనికులు డిల్లీయజమానురుదండులపై గత్తులు నూరసాగిరి. ఈతడవ మాప్రతాపము సూడుఁ డని గ్రొత్తయోధులు మిత్రులచెంత ప్రగల్భమును కొట్టసాగిరి; గాని జయచంద్రుఁడు యుద్ధముమాట తలపెట్ట లేదు. ఆతఁడు యాగము విచ్ఛిన్నమైపోయినను కూతురుస్వయంవరమును మానఁదలంపలేదు. మఱియొక సుముహూర్తమున నది యథాప్రకారముగ జరుగునట్లుచాటించెను.

సంయుక్తాస్వయంవరదినము సమీపించెను. దేశదేశములనుండి యందగాండ్ర మని విఱ్ఱవీఁగు రాజపుత్రు లనేకులు మహేంద్రవైభవములతో వచ్చిచేరిరి. జయచంద్రుఁ డందఱకును స్వాగతము నొసఁగి యర్హానివేశనముల విడియించెను.

కన్యాకుబ్జపౌరు లెల్లరును పూర్వపుఁగల్లోలములను మఱచి మహోత్సాహముతో నుండిరి. పట్టణ మంతయు స్వర్గమువలె దేదీప్యమానమై జనసంకులమైపోయెను. పరస్పరవిరోధు లగుటం జేసి జయచంద్రుఁడు పృథివీరాజును బిలువలేదని గాని పృథివీరాజు రాలేదని గాని మేము వ్రాయవలసిన పని లేదు."

ఒకనాఁడు శుభముహూర్తమున స్వయంవరసభ కూర్పఁబడియెను. రాజపుత్రు లెల్లరును గంభీరవేషమును ధరించి ప్రత్యేకస్థలమునందలి యున్నతాసనములపై సదర్పముగఁ గూర్చుండియుండిరి. బంధుగులు, స్నేహితులు, ప్రేక్షకులు, మున్నగువారు నిర్దిష్టస్థలములయం దాసీనులైరి. జయచంద్రుఁడు పృథివీరాజునెడల దనకుఁ గల వైరమంతయు, దీరిపోవునట్లు ఆతని ప్రతిమ యొకటి చేయించి దానిని "ఢిల్లీశ్వరుఁడు నాద్వారపాలకునితోఁ దుల్యుఁడు" అను భావముతో ద్వారమున నిలిపెను. అది చూచి సభ్యు లనేకవిధభావములకు లోనైరి; గాని యేరును మాట్లాడలేదు. అంతటను గాంభీర్యము విరాజమాన మగుచుండెను.

అంతఁ బుష్పమాలికను జేఁబూని సఖీజనములు వెంటరా రూపొందిన సౌందర్యాధిదేవతవలె సంయుక్త సభాస్థలమునకువచ్చెను. నవలావణ్యవతియైకుసుమమాలికలను జేఁబూని గంధర్వరమణివలె నున్న సంయుక్త నారసి రాజపుత్రు లెల్లరును ముగ్ధులై పోయిరి. ప్రతిరాజపుత్రుండును సంయుక్త తప్పకుండ తన్నే వరించు నని గంపెఁడాశ పెట్టుకొనియుండెను. ఇందఱు రాజపుత్రులలో నీబంగరుబొమ్మ నలంకరింపఁగల రాజమణి యెవఁడా యని ప్రేక్షకు లెల్లరు నాలోచనాధీనులై యుండిరి.

జయచంద్రుఁడును డోలాయమానహృదయుఁడై యుండెను. శుద్ధాంతజనముగూడ నట్లే యుండెను. అంత రాజవర్ణమున సేయుటకు నియుక్త యగు చేటి యొక రాజకుమారుని చెంత కుఁ దీసికొనిపోవుటకు సంయుక్త చేయి పట్టుకొనియెను. అప్పుడు సంయుక్త హృదయమున నొక్కమాఱు మహాధైర్యప్ర వాహము వెల్లివిరిసిపోయెను; గాని వెంటనే తెప్పిరిలి సంయుక్త చేటిచేయి విడిపించుకొని మదపుటేనుఁగు గున్నవలె గంభీర గమనమునఁ బోయి ద్వారపాలకుని స్థలమునందున్న పృథివీ రాయని ప్రతిమమెడలో గుసుమదామమును గీలించెను.

వెంటనే సభయం దంతట నొక్క కోలాహలము ప్రారంభ మయ్యెను. అందఱు ననేకవిధములఁ జెప్పుకొనసాగిరి. సంయుక్త యాకోలాహలము నేమియు లక్ష్యము సేయక తిన్నగ శుద్ధాంతమునకుఁ బోయెను. స్వయంవర మిట్లగు నని యెవ్వరు ననుకొనలేదు. సంయుక్తతల్లి మందహాసవదనారవిం దయై తన యల్లుఁ డేరాజకుమారుఁడో తెలిసికొన నువ్విళ్లూ రుచు కన్నులు సంయుక్తమీఁదనే పెట్టుకొని యుండెను. తక్కిన స్త్రీలెల్లరును కరకంకణములైన ధ్వనిసేయకుండ పుత్త డిబొమ్మలవలె నిలిచియుండిరి. జయచంద్రుఁడు భావరహితము లగు చూపులతో రాజపుత్రుల నెల్లరును గలయఁజూచుచుం డెను. పాపము వారి యాశ లన్నియు నిట్లు భగ్నములైపో యెను. ఎల్లరును దెల్లవోయిరి. జయచంద్రుఁడు మహోగ్రుఁడై మండిపడుచు "దుశ్శీల యగు దీనినిఁ గారాగారమున బంధిం పుఁ" డని యఱచి లోనికిఁబోయెను. పాప మాతని కంతకంటె నవమానకరం బేమియున్నది? రూపరాశి యగు సంయుక్త

కొఱకు పుట్టెం డాశతో వచ్చి యామె స్వయంవరసభలోం బ్రవేశించినపు డనేకవిధము లగు శృంగారచేష్టలను గావించిన రాజకుమారు లెల్లరును నిర్విణ్ణులై నిరాశాసంతప్తచిత్తులై వెడలిపోయిరి. ప్రేక్షకు లనేకవిధములం జెప్పుకొనుచు నాస్థలము విడిచిపోయిరి. లోకుల నెవ రేమి సేయంగలరు?

సంయుక్త యట్లు రాణివాసమునకుం బోయిన పిదప శుద్ధాంతజన మంతయు వచ్చి యామెను జుట్టుకొనియెను. ఆమెను కొందఱు కసరుకొనిరి. కొందఱు నీకిట్టిది తగ దనిరి. కొంద ఱిది యేమి చిత్రమే యని సన్నసన్నముగం జెప్పసాగిరి. కొందఱు కోపపడిరి. ఆమెను హద్దుమీఱి చీవాట్లు పెట్టుటలోం గొందఱ కంఠములు బొంగురువోయెను. ఎవ్వరును రాజపుత్రిక యని సందేహింపలేదు. ఎవరికిం దోచినట్లు వారు నిందించిరి. బుగ్గలపైం బొడిచిరి. సిగ్గులేనిదానా యని యెత్తిపొడిచిరి. అందఱికంటె నధికముగం బుత్త్రికా ప్రేమను దిగమ్రింగి యామెతల్లి మండిపడియెను; గాని సంయుక్తయేమియు మాట్లాడలేదు. మఱల గుసగుసలు మెండయ్యెను. గుసగుసలు ప్రబలెను. సంయుక్త యేరికిని జవాబు చెప్పలేదు. మొగమెత్తి యేరినిం జూడలేదు.

కాలరుద్రునివలె గర్జించుచు నంతలో జయచంద్రుం డచ్చటకు వచ్చి సంయుక్తపైం జాలకోపపడియెను. నీకిట్టి బుద్ధి యేల పుట్టె ననియెను. మతిపోయెనా యని కసరుకొనెను. మాగౌరవ మంతయు మంటం గలిపితి వని తహతహపడియెను. మూడు మేమి చేసెదనో యని వండ్లు పిండిచేసికొనియెను. పాపము, కోపభరమ్మున జయచంద్రుని శరీర మాపాదమస్త

కము వచ్చుకిపోయెను; గాని సంయుక్త యేమియుఁ జలింపలేదు. అప్పుడుగూడఁ దన వరాలనోటు మాట్లాడలేదు. సంయుక్త మౌనమువలన జయచంద్రుని కోపము మఱింత వృద్ధి యయ్యెను. వెంటనే యాతఁ "డీతుచ్ఛురాలిని కైదులో వేయుఁ" డని యఱచెను.

ఆమాటయే రెట్టించిరెట్టించి పలుకుటవలన నది నిశ్చయ మైనదియే యని భావించి చెలికత్తెలు సంయుక్త చేయి పట్టుకొనిరి. అంత జయచంద్రుఁడు ముందు బయలుదేఱి కారాగారము దెస దారితీసెను. అప్పుడైనను సంయుక్త చలింపలేదు. వెంటనే యాక్రొత్తపెండ్లికూఁతురు కైదులో బంధింపఁబడియెను. అచ్చటి స్త్రీలలో నామె స్థితి నారసి "పాపమయ్యో" యని వగచినవారు ఒక్కరును లేరు. ఆహా! పెండ్లికూఁతు రని సకలోపచారములను జేయవలసిన యాస్త్రీసంఘ మప్పు డామెయెడల నెంతకాఠిన్యము వహించెను!

చుట్టములు గాని, పక్కములుగాని, తలిదండ్రులుగాని సంయుక్తభావ మేమో గ్రహింపఁగలిగి రని చెప్పుటకు వీలులేదు. చిన్నతనమునుండియు పెంచి పెద్దచేసిన దాదులును, అరమర యున నెట్టిదో యెఱుంగక చిన్నప్పటినుండియుఁ గలసిమెలసి తిరుగు చెలికత్తెలుగూడ గ్రహించిరో లేదో వారికే యెఱుక. చేష్టలనుబట్టి గ్రహించినవారు లేరనియే చెప్పవచ్చును. అయినను తలిదండ్రులకును చుట్టపక్కములకును చెలికత్తెలకునుగూడ వ్యతిరేకముగఁ బ్రవర్తించి కారాబద్ధయైన సంయుక్త ముందేమి చేయఁదలచికొనినదో?"

అట పృథివీరాజు తన యెడల జయచంద్రుఁడు గావించిన కృత్యమును విని మండిపోయెను; గాని సంయుక్త గావించినది విని పొంగిపోయెను. "జయచంద్రుఁ డంతటి సభలో నాకుఁ గావించిన యగౌరవమునకు నేనచ్చటకుఁ బోకుండఁగనే ప్రతీకారము జరిగిపోయినది. అల్లారుముద్దుగఁ బెంచుకొనిన యాతని గాదిలికూఁతురే తత్క్షణ మాదుశ్శీలుని మానమును నగ్నముగావించివైచినది. ఆహా! సంయుక్త యెట్టి సుగుణమణి" యని యాతఁ డామె ధైర్యసాహసాదులకు మెచ్చుకొనియెను; గాని యనుంగుబిడ్డయై యుండియు తన గౌరవమును మంటఁగలుపుటచే కోపోద్దీపితుఁడై దురభిమాని యగు జయచంద్రుఁడు సంయుక్తను, సభలోఁ బలికినట్లు కారాగారమున బంధింపకమానఁ డనియు, సహింపరాని బాధలు పెట్టకమానఁ డనియు నిశ్చయించుకొని ప్రాణములనైనఁ గూడ నాశవదులుకొని తన గౌరవమునకుఁ గలంక మొదవకుండ కాపాడిన యాకన్యాతిలకము నుద్ధరింపకున్నను, దనయెడల నతినీచముగ ప్రవర్తించిన జయచంద్రుని శిక్షింపకున్నను, తన ప్రాభవమునకును పౌరుషమునకును కలంకము గలుగక మాన దని తలంచి ముఖ్యముగా సంయుక్త పేరను త్వరపెట్ట వెంటనే ప్రయాణభేరిని మ్రోయింపించి యాకస్మికముగా కన్యాకుబ్జనగరసమీపమున విడిసెను.

ఈసమాచారము విని కన్యాకుబ్జపౌరులు చాల తల్లడిల్లిరి. జయచంద్రుని కోపాగ్ని మఱింత వృద్ధి యయ్యెను. అగుట నాతఁడు వెంటనే తన సైన్యమునందు చక్కని వ్యవస్థ నేర్పఱిచి సంయుక్త యున్న కారాగారమును గుఱించి వ్యయ

ముగ చాల జాగ్రత్త పుచ్చుకొనసాగెను. చిన్నటనాఁటనుండియు చెలికత్తెలై యుండియు చెఱసాలను గాపాడు స్త్రీలు పాపము ముద్దరా లగు సంయుక్త యెడల చాల కాఠిన్యమును చూపసాగిరి. "పృథివీరాజు వచ్చె నని నీవు మఱియు నక్కఱ లేదు. ఆతఁడు ప్రాణములతోఁ బోవునప్పుడు చూతములే" యని వారప్పుడప్పుడు సంయుక్తను మర్మోద్ఘాటనము సేయసాగిరి; గాని సంయుక్త యప్పుడుగూడ నేమియు మాట్లాడ లేదు. మనమున నించుకేనియు జంకు వహింపలేదు. పయింబయిగ పృథివీరాజు తన నాలింగించిన నాఁటఁ గోలె నామె మఱింత గాంభీర్యమును దాల్చెను. ఈలక్షణములను జూచి యెల్లరు నామెకు మతిపోయిన దని తలఁచిరి.

నాఁటిరాత్రి యిరుతెగలవారును సమరసన్నాహములోఁ బ్రవేశించిరి. జయచంద్రుఁడు పృథివీరాజు నెదిరించుటకు కవాంకంఠీరుఁ డను సేనాధీశుని యాధిపత్యముక్రింద మూఁడువేల సైన్యము నేర్పాటు గావించి యుంచి దుర్గమునందు చాల కట్టుదిట్టములు గావించెను. బురుజు లన్నియు ఫిరంగీలతో నింపివేయించెను. ప్రాకారములయం దెల్లయెడల సైనికులను నిలిపెను. కొందఱు సేనాధిపతుల కోటలోపలను వెలుపలను నిలిపిన సైనికులను పరీక్షించుట కాయంధకారపరీత మగు నిశీథసమయమున నశ్వారూఢులై పటాక్షేపముతో నటునిటు సంచరింపసాగిరి.

సంయుక్తకీసంగతి యెట్లో తెలియవచ్చెను వెంటనే సంయుక్తయు నిరువురు చెలికత్తెలును పురుషవేషములను దాల్చి గుఱ్ఱముల నెక్కి సేనాపరీక్ష గావించు సేనానులవలె

నటించుచు దుర్గమును దాఁటి పృథివీరాయుని సేనానివేశము దెసకు గుఱ్ఱముల నుఱుకించిరి. వారి నెవ్వరును జూడలేదు. చెఱసాలలో దాసీలు సంయుక్తకుఁ గలిగించిన వన్నియు తమపై రాజునకు విశ్వాసము గలుగుటకై కల్పించిన కృత్రిమ బాధలే కాఁబోలు. ఔరా! స్త్రీల చాతుర్యము! పృథివీరాజు సంయుక్తరాక కెంతయు నలరి యామె సాహసము నెంతయు మెచ్చుకొని యామె నప్పుడే గాంధర్వవిధిం బరిణయ మయ్యెను.

ఈవివాహావిధానము భారతధర్మశాస్త్రమునకు కేవలము వ్యతిరేకముగ నున్నది. పృథివీరాజు జయచంద్రు లక్కచెల్లెండ్ర కుమారు లగుటం జేసి సంయుక్త పృథివీరాజునకు కూఁతురు. ఇట్టి సంబంధమును భారతీయుఁడైనవాఁ డెవ్వఁడును జేసికొనకపోవుటయే గాక యిట్టిది జరిగె నని వినినచో చాల కంటగించుకొనకుండ నుండఁజాలఁడు. అట్టియెడల సంయుక్త పృథివీరాయునిఁ బ్రేమించుటయు, నాతఁ డామెప్రేమ నంగీకరించుటయుఁ జూడఁ జాల నాశ్చర్యముగ నున్నది. అప్పటివా రెవరైన దీనినిగుఱించి యాక్షేపణలు చేసిరో లేదో చెప్పుటకు చరిత్రములయం దాధారములు కాన్పింపవు. చరిత్రకారులు గూడ దానిని జారవిడిచిరే గాని యాక్షేపించియుండ లేదు. ఇట్టి వివాహములు భారతీయేతరులయందు జరుగుచున్నట్లు విందుము. భారతధర్మశాస్త్రమునందు కొన్నివావులును, విశేషించి కొందఱు బంధువులకన్యలను వివాహములయందు స్వీకర్తవ్యలు గారని నిషేధము లేర్పడియున్నవి. మేనఱికమును జేసికొనుటకుఁగూడ కొందఱ అంగీకరింపరు. భారతీయ

వివాహములలో శాస్త్రమునకును లోకమునకునుగూడ విరుద్ధముగ జరిగినది సుప్రసిద్ధ మగు ద్రౌపదీపరిణయ మొకటి కాన్పించుచున్నది. అయినను దానిని గొన్ని కారణములు చూపి వ్యాసభగవానుఁడు విశేషవిధిగా సమర్థించియున్నాఁడు. ఈసంయుక్తాపరిణయమునుగూడ నెవరైన కారణములు సూపి విశేషవిధిగా సమర్థింపఁగలరా? దీనిని కేవలాక్రమవివాహముల లోఁ బరిగణించుటకు మా కనుజ్ఞ నొసంగెదరా!

సంయుక్త రాకయు నీవివాహవృత్తాంతమును గూడ సంయుక్త చెలికత్తెలకుఁదక్క, ఢిల్లీసేనానివేశమున సైత మెవ్వరికినిఁ దెలియదు; గాని కొంతతడవున కెట్లో సంయుక్త సఖీసమేతయై చెఱనుండి తప్పించుకొని పృథివీరాయనిఁ జేరె నని జయచంద్రునకుఁ దెలియవచ్చెను. అప్పు డాతనికిఁ గలిగిన కోపమును, దుర్గమునం దంతటను బొడమిన కలవరమును మేము వివరముగ వర్ణింపఁజాలము. వెంటనే జయచంద్రుని యనుజ్ఞనంది సంయుక్తాపృథివీరాయలను బట్టితెచ్చుటకు కమారకంఠీరుఁడు తన మూఁడువేల సైన్యముతో రహస్యముగ బయలుదేఱెను.

కాని యంతకుము న్నిట్టిది సంభవింపవచ్చు నని కన్యాకుబ్జనగరమునకును తన శిబిరములకును నడుమ గల యంధకారపరీత మగు విశాలప్రదేశమున పృథివీరాజు తన భటుల నటనట నుంచుటం జేసి కమారకంఠీరుని రహస్యము దాగినది గాదు. ఢిల్లీభటులు వారిని జూచుటతోడనే సంకేతానుసారముగఁ గాహాళముల నూఁదిరి. దిక్కుహరములు ముఖరితములు సేయు నాబాకాధ్వనుల నాలకించి యంతకుముందే సమరస

న్నాహాములతో నున్న ఢిల్లీసైనికులు బారులు దీరి ముందు నకు నడచిరి. దాని కాతతాయి యనునతఁడు నాయకుఁడై యుండెను. పృథివీరాజుగూడ సంయుక్త చెంత సెలవు గైకొని హారహారా యని యుద్ధరంగమున కుఱికెను.

అంత భేరీభాంకరణంబులును, సింహనాదంబులును మిన్నుముట్ట యుద్ధము ప్రారంభ మయ్యెను. వీరు కాల్బంటు లు వీరు రాహుత్తులు నను లెక్కసేయక సంకులసమరము ప్రా రంభించిరి. మత్తగజములు నడగొండలవలె ఘీంకారములు సేయుచు నెదుటివారి నెల్లరిని త్రొక్కి చంపుచుండెను. ఎం దఱో యోధుల యుత్తమాంగములు బంతులవలె నెగిరిపోవు చుండెను.

అప్పుడు కమారకంఠీరుఁడు నాతతాయియు ద్వంద్వ యుద్ధమునకుఁ దలపడిరి. నాగాయుతబలులును, బలస్వరము తు ల్యులు నగు వారిపో రెంతయు ఘోరం బయ్యు నెంతో దర్శనీయముగ నుండెను. వారి భూ9భ౦గములును. సింహనాద ములును, బరివర్తనములును, లంఘనములును, బంతములును మిగుల హృదయంగమములై యుండెను. అంతకంతకు వారికి శౌర్య మెక్కుడయ్యెను. ఆసందర్భమున నతిలాఘవముగ నా తతాయిని దన ఖడ్గ భుజాంగికి బలియిచ్చి కమారకంఠీరుఁడు విజయానందంబునఁ బేర్చియార్చుచు ఢిల్లీసైన్యము నుకుమా డఁ జొచ్చెను.

అంతఁ దమనాయకునిపాటును, పరనాయకుని పోటును జూచి రిచ్చవడి ఢిల్లీసైనికులు వెన్నిచ్చి పాఱిపోఁజొచ్చిరి. అది చూచి సహింపఁజాలక పృథివీరాజు తన సైనికుల నోవకుఁ

డోడకుఁ డని హెచ్చరించుచు జిచ్చుఱపిడుగునవలె కహారకంఠీరునిపై నురికెను. వారిరువురు నట్లు చాలకాలము పోరిన పిదప పృథివీరాజు హుంకరించి తన ఖడ్గమును కహారకంఠీరునిపై విసరెను; గాని యాయేటు తప్పిపోయెను. మఱల పృథివీరాజు సన్నద్ధుం డగునంతలో కహారకంఠీరుఁడు విజృంభించి ఢిల్లీశ్వరునిపైఁ జంద్రహాస మెత్తెను. ఒక్క రెప్పపాటు కాలములో పృథివీరాయనిశిర స్సాసంగ్రామరంగమునంబడి దొర్లుచుండవలసినదియే; గాని యంతలో వెనుకనుండి యొక వీరుఁడు సనుదెంచి కహారకంఠీరుని పరలోకమున కంపివేసెను. ఢిల్లీశ్వరున కపాయము తప్పిపోయెను.

ఆకస్మికముగా కహారకంఠీరుఁడు కూలుటచే రిచ్చపడి ఢిల్లీశ్వరుఁ డెదుట నున్న వీరునిఁ జూచి యాశ్చర్యపడెను అది చూచి యావీరుఁడు "రాజా! ఆశ్చర్యమున కిది యదను గాదు. ముందునకుఱుకుము. అహితుల నఱుకుము" అని హెచ్చరించుచుఁ గన్యాకుబ్జసైనికులపైఁబడి యద్భుతముగ వీరవిహారము సేయఁదొడఁగెను. అప్పటికిని పృథివీరా జాతనిం గుర్తింపలేకపోయెను. అయిన నిప్పు డాతనిం గుఱించి యోచించుచుం గూరుచుండిన ముప్పు వాటిల్లు నని తలంచి యాతని వెంటనే వైరివీరుల నురుమాడఁజొచ్చెను. ఇది చూచి ఢిల్లీసైనికులు మఱింత యుత్సాహముతోఁ బోరసాగిరి.

క్రొత్తవీరునిఖడ్గమునకును, ఢిల్లీశ్వరుని చంద్రహాసమునకును వైరియోధు లెందఱు బలియైరో లెక్కలేదు. ఒక నిముసములోఁ గహారకంఠీరుఁడు కూలినవార్త యెల్లెడల వ్యాపించెను. ఇది వినియుఁ గ్రొత్తవీరుని యౌద్ధత్యమునకును,

ఢిల్లీశ్వరుని ధాటికు నోర్వఁజాలకయు, దమవారు స్వల్పముగను, బరు లధికముగ నుండుటం జూచియు, నిఁకఁ గార్యము లేదని జయచంద్రునిభటులు వెన్నిచ్చి పాఱఁదొడఁగిరి. అయినను విడువక పృథివీరాజు నాతనిభటులు కన్యాకుబ్జయోధులను దఱిమిదఱిమి కసిమసంగఁ జొచ్చిరి. అపుడు క్రొత్తయోధుఁడు దయార్ద్రహృదయుఁడై "రాజా! నీకు విజయము లభించె; పాఱుపోతుల జెనకకు" మని యెలుగెత్తి పిలిచెను. అది విని యాతని పైఁగల సాదృశ్యం బగు గౌరవమువలన మాఱువలు కనోడి సేనలను మఱలించుకొని పృథివీరాజు ఆతనితోఁగూడ శిబిరమునకుఁ బోయెను.

శిబిరముఁ జేరిన పిదపఁ గూడ పృథివీరాజు క్రొత్త వీరుని గుఱుతింపలేకపోయెను. ముఖమునఁ బొంగి పొరలిపోవుచున్న లావణ్యమును, విశాలనయనములయం దుచ్చలితం బగుచున్న తారళ్యమును కలికిపలుకులయందు తరంగిత మగుచున్న మాధుర్యమును జూచి యరసాక్షి పృథివీరాజు మున్నెప్పుడో యొకప్పు డాతనితో జాలతడవు మాట్లాడి యున్నట్లు నుమానించుచు నడుగుట గౌరవము గాదనియు, కొంత తడవేదో ముచ్చటించుచుఁ గూర్చుండిన దెలియకపో వనియుఁ దలఁచి యాతని యెదుటఁ గూరుచుండఁ బెట్టుకొని యాతఁడు తనకు గావించిన మహోపకారమునకు కృతజ్ఞతఁ జూపఁదొడఁగెను. క్రొత్తవీరుఁడు రాజు ఇంకను తన్ను గుర్తింపలేనందులకు ముసిముసి నగవులు నగుచు నల్లనల్లన నగునట్లు ప్రత్యుత్తర మిచ్చుచుండెను. ఎంతకును రాజు కృతార్థుఁడు కాలేక "నాజ్ఞాపకశక్తి యిట్లు మందమైపోయిన దేల?" యని చాల

తొట్రుపడసాగెను. ఇఁకఁ దన్ను గుర్తించుట రాజువలనఁ గాదని తలఁచి వీరుఁ డాపటకుటీర మంతయు మెరసిపోవునట్లు విద్యుత్కటాక్షముల నంతయు నొక్కమాఱు నెఱపి మోము వంచి యూరకుండెను. అంత దరహాసితవదనులై సంయుక్త చెలికత్తె లిరువురును మదనుని పూవుటమ్ములవలె క్షణములో వచ్చి వీరుని భుజములపైఁ జేతుల నానుకొని యిరుదెసల నిలుచుండిరి. అప్పుడు రాజహృదయ మొక్కమాఱు కలఁగిపోయెను. వెంటనే యాతఁడు వీరుని చేయి పట్టుకొని ముఖము దెస గంభీరముగఁ జూచి "సంయుక్తా" యని పిలిచెను.

ఇఁక వీరుఁ డటుఁ గూరుచుండఁజాలక తటాలున రాజుచేయి విడిపించుకొని యడుగులు తడబడ శరవేగమున మఱియొక పటకుటీరమునకుఁ బోయెను. చెలికత్తె లంత సిగ్గందులకేమని రాజుదెసకుఁ జూచిరి. వెంటనే రాజు "సంయుక్తా" యని పిలుచుచు నామె యున్న పటకుటీరమునకుఁ బోయి యెంత వెనుకకుఁ బోఁబోవుచున్నను వదలక యామె చేయి పట్టుకొని తీసికొనివచ్చి యంకతలమునఁ గూర్చుండఁబెట్టుకొని ప్రియమారఁ గౌఁగిలించుకొని మోము ముద్దాడి "దేవీ, నాఁడు మానము నిలిపితివి. నేఁడు ప్రాణము నిలిపితి" వని యనేకవిధములఁ గొనియాడఁ దొడఁగెను. వీరుఁడు సంయుక్త యని పాఠకులకుఁ దెలుపనక్కఱలేదు. రాజిట్లు చేయుట వలన సంయుక్త కెక్కడలేని సిగ్గును వచ్చెను. పాపమాముద్దరాలి నాల్క యుక్కిరిబిక్కిరి గావించివైచెను. అక్కతన నామె యేమియు మాట్లాడఁజాలక మోమువంచుకొని రాజ దృఢాలింగనమునఁ గరఁగిపోవుచుఁ గూర్చుండియుండెను.

చెఱనుండి తప్పించుకొని పురుషవేషముతో నధిరోహించి నిశీథసమయమునఁ గావలివాండ్రను వంచించి వెదకుకొనుచు వచ్చి రాయని గాంధర్వవిధిం బరిణయ మైనప్పుడును, మఱల బురుషవేషము దాల్చి పృథివీరాయనిఁ గాపాడి వైరి వీరులను వేటాడినప్పుడును లేని యింతటి లజ్జ సంయుక్త కిప్పుడేల? అది యేమో స్త్రీలకే తెలియవలెను. సమయము వచ్చినపు డబల లెంతెంతపనుల నైనఁ గావింతురు; గాని పిదపఁ బురుషులను జూడవలసివచ్చినపు డెంతో సిగ్గుపడెదరు. ఇది లోకములో జరుగుచున్న యాచారము. దీనికి హేతు వేమో చెప్పఁజాలము. పురుషు లైనచో నుత్కృష్టకార్యములను నిర్వహించివచ్చి తఱుచుగఁ బెద్దపెద్ద సభలలో ప్రగల్భములు గొట్టెదరు. స్త్రీ లట్లేల సిగ్గుపడెదరో! స్త్రీలకు సిగ్గుపడుటయే ప్రగల్భములు గొట్టుటవంటిదా?

ఈయుద్ధమున పృథివీరాజునకు సంపూర్ణవిజయముగలిగెను. అట జయచంద్రుఁడు ఢిల్లీశ్వరునిమీఁదికి మఱల సైన్యము నంపక యూరకుండు కోట ముట్టడించె నేని గాచుకొందమని యూరకుండెను; గాని రాజుమాత్రము దుర్గమును ముట్టడింపలేదు. దాఁదగిన వస్తువు చేఁజిక్కె ననియు, కాఁదగిన పని యైపోయిన దనియుఁ దలంచి యూరకుండెనో, తన మొకలను రాజు నెపలను జాల నగౌరవమును దీనిసాహసమును జూపినను జయచంద్రుఁడు కన్యతండ్రి యగుటచేఁ బుత్త్రికాసహజంబగు ప్రేమంబునఁ గోటను ముట్టడింపమాను మని సంయుక్త ప్రార్థించెనో గాని కన్యాశుల్కదుర్గమును బట్టుటకుఁ బ్రయత్నింపక రాజు సైన్యమును మఱలించుకొని సంయుక్తాసమేతుఁడై ఢిల్లీ చేరుకొనెను.

అన్ని యుద్ధములయందును పరాభవమే జరుగుచుం డుటవలన జయచంద్రుని యసూయ పెరిగిపోఁజొచ్చెను. కన్న కూఁతురుగూడ శత్రువులలోఁ జేరుటవలన నాతని హృదయము దగ్ధమైపోయెను. అగుట నాతఁడు "ఢిల్లీ యజమాను కన్యాకుబ్జములను పృథివీరాజైన నేలవలెను. నేనైన నేలవలెను. లేకున్న మఱియొకఁడైన నేలవలెను; గాని నా కంఠములోఁ బ్రాణములుండఁగా పృథివీరాజునకు విశ్రాంతియొదవనీ"నని యాతఁడు చెప్పసాగెను.

సంయుక్తను ఢిల్లీకిఁ గొనిపోయిన పిదప పృథివీరాజునకు భోగపరాయణత హెచ్చిపోయెను. ఆతఁడు తఱుచుగ నంతఃపురమునందు ఉండిపోవుటయే గాక పేరుమోసిన సేనానులు మున్నగువారిని కారణాభాసములను పురస్కరించుకొని దండింపఁజొచ్చెను. శిక్షితులైనవారిలో నొకఁడు అస్త్రసన్యాసము గావించెను. ఒకఁడు "నీపనిఁ బట్టించెదఁ జూడు" మని మహామ్మదుగోరీని దీసికొనివచ్చుటకు గజినీపట్టణమునకుఁ బోయెను.

ఇట జయచంద్రుఁడుగూడ తక్కిన సన్నాహము లన్ని యుఁ బూర్తి చేసికొని గోరీకి వర్తమానము చేసెను. భారత సామ్రాజ్యమునకు అవసానము సమీపించెను. ఉభయవాహినులును స్థానేశ్వరమువద్ద తలపడిరి. చాలకాలము సంకుల సమరము జరిగిన పిదప గోరీ పృథివీరాజును చెఱపట్టి కంఠ పీకించివేసెను.

ఈవార్త విని అట ఢిల్లీలో సంయుక్త మున్నగు అంతఃపురస్త్రీ లెల్లరును అగ్నిలో నుఱికి ప్రాణములను బాసిరి.

# 19. గనోరురాణి.

---

భారతదేశముయొక్క మధ్యభాగమున గనోరు అను నొక చిన్నసంస్థానము ఉండెను. తురుష్కుల కాలములో నది చాల దెబ్బలుతినెను; గాని స్వాతంత్ర్యమును గోల్పోలేదు. మొగలులు ఢిల్లీలో ప్రవేశించిన తరువాత ప్రధానులు నిలువనీడలేక చెల్లాచెదరై దేశమందంతటను ప్రాకిపోయిరి. అందొక సరదారుఁడు పెద్ద సైన్యమును వెంట నిడుకొని వచ్చి గనోరును ముట్టడించెను.

రాజ్యములేనివాఁడు రాజ్యసంపాదనమునకు దండెత్తి రాఁగా రాజ్యము గలవాఁడు రాజ్యరక్షణమునకు ఎదురొత్తి నిలువవలసివచ్చెను. సహజము ఈతురుష్కసరదారునకు గనోరురాజుతో నెట్టి స్పర్థయు లేదు. అయినను తీరని రాజ్యతృష్ణ యొక్కటే యాతని జైత్రయాత్రకు కారణము.

ప్రపంచప్రవృత్తికి సరియైన వ్యాఖ్యానము చేసినవారిదివఱకెవరైన నున్నారా? కల్లోలభరితమగు ఈసాగర మెవరికినిగూడ స్వాధీనము గాదని మా నమ్మకము.

అతనికి నితనికి నేమియు సంబంధము లేదు. పూర్వార్జితమగు రాజ్యమును యుక్తరీతుల నాతఁ డేలుకొనుచుండఁగా నడుమ నితఁ డేల రావలెను? అడుగవద్దు. ఇది తేలుపడి గాదు. ఈప్రశ్నకు నీవు సమాధానమును కోరుదు వేని "ఆరాజ్యము సంపాదించిన మూలపురుషుఁడుగూడ నావంటివాఁడే కాఁడా? అతఁ డేల పరరాజ్యమును హరింపవలెను? ప్రపంచము

లోని జను లందఱకంటె నీతని యాధిక్య మేమి? అభ్యున్నతి కొఱకు ప్రయత్నింపవద్దనిన నెవఁడు మానును? ఒకని వస్తువును ఆశించుట నాకు పాప మనిన ఒకనిమీఁద నధికారము చేయుటకు ఆతని కేమి హక్కు గలదు?" అని యెదురు ప్రశ్నని న్నుక్కిరిబిక్కిరి చేయును.

పోరు ప్రారంభ మయ్యెను. "నేను రాజ్యహీనుఁడనై యుండవలసినదేనా?" యని తురుష్కుఁడు భావించెను. "నా రాజ్యమును కోరుటకు వీఁడెవఁడు?" అని భారతీయుఁడు భావించెను; గాని యీతని రాజ్యసంపాదనమునకును, ఆతని రాజ్యరక్షణమునకును గూడ ముఖ్యులెవరో ఆసైనికులు "మన కనుభోగము లేని యీపనికై ప్రాణాశ నేల విడుచుకోవలెను?" అని యోచింపఁజాలరైరి. అందఱు వీరభటులు సాయపడకున్న రాజ్యమును స్థాపించుటకు ప్రయత్నించుచున్న యీసరదారుఁడు వారిలో నొకనికంటె నేవిషయమున గొప్పవాఁడు? ఈతనికిఁ గలిగిన రాజ్యతృష్ణ వారిలో నొక్కొక్కనికే యేల కలుగలేదు.?

ఇదియే యవిద్య. దీనినే మాయ యని పెద్దలు పిలిచిరి. ఈమాయావరణమే లేకున్న ఈప్రపంచమును పట్టుట కెవనికి శక్య మగును.?

దినములు గడిచెను. వారములు గడిచెను; గాని పర్యవసానము అంతలో దేలునట్లు తోఁచలేదు. ఉభయపక్షముల వారునుగూడ చాల పట్టుదలతోఁ బోరు సాగించిరి.

విజయనిర్ణయము క్లిష్టమై యున్నంతకాలమును ఉభయులునుగూడ సమానస్థితియందే యుండిరి; గాని భారతీ

యుల దౌర్భాగ్యదశ యింకను పూర్తి గానందున తురుష్కుని తోడి ద్వంద్వయుద్ధమున రాజు వీరస్వర్గమునకు ప్రయాణము కట్టెను. యవనులు విజృంభించిరి.

రాజు మరణము, వైరుల విజృంభణము నొక్కమాఱు రాణి చెవులఁ బడెను. సుక్షత్రియవంశమునఁ బుట్టిన వీరవనిత; గావున మృతిఁ జెందిన భర్తను దలఁచికొని వగచుట కామె కవకాశము లేదు. వెంటనే యామె మఱికొంత సైన్యమును వెంటనిడుకొని యుద్ధరంగమున నుఱికెను.

తురుష్కునకు మఱల విజయాశ నాదవ్వుల నిలిచెను. రాజు శౌర్యమే ఆశ్చర్యమైన రాణిశౌర్యము మఱింత వింత గొలిపెను. "ఇట్టి వీరవనితను చెట్టబట్టినవాఁడే వీరుఁడు" అని తలఁచి యాతఁడు మఱల యథాప్రకారము పోరసాగెను.

రాణి తన శక్తి సంతను వినియోగించెను. ఆమె సాహసమును గాంచి సైనికులు శక్తికి మించి పనిచేసెను. అయినను అయిదుకోటలు శత్రువుల స్వాధీన మయ్యెను. ఈస్థితి వచ్చున ప్పటికి రాణికి నిలుచుట కష్ట మయ్యెను. తోడనే యామె సైనికులను ప్రబోధించి నర్మదాతీరమున నున్న కోటలోనికిఁ బోయెను.

క్షత్రియసైన్యము వెంటనే తురుష్కులుగూడ ఏరు దాఁటి బయలుదేఱిరి. ఇంకను తన సైన్యము కొంత బైట యుండఁగనే రాణి శత్రువులు ప్రవేశింపకుండ కోట తలుపులు మూయించుకొనవలసివచ్చెను. అంతట బయట నిస్సహాయులై యున్న క్షత్రియవీరులను తురుష్కులు తండోపతండములుగ వచ్చి చిత్రవధల పాలుజేసిరి.

మాఱల పోరు ప్రారంభ మయ్యెను; గాని కోటలో నున్న సైనికుల సంఖ్య చాల స్వల్ప మగుటచే తురుష్కుల నాపుట కష్ట మయ్యెను. మ్లేచ్ఛులు నిరంకుశులై నిచ్చెనలు వేసికొని కోటలోఁ బ్రవేశింపసాగిరి. ఇది చూచి రాణి ఇఁక జయ మటు లుండ స్వరక్షణముగూడ దుర్ఘట మని తలఁచి "కోట మీ స్వాధీనము చేసెదను. యుద్ధము విరమింపుఁడు" అని వర్తమానము చేసి కోట తలుపులు తెఱపించివేసెను. తురుష్కుఁడందులకు పరమానందభరితుఁడై "మీశౌర్యసాహసములు అనుపమానములు పురుషులలోఁగూడ నిట్టివారిని నేను చూడలేదు. మీసౌందర్యము మీశౌర్యసాహసములకుఁ దగియున్నది. వయస్సున చాల చిన్నలై యున్న మీరు రాజ్యహీనులై యుండుట నాకిష్టము లేదు; గావున మీ రెప్పటివలె రాణివై యుండుటకును, మీసేనఁజేయు భాగ్యమును నాకుఁ గలిగించుటకును నేను ప్రార్థించుచున్నాను." అని మఱల వర్తమానము చేసెను.

ప్రతిభాశాలిని యగు రాణి తురుష్కుని భావమును లెస్సగా గ్రహించి "నాస్వల్పశౌర్యమును, స్వల్పసౌందర్యమును జూచి తమరు నన్ను మోహించుట నాభాగ్యము. యుద్ధరంగమున నేను మీముఖమండలమును చూచిన క్షణముననే పరవశ నైతిని; గాని యీస్వల్పసౌందర్యవతి నానవమన్మథుఁ డంగీకరించునా? యని సందేహించి యూరకుంటిని. లేకున్న నేనే ముందుగ తమకు మోహలేఖ నంపియుందును. ఇప్పు డైనను మించినది లేదు. ఈశ్వరుని కృపవలన మన యుభయుల వాంఛయు నొకటియై నెఱవేఱనున్నందులకు ఆనందముగా

నున్నది. అయిన నొకవిషయమును తనుకు విన్నవింపనిండు. తమరు నారాజ్యమును జయించుకొని యున్నారు. నన్ను గూడ స్వాధీనము చేసికొనియున్నారు. అట్టి వీరచక్రవర్తు లగు తమరు నన్ను వివాహము చేసికొనుట సంభవించినపుడు గొప్ప సన్నాహములు లేకుండ జరుగుట నాకిష్టము లేదు. కొంచెము—కొన్ని దినములు మాత్రము తాళియుందు రేని దేవేంద్రవైభవమునకుఁ దగిన సన్నాహములు చేయించెదను" అని రాణి వర్తమాన మంపఁగా తురుష్కుఁ డానందపరవశుఁడై పోయెను.

లగ్నదినము సమీపించెను. లగ్నము గూడ సమీపమునకు వచ్చెను. తురుష్క భటు లందఱును మదిరాపానమువలన ఒడలు తెలియక క్రిందనుమీఁదను బడుచుండిరి. ఇట్లుండఁగా రాణివద్దనుండి తురుష్కసరదారునకు వెలగల రత్నాంబరములు వచ్చెను. "ఇవి మధుపర్కములు. వీనిని ధరించి తాము దయచేయవలె" నని రాణిగారి భటులు చెప్పిరి. సరదారుఁడు అట్లే చేసి యేనుఁగు నెక్కి వచ్చి రాణి యున్న భవనమునఁ బ్రవేశించెను.

రాణి యొక విశాలభవనమున ఒక మంచముమీఁదఁ గూర్చుండియుండెను. ఆమె ప్రక్కల దాసీసుందరులు ఒక్కొక్కతె ఒక్కొక దివిటీపుచ్చుకొని ఒక్కొక్కమంచముమీఁదఁ గూర్చుండియుండెను. రాణి మంచమున కెదుట అయిదారుగజముల దూరమున నొక మంచము అలంకరింపఁబడియుండెను. భటులు సరదారుని దెచ్చి దానిమీఁద కూర్చుండఁబెట్టిరి. రాణి సిగ్గునఁబోలె తలవంచికొని మందహాసము

చేయుచుఁ గూర్చుండియుండెను. దాసీ లందఱును సరదారు నకు స్వాగత మిచ్చి సంతోషపరవశునిఁ గావించిరి. కొందఱు తురుష్కభటులు సరదారు ప్రక్కల నిలిచియుండి తమ యజ మానుని పెండ్లి యైన వెంటనే అచ్చరలను తలదన్నుచున్న యీదాసీసుందరులలో నొక్కొక్కతె నొక్కొక్కఁడు పెండ్లి యాడఁ దలఁచియుండిరి.

మొత్తముమీఁద తురుష్కు లందఱును భావనాప్రపం చమున మునిఁగియుండిరి. ఇంతలో సరదారునకు వికారములు ప్రారంభ మయ్యెను. ఒడలు మంట. కండ్లు పోటు. నాలుక లోపలకు లాగుకొనిపోవుట. ఈస్థితి సంభవించిన వెంటనే రాణి లేచి నిలిచి "క్రూరుఁడా, నాభర్తను, జంపి నారాజ్యమును హరించుటయే నన్ను జెఱుఁపఁదలఁచినందులకు నీకిది ప్రాయ శ్చిత్తము. నీవు తొడుగుకొనిన దుస్తులు విషలిప్తములు. భగ వంతుఁడు నాయెడలఁగలఁడు. రాజ్యముపోయినందులకు వగ చుట లేదు. నాశీలము చెడకుండ నేను నాభర్త చరణసన్నిధికిఁ బోవుచున్నా" నని పలికి ఆభవనము నర్మద యొడ్డు మీఁద నున్నది; గావున కిటికీలోనుండి నదిలో నుఱికి పరలోకమునకుఁ బోయెను. తమ సరదారు ఇట్లగుటయు, రాణి యట్లగుటయు, చూచి తురుష్కభటులు తమ్ముచూచి వెక్కిరించుచున్న దాసీ సుందరులమీఁద నుఱికిరి; గాని వారు తురుష్కుల కదలికను చూచి వారు తమ్ము సమీపింపకపూర్వమే చేత నున్న దివిటీ లతో మంచములక్రింద నున్న తుపాకిమందును ముట్టించిరి.

చూచుచుండఁగా అంతయు నిర్నామమ్య మయ్యెను.

---

# 20. పద్మిని.

లక్ష్మణసింహుఁడు చిత్తూరుదుర్గమునందలి మేవాడు సింహాసనము నలంకరించి ధరాపాలనము గావించుచుండెను. యుద్ధాదికము లగు నుత్పాతము లేమియు లేమింజేసియు, సహజముగ రాజు ప్రజాసౌఖ్యము నభిలషించువాఁ డగుటను, దేశము శాంతిభూయిష్ఠమై యుండెను. ప్రజ లెల్లరును రాజ భక్తితత్పరులై యఖండసౌఖ్యములతోఁ దులతూఁగుచుండిరి.

భీమసింహుఁడు రాణా లక్ష్మణసింహునకు పినతండ్రి. ఆతఁడు భీమునివలె మహాపరాక్రమశాలి. వివేకమహితుఁడు. సుగుణములకు బుట్టినిల్లు. ఆతఁడు ఖడ్గవ్యాపారమున సర్వసేనాధిపతియు, కార్యాలోచనమున మహామాత్యుఁడును, బాంధవమున తండ్రియంతటివాఁడునై త్రికరణశుద్ధిగ రాణా యభ్యుదయమునే కోరుచు నాతనికి కుడిభుజమై యుండెను.

ఆతఁడు సింహాలద్వీపపు రాజగు హమీరసింహుని కూఁతురు పద్మినీదేవి యను నామెను బరిణయ మయ్యెను. ఆమె ప్రపంచమునం దెందు నంతటి చక్కని చుక్క లేదని పేరు గాంచెను. మఱియు నామె చక్కదనమునకుఁ దగినట్లు సుగుణవతియై యన్నివిధముల భర్త కనురూపయై యాతని పదదాసియై మెలఁగుచుండెను. ఇఁక భీమసింహుఁడు స్వర్గసుఖము ననుభవించుచున్నాఁ డనుటలో వింత యేమున్నది?

ఇహాలోకమున భార్యకంటె సుఖదాయక మగు వస్తువు వేఱొకటి యేమున్నది?

"భార్యా రూపవతీ శత్రు"వని యొక గ్రామిణోక్తి గలదు. ప్రాపంచికవృత్తమును విమర్శించి చూచినచో నిది యదార్థ మని చెప్పుటకు సందేహ మక్కఱ లేదు. రూపవతుల కొఱ కనేకయుద్ధములు ప్రవర్తిల్లినవి. అనేకవంశము లంతరించిపోయినవి. అనేకరాజ్యము లడుగంటినవి. రూపవతి యగుట వలననే దేవీయజనసంభవ యగు జానకి రావణాపహృత యైన దని యొక చాటూక్తి గలదు. ఎచ్చట నైన నేకారణమువలన నైన నీగ్రామిణోక్తి కెప్పుడైన వ్యతిరేకము జరుగుట సంభవించినను మొత్తముమీఁద దీనిని త్రోసివేయుటకు వలను పడదు పురాణములయందే గాక భారత దేశేతిహాసమునఁగూడ దీని కనేకోదాహరణము లున్నవి.

ఈసమయమున అల్లాయుద్దీన్ అను తురుష్కుఁడు డిల్లీని ఏలుచుండెను. ఈతఁడు ఖిల్జీవంశజుఁడు. ఫిరోజ్ అను నాతఁడు బానిసవంశమునందలి కడపటివాఁ డగు కైకుబాదు అను సుల్తానునిఁ జంపి జలాలుద్దీన్ అను పేరుతో డిల్లీశ్వరుఁ డయ్యెను. అల్లాయుద్దీను జలాలుద్దీనుని తమ్ముని కుమారుఁడు. అల్లాయుద్దీను ధైర్యసాహసములయం దసమానుఁ డగుటవలన పెద్దతండ్రి యాతని తఱుచు పెద్దపెద్ద కార్యములయందు నియోగించుచుండెను. ఇట్లు కొంత కాలము కడచిన తరువాత అల్లాయుద్దీను పెదతండ్రిని జంపి తాను డిల్లీశ్వరుఁ డయ్యెను.

పిదప నల్లాయుద్దీను పద్మిని యంతటి సుందరి యీ ప్రపంచమున లేదని వినియెను. ప్రకృతిధర్మమే మోగాని "సుందరి సుందరుఁడు" నను మాటలు రెండును వినిపించిన వెంటనే స్త్రీపురుషుల హృదయముల కొకవిధ మగు చలనము గలుగుట చూచుచున్నారము. హృదయ మన్యత్ర పని సేయునపుడు ఈచలనము పొలపొంగునవలె నంతలో శాంతించిపోయినను హృదయము సుస్థిరమై యున్నపుడుమాత్ర మంతకంతకు వృద్ధియై కామాంకురముల నుత్పాదించుచున్నది. ఆవిష్మట జరుగునదియు, జరుగుచున్నదియు విస్పష్టమే. అనేకపురుషులు సుందరు లని వినినంతనే యాస్త్రీలకొఱకు కత్తులు దూసి వేలకొలఁది జనులను సంహరించిరి. అనేకస్త్రీలు నట్లే దేవేంద్ర వైభవములనుగూడ పరిత్యజించి, యెవ రేమనుకొనెదరో యను సందియమును విడిచిపెట్టి సుందరపురుషుల కొఱకు యిలు విడిచి నిర్జనప్రదేశముల కైనఁ బోయియున్నారు అయిన మేమావిషయమున నేమియుఁ జెప్పుట లేదు. ఇఁక మా సందియ మేమనఁగా? స్త్రీపురుషుల హృదయములకు వికారము గలిగించు ఆశక్తి సౌందర్యమునందే యున్నదా? సౌందర్య శబ్దమునందుఁగూడ నున్నదా?"

పద్మిని త్రిలోకసుందరి యను మాట అల్లాయుద్దీను చెవినిఁ బడియెను. "ఆమె నీకు పత్ని కావలసినది" అని సన్నిధానవర్తు లాతనికి విన్నవించిరి. దానిమీఁద పాదుషాహాకు భావనాబలము కలిగెను. యోచనలమీఁద యోచన లుప్పతిల్లెను ఆమెను తీసికొనిరావలె నని నిశ్చయము గలిగెను.

ఎట్లు? ఈప్రశ్న నందఱును ఆలోచించిరి. "పెద్ద జాగీ రొకటి యిచ్చినచో రాజపుత్రులు స్వయముగ పద్మినీదేవిని తీసికొనివచ్చి సమర్పింతురు" అని యొకఁడనెను. "ముందు వారితో స్నేహము చేసి రాకపోకల నేర్పఱచికొని పిదప మాయచేసి ఆమెను ఎత్తుకొనిరావచ్చు" నని వేఱొకఁడు చెప్పెను. "రాజపుత్రులను బెదిరించిన అంతయు చక్కఁబడు" నని యింకొకఁడు చెప్పెను. పాదుషాహాకు ఇవి యేవియు నచ్చలేదు. కొంతసేపు తీవ్రచర్చ జరిగిన పిదప "కత్తిపట్టినఁగాని లాభము లేదు" అని నిశ్చయమయ్యెను. వెంటనే ఢిల్లీఫౌజు చిత్తూరుదుర్గమును ముట్టడించెను.

హఠాత్తుగ సంభవించిన యీయాపత్తు నారసి రాజపుత్రులు చాల కళవళపడిరి. యుద్ధకారణము తెలియక వారు తత్తరపడుచుండఁగా ఢిల్లీసరదారుఁడు ఒకఁడు వచ్చి "మేము మీకోటను బగులగొట్టి రాజ్యము నాక్రమించుకోవలె నని గాని, మీచేఁ గప్పము పుచ్చుకోవలె నని గాని రాలేదు. మీరు మీకును, మీకోటకును, మీరాజ్యమునకును సుస్థితిఁ గోరెద రేని పద్మినీదేవిని మాకిచ్చివేయుఁడు" అని పాదుషాహా సందేశమును తెలిపెను. పోవుచుఁ బోవుచు నాతఁడు "లేకున్న బలిమిని గొనిపోయెదము" అని చెప్పి వెడలిపోయెను.

కోరిక అతిఘోరమైనది. కోరినవాఁడు విజాతీయుఁడు. కోరఁబడిన వస్తువు ప్రాణములకంటెనధికము. మానభంగ మగు ప్రసంగము. తాము రాజపుత్రులు. విశేషించి బప్పారావల్ వంశమువారు. ఇఁక చెప్పవలసిన దేమున్నది? నిలిచియుండఁ

గా బురుజులమీఁది ఫిరంగులు పేల్చుట కనుజ్ఞ యయ్యెను. అల్లాయుద్దీను రాజపుత్రుల శౌర్యమున కచ్చెరు వంది యుద్ధము ప్రారంభించెను.

అటు ఆశ. ఇటు రోషము. ఆయాశను అహము పెంచెను. ఈరోషమును ఆభిజాత్యము పెంచెను. అది మతమునకుఁ గూడ కత్తియే సాధనముగాఁ గల జాతి. ఇది కత్తిపెట్టుటకే పుట్టిన జాతి. అటు పరవస్తువును హరింపఁ ప్రయత్నము ఇటు సొంతవస్తువును రక్షించుకొను పూనికపనీతి కైనను అది అక్రమమే. ఎంత మాధ్యమున నైన నిది క్రమమే. ఇంతవఱకే మానవుని బుద్ధికి అందునది. ఇఁకే జయము అటా? ఇటా?

పోరు ఘోర మయ్యెను. ఆకాశమధ్యమునకుఁ జేరిన మాహమ్మదీయుల జయాశ పశ్చిమాభిముఖ మయ్యెను. అల్లాయుద్దీను హఠాత్తుగ యుద్ధము నాపి "పద్మినిని మాకీయ నక్కఱ లేదు. ఆమె నొకమాఱు చూపితేఁ జాలు" నని రాజపుత్రులకుఁ దెలిపెను.

అపుడు రాజపుత్రులలో ఆలోచనలు ప్రారంభ మైనవి. తుదకు చూపవచ్చు నని వారు నిశ్చయించుకొనిరి. ఇది విని "నేను తురుష్కుని కంటఁ బడను" అని పద్మిని చెప్పెను. అంతటఁ బెద్ద లందఱును ఆమె చుట్టును జేరియెటో అద్దములో ప్రతిబింబము చూపించుటకు ఒప్పించిరి. ఈసంగతి తెలుపఁగా అల్లాయుద్దీను అందులకే అంగీకరించెను.

"కాముకస్య కుతో లజ్జా" యని యొక లోకోక్తి గలదు. దీని యాథార్థ్యమును గుఱించి సందేహింపవలసిన యావశ్యకము గాన్పింపదు. ఒక్కొక్కపుడు కాముకులు తమతమ

మనోహారిణుల యెడలఁ జేయు చేష్ట లాశ్చర్యజనకములు. దర్శనమాత్రమునఁ గొంద ఱానందింతురు. మాట వినఁబడినంత మాత్రముననే మఱికొంద ఱుబ్బిపోయెదరు. తమ ప్రియురాం డ్రను గుఱించి పరు లెవ్వరైనఁ జెప్పుకొనుట విని సైతము ధన్యుల మని తలఁచు మహాత్ము లున్నారు. తలుపుచాటున నుండియైన నిముస మైన ముఖమండలము కాన్పించినఁ జాలు నని విసుగు లేకుండ తఱుచుగ నావీథినిఁ దిరుగువారు వందలకొలఁది గ నున్నారు. ఆమె ధరించి పారవేసిన కుసుమమాలికలను కేవలకుసుమములను గూడ నత్యానందముతోఁ దీసి యత్యాదరముతో నాఘ్రాణించి జాగ్రత్త సేయువారు గూడ నున్నారు. ఇఁక నామె చెప్పిన పనులు చేయుటయందు మాత్రమే దినములు, మాసములు, సంవత్సరములుగూడ గడపివేసిన వారి విషయమును, భావనాబలంబుననే యామె కోర్కెల నూహించుకొని వెంటనే తీర్చువారి సంగతిని, ఏహేతువు లన నైన నామె గ్రామాంతరమునకు వెళ్లినచో తాముగు నాగ్రామమున కఁగువారిని గుఱించియుఁ జెప్పవలసిన పని మున్నది?"

యుక్తసమయమున అల్లాయుద్దీను కొండమీఁది కోటలోనికి వెళ్లి పద్మినీప్రతిబింబమును జూచెను. సంధి కుదిరెన గదా యని రాజపుత్రులు తురుష్కుని ఉచితమర్యాదలతో నాదరించిరి. మేవాడుప్రభువులకును, ఢిల్లీపాదుషహాలకును ఈస్నేహ మిట్లే యుండవలయు నని వారు మాటఁబలుకుకొనిరి. ఎల్లరచెంతను సెలవు గైకొని అల్లాయుద్దీను తన శిబిరమునకుఁ బయలుదేఱెను. కాణా మున్నగువా రెల్లరు నచ్చటనే

యుండిపోయిరి. పెద్దల యనుజ్ఞ చొప్పున భీమసింహుఁడు తురుష్కుని సాగనంపుటకు బయలుదేఱెను. వారిరువురును మందహాసవదనులై యేమేమో మాట్లాడుకొనుచు ప్రాకారములన్నియు దాఁటి మెట్లమీఁదినుండి కొండ దిగసాగిరి. ఛీ! 'తన భార్యను ఎత్తుకొనిపోవుటకు వచ్చినవానిని సగౌరవముగ సాగనంపుటయా?'

ఆమాటయు నీమాటయు ముచ్చటించుచు నడుమ నల్లాయుద్దీను "మీరొకసారి మా డిల్లీనగరమునకుఁ జనుదెంచి మమ్ము గౌరవింపఁగోరుచున్నా" మని భీమసింహునితో ననియెను. "తీరిక యైనప్పు డట్లే చేయవచ్చు" నని తురుష్కునకు భీమసింహుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. వారిట్లు మాట్లాడుకొనుచు కొండమీఁద చాల దూర మరిగిరి. భీమసింహుఁ డిక వెనుకకుఁ బోవలయు నని తలఁచి యల్లాయుద్దీనుని యసంపూర్ణవాక్యమును తానే ముగించి "యిఁక సెలవు గైకొనియెద" ననియెను. "చిత్త" మని చెప్పి చిర్నగవుతోఁ దురుష్కుఁడు మార్గముల కిరుకెలంకుల నున్న సాంద్రలతాగుల్మముల దెస దృష్టి సారించి కొంచెము దగ్గుట నభినయించెను. కనుమూసి తెఱచునంతలో నాపొదల చాటునుండి కొందఱు తురుష్కభటు లరుదెంచి భీమసింహునిఁ గదలకుండఁబట్టుకొని కాలుసేతులకు సంకెలలు తగిలించి కైదు చేసిరి.

అల్లాయుద్దీను అక్కడ నుండియే "పద్మిని నిచ్చినఁగాని భీమసింహుని విడువ" మని రాజపుత్రులకు వర్తమానము చేసెను. మఱియు నాతఁడు "అట్లు చేయకపోయినచో మఱల యు

ధ్ధమును ప్రారంభించుటయే గాక భీమసింహుని సంహారించివై చెద" మని కూడ ఆవార్తలో సూచన గావించెను.

ఈవార్త తెలిసినతోడనే కోటయందంతట నొక్క లే కల్లోలము విజృంభించెను. కొందఱు "ఇక నెక్కడి పద్మిని" యని నిరాశపడిరి. "తురుష్కుఁడు ఎంతనీతిమాలిన పని చేసె" నని కొందఱు తమ యసమ్మతిని ప్రకటించిరి. ఇంక ననేకు లనే కవిధములఁ బలికిరి; గాని అల్లాయుద్దీనుని దిట్టుటలో నొక్క రును విడిపోలేదు. అవ్వాడందఱకు నైకకంఠ్యము పొసఁగెను.

అల్లాయుద్దీనునిఁ దిట్టుట యెందులకు? భారతదేశము పరాధీనమగుటకు కారణములైన సకలసందర్భములయందును ఇట్టిస్థితిగతులే యేర్పడినవి. ఈసందర్భమును బురస్కరించుకొని విద్వాంసులైన చరిత్రకారులే కొందఱు భీమసింహాదు లగు క్షత్రియులు "అత్యుచ్ఛనీతితత్వమును పాటించిరి" అని పొగడి యున్నారు. దీని నేమనవలయునో మాకుఁ దోచుట లేదు. తురుష్కునకు పద్మినీదేవిని గోరుట మంచిదా చెడ్డదా యని యు, రాజపుత్రులకు పద్మిని విడుచుట మంచిదా, రక్షించుట మంచిదా యనియు నిప్పుడు ప్రశ్నించుకొనవలసినది కాదు రాజనీతిని విడిచిపెట్టినది తురుష్కుఁడా? రాజపుత్రులా? ఇద ప్రత్యుత్తర మీయవలసిన ప్రశ్న. చరిత్రకారుల కేరికి ఈప్రశ్నతట్టనే లేదని మేము చెప్పెదము. తట్టినచో ఇచ్చట రాజనీతియే ప్రధానము గాని సంఘనీతి ప్రముఖము గాదనుట వారు గుర్తింపలేరన్నమాట.

విజయాశ విడిచిపెట్టి "పద్మిని నొకమాఱు చూపినఁ జాలు" నని ప్రార్థేయపడిన శత్రువు ఒంటరిగా కోటలోనికి వచ్చి

నపుడు రాజపుత్రులు చేయవలసిన దేమి? అది మాపాఠకము హోశయులే సెలవీయవలసినది. మఱి మాయభిప్రాయ మేమనంగా? ముందు రాజపుత్రులు చేయవలసిన పనిని తరువాత తురుష్కుఁడు చేసెను. పద్మినివిషయమున తురుష్కుఁడు చేసిన అత్యాచారమునకు మే మాగ్రహాభరితులమే; గాని తురుష్కుఁడుమాత్ర మిపుడు తప్పు పని చేయలేదని మేము చెప్పెదము. అల్లాయుద్దీను రాజపుత్రుల కంఠములకు కటారి గుఱిపెట్టియే పద్మిని నడిగెను; గాని దోసిలి యొగ్గి ప్రార్థింప లేదు.

రాజపుత్రుల నిశ్చయ మేమి? మొదట విజయము. అది సాధ్యపడకున్న తుదకు సంఘమరణము. ఈనిశ్చయముతో నున్నవారు కోటలోనికి వచ్చిన తురుష్కుని బంధించిన ఏమి యాపదలు వచ్చునో భయపడవలసిన పని యేమియు లేదు. కేవలము వారు నమ్మి వచ్చినవానిని కైదు చేయఁగూడదు అను ధర్మసూత్రము ననుసరించి ప్రవర్తించిరి. అయితే, మన రాజు లందఱును గూడ రాజనీతిప్రసంగములయందు ధర్మాధర్మములను ప్రవేశపెట్టుటవలననే ఇట్టి గతి ప్రాప్తించినది. తురుష్కులు అట్లు గాక కేవలము రాజనీతినే యనుసరించుటచే వారికి ఇచ్చట విజయలక్ష్మి లభించినది.

ఇపుడు అల్లాయుద్దీను కలితిలేని రాజనీతి నవలంబించె ననినచో రాజనీతిజ్ఞు లెవ్వరును ఆక్షేపింప రని నమ్మెదము. ఇపుడు స్నేహధర్మముతో సాగనంపవచ్చిన భీమసింహు నాతఁ డిట్లు ద్రోహము చేయవచ్చునా? యని అత్యుచ్చనీతితత్త్వమును పాటించువారు అడుగవచ్చును. అయితే: పరభార్యను తన

కిష్మని యడుగవచ్చునా? ఇట సంఘనీతిని లేకున్న కలితీ లేని ధర్మమును అనుసరించియైనను రాజపుత్రులు పద్మినిని తురుష్కునకుం జూపవచ్చునా?

చిత్తూరుదుర్గమున భీమసింహుని గుఱించి ఆలోచనాశక్తి గలవారెల్లరును సలహాలు చెప్పసాగిరి; గాని ఒక్కటియు కార్యసాధకముగా తోఁచలేదు. మంత్రులు సేనాధిపతులు నందఱును తహతహలాడుచుండిరి. ఈసమయమున రాణా యగు లక్ష్మణసింహుఁడు పద్మిని మేడకుఁ బోయి దర్శనము వేఁడెను. అందుల కామె తిరస్కరించెను. మీకు పద్మినీదేవిని ఇచ్చివేసెదము. మీరుముట్టడి మానివేయవలసినది ఏడువందల మేనాలు పట్టఁగలపెద్ద డేరా యొకటి నిర్మింపవలసినది. పద్మిని రాణిమర్యాదలుగలది; గావున ఆమెనుసాగ నంపుటకు ఏడువందల రాజపుత్రస్త్రీలు వెంటవచ్చెదరు. ఆడేరాచెంగట మగవాఁడైనవాఁడెవఁడు నుండఁగూడదు. పద్మిని యొక్కతె మాత్రము మీకుఁదక్కునది. దక్కిన స్త్రీ లెల్లరును వెనుదిరిగి పోయెదరు" అనితురుష్కునకు వార్త నంపవలసిన" దని చెప్పి పంపెను.

ఇది విని లక్ష్మణసింహుఁడు తొలుత రిచ్చవడెను; గాని యంతలో తెలివితెచ్చుకొని పినతల్లియుక్తికి చాల సంతసించి క్షణములో ఏర్పాటు లన్నియుఁ బూర్తిసేయించెను.

అట తురుష్కుని యానందమునకు మేఱలేదు. పద్మిని నాకు తగిన రాణి. ఏడువందలు గాదు. ఏడువేల స్త్రీలు సాగనంపినను ఆమె గౌరవమునకు చాలదు. దరిద్రులైన రాజపుత్రులవద్ద ఆమెకుఁ దగినందఱు దాసీ లెట్లు ఉందురు?" అని విత-

క్షించుకొనుచు పద్మిని తన యంతఃపురమునకు వచ్చిన తరు వాత చేయింపవలసిన యేర్పాటుల నన్నిటిని ఊహించు కొనుచు రాజపుత్రులు చెప్పిన చొప్పున సకలమును సిద్ధము సేయించెను.

ఇంతలో దుర్గమునుండి పాలకులు బయలు దేఱెను. ముందు ఎడమచేతుల బల్లెమును, కుడిచేతుల విచ్చుకత్తులును గల యోధులు వచ్చిరి. వారి వెనుక నాలుగు వందల పల్లకులు వచ్చెను. పిదప ఆయుధధారిణు లగు దాసీలు వచ్చిరి. ఆ వెనుక పట్టుబురకాతో నలంకరింపఁబడిన దంతపుఁబల్లకీ వచ్చెను. దాని వెనుక మఱల ఖడ్గధారిణులును, వారి వెనుక మూఁడువం దల పల్లకులును, పిదప ఆయుధహస్తు లగు యోధులును వచ్చిరి. అల్లాయుద్దీను బ్రహ్మానందపరవశుఁ డగుచుండఁగా పల్లకు లన్నియు డేరాలో ప్రవేశించెను. యోధులు డేరాచుట్టును పహరా తలాయించిరి.

చూచుచుండఁగా కోరమీసాల రాజపుత్ర యోధుఁ డొకఁడు వచ్చి బల్లెపుకాము భూమిపై నిలిపి "పద్మినీదేవి నీయంతఃపురమునకు రాకపూర్వము ఆమెతో పదినిముసములు మాట్లాడుటకు భీమసింహున కవకాశము ఈయవలెను." ఇది కానున్న నీ దేవి యాజ్ఞ అని చెప్పెను. అందులకు తురు ష్కుఁడు "అభ్యంతర మేమి?" యని భీమసింహుని రప్పించెను. చెంత నున్న తురకసర్దారు ఒకఁడు సంగతి యంతయుఁ జెప్పఁగా భీమసింహుఁడు తొలుత రిచ్చనడెను; గాని "దయచేయుఁడు" అని రాజపుత్రుఁడు పిలువఁగా మాఱుపలుకకుండ బయలుదేఱి డేరాలోనికిఁ బోయెను.

గడువు పెట్టిన పది నిముసములును గడచిపోయెను. "ఇంకను భీమసింహుఁడు ఇవ్వలకు రాఁడేమి? ఇఁక క్షణము అయినను ఆతఁడు పద్మిని యెదుట నిలువరాదు" అని తురుష్కుఁడు గర్జించిపలికెను ఇంతలో డేరానుండి కొన్ని పాలకులు కొండమీఁదికి బయులు దేఱెను. అది చూచి "పద్మిని మాస్వాధీనము కాకుండ నొక్క పల్లకియైనఁ గదలఁగూడ" దని పాదుషాహా పలికెను. "సెల వయినచో అటకాయించెద" మని తురకసర్దారులు అడుగు ముందు పెట్టిరి. "ఇది షరతునకు విరుద్ధము" అని యొక రాజపుత్రుఁడు బదులు చెప్పుచుండఁగనే డేరాలో నుండి రాజపుత్ర యోధులు బయులు దేఱివచ్చి తురకల మీఁదఁ బడిరి. వారినిఁ జూచుటయే తడవుగ అల్లాయుద్దీ పాఱిపోయెను.

ఇది యేమి? ఇందేమియు వింత లేదు. మగవారలును ఇతికర్తవ్యతామూఢులై యున్నపుడు పద్మిని పన్నియుక్తి యిదియే పల్లకీ ఒకటికి పదార్గురు చొప్పున వచ్చిన జయా లందఱును రాజపుత్ర యోధులు. పల్లకీలలో రాజపుత్ర స్త్రీలకు బదులు ఆయుధము లుండెను. యోధులు చేర చమత్కారములలో నిది చాల గొప్పదియే; గాని యింతకు నొక గొప్ప చమత్కారము జరిగెను. ముందు గొప్ప సకులసమరము జరుగనుండఁగా భీమసింహుఁడు పల్లకీలోఁగూర్చుండి తోటలోనికిఁ బోయెను.

రాజపుత్రుల యావేశమునకు హద్దుపద్దులు లేకుండఁబోయెను. ఇదితలఁచుకొనని తలంపుగ సంభవించుటవలనను, అందును ఆకస్మికము అగుటను తురుష్కులు కత్తి పుచ్చుకొనుట

గూడ మఱచి చెట్టొక పిట్టయైపోయిరి. అల్లాయుద్దీను వెనుదిరిగిచూడకుండ ఏనుఁగునెక్కి పాఱిపోయెను. రాజపుత్రులు తురుష్క యుద్ధసామగ్రి యంతయుఁ దోఁచుకొని కోటలోనికి గొనిపోయిరి. అంతకుముందు వారు అనేకతురుష్కుల ప్రాణములనుగూడ హరించిరి.

కోటలోనికిఁ బోయినతరువాత భీమసింహుఁడు పద్మినిని ఎంతో మెచ్చుకొనియెను. రాజపుత్రు లందఱునుగూడ ఆమెను గౌరవించిరి. రాణా లక్ష్మణసింహుఁడు పద్మినికిని యోధులకును గొప్పగొప్ప బహుమతుల నిచ్చెను.

ఏమి జరిగినను అల్లాయుద్దీనునకు పద్మినిమీఁది ఆశ మాత్రము తొలఁగిపోలేదు. అగుటచే నాతఁడు ఒక సంవత్సరము గడచిన తరువాత, అనంతసేనతో మఱల వచ్చి చిత్తూరును ముట్టడించెను. ఈతడవ రాజపుత్రు లందఱును యుద్ధమున మడసిరి. రాజపుత్రస్త్రీ లందఱును పద్మినితోఁగూడ అగ్నిలోఁ బడి మానము కాపాడుకొనిరి. తురుష్కునకు పద్మినికి బదులు చితులతో నిండి నిర్మానుష్యమై యున్న కోట దొరకెను.

---

# 21. కృష్ణాకుమారి.

ఉదయపురము నేలుచున్న మహారాణా భీమసింగునకు కృష్ణాకుమారి యని యొక కొమార్త కలిగెను. ఏకపుత్రిక యగుటవలన నామెను తలిదండ్రులు మిగుల గారాబముతోఁ బెంచి విద్యాబుద్ధులు గఱపిరి. కృష్ణాకుమారి అసమానసౌందర్యమువలనను, అప్రతిమానప్రతిభవలనను రాజపుత్రస్థానమునం దంతటను ఆచిన్నవయస్సునందే మిగులఁ బ్రఖ్యాతి వహించెను.

ఇంతవఱకును ఆమెనుజూచికొని తలిదండ్రు లనుభవించిన యానందమునకుఁ బారము లేకుండెను; గాని యిప్పు డామెను జూచుచు నానందించుచుఁ గూర్చుండుట కవకాశము లేదు. కృష్ణాకుమారి యిప్పుడు వరయోగ్యయై యున్నది. ఆమెకుఁ బెండ్లి సేయవలెను.

కొమార్తలు కలుగుటవలన తలిదండ్రులకు బాధలు కలుగుటకుఁ బ్రారంభ మిదియే. తండ్రి యగువానికి వరాన్వేషణముకంటె కష్టకార్యము లేదు. తొందరపడి యేదో విధమున నిశ్చయింత మన్న కడుపార కన్న కూఁతు రేమగునో; తన మర్యాదకు, తన సంపదకు, తన కొమార్త హృదయమునకు, తన పత్ని ముచ్చటలకుఁ దగిన వరునిఁ దెచ్చుట గృహమేధి కెంతకష్టమో అది కలమువలన వ్యక్త మగునది గాదు. స్వయముగ ననుభవించి తెలిసికొనవలసినది.

భీమసింహుఁడు మంత్రులతో, పురోహితులతో, మిత్రులతో, చుట్టాలతో నాలోచించి అనేకవరులను జూచెను; గాని విద్య యున్నచోట క్షత్రియున కవసరములైన శౌర్యధైర్యములకు గొఱత పొడచూపెను. అదియు, నివియు నున్నచోట కులీనత కఱ వయ్యెను. రాజపుత్రస్థానమున అన్నివిషయములయందును ఉన్నతపీఠము లధిష్ఠించియున్న ఉదయపురపు రాణా కొమార్తెకుఁ దగిన వరుఁడు లభించుటకంటె ప్రపంచమున దుర్ఘటకార్యము లేదు.

ఎన్నిదినములో ప్రతీక్షించి ఎందరితోడనో యాలోచించి, యెన్ని సంశయములనో తీర్చుకొని, ఎన్నివిధములనో మనస్సునకు సమాధానము చెప్పుకొని, భీమసింగు తుదకు మార్వాడప్రభు వగు రాణా భీమసింహునకు కృష్ణాకుమారి నిచ్చుటకు నిశ్చయించెను.

ఉభయత్ర పెండ్లిపనులకుఁ బ్రారంభ మయ్యెను; గాని కాల మెప్పుడు నొక తీరునఁ బోదు. ఇటు వివాహమునకు సకలసన్నాహములును జరుగుచుండఁగనే అటు మార్వాడభీమసింహుఁడు వైకుంఠయాత్ర చేసెను.

మఱల భీమసింగునకు తొల్లిటి కష్టములు ప్రాప్తించెను. ఆతఁడు చేయునది లేక వడపోఁతలో మఱల వడపోఁత ప్రారంభించెను. ఇట్లుండఁగా జయపురాధీశ్వరుఁ డగు రాణా జయసింహుఁడు కృష్ణాకుమారిని తన కీయవలసిన దని వర్తమాన మంపెను. భీమసింహుఁడు కొంచెము యోచించి తుదకు వల్లె యనెను.

ఇంతలో మార్వాడసింహాసనము రాణామానసింహుఁ

డనునతఁ డధిష్ఠించెను. ఆతఁడు పూర్వపు సంగతు లన్నియు విమర్శించి "నీకొమార్త మార్వాడసింహాసనమునకు వాగ్దత్తయై యున్నది; గావున ఆమె నాసొత్తు. మేము వివాహప్రయత్నములలోఁ బ్రవృత్తుల మగుచున్నాము. మీరు సందుల కనుగుణముగా నుండవలసిన" దని భీమసింహునకు రాయబార మంపెను; గాని "ప్రయోజనము లేదు" అని భీమసింహుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

శౌర్యముగలవానికి ఇంతకంటె కోపకారణ మేమున్నది? మానసింహుఁడు యుద్ధప్రయత్నములు సాగించెను. భీమసింహుఁడును వివాహప్రయత్నములతోఁబాటు యుద్ధప్రయత్నములు ప్రారంభించెను.

గ్వాలేరు ప్రభు వయిన సిందే అటు మానసింహునకు మిత్రుఁడు. ఇటు భీమసింహునకు శత్రువు. ఆమిత్రత్వమును, ఈ శత్రుత్వమును బురస్కరించుకొని యాతఁడు "నీకొమార్త మార్వాడ రాణి యగుటకుఁ బుట్టినది. భగవన్నిశ్చయమును నీవన్యథా చేయఁజాలవు. చేయుటకుఁ బూనుకొనినచో నీప్రయత్నములు కొనసాగవు. నీవు సవ్యమార్గమును విడిచినచో నేను కత్తిపట్టవలసివచ్చును" అని కబురుచేసెను

"నన్ను జడిపించుటకు నడుమ వీఁడెవఁడు?" అని భీమసింహుఁడు రోషావిష్టుఁడై "నీకు చేతనైన పని చేసికొనుము" అని బదులు చెప్పిపంపెను.

సిందే సైన్యముతో తరలివచ్చి ఉదయపురమును సమీపించెను. గాని యింకను ముట్టడి ప్రారంభము కాకపూర్వమే యెట్లు పొసఁగెనో మేము చెప్పఁజాలముగాని సిందేయు

భీమసింహుఁడు నొక దేవాలయములోఁ గలిసికొనుట సంభ వించెను. ఉభయులును కొంతతడవు గుసగుస లాడుకొనిరి. పిదప ఎవరి విడిదికి వారు పోయిన తరుతవాత భీమసింగు "నీకు కన్య నిచ్చుట లేదు" అని జయపురాధీశ్వరునకు జాబు పంపెను.

సిందేభీమసింగుల సమావేశవృత్తాంతము జయసింహు నకు తెలియవచ్చెను. తోడనే యాతఁడు "భీమసింగుసంగతి తరువాతఁ జూతము" అని ముందుగా మానసింహునిమీఁదికి దండెత్తెను. ఇరువురును పర్వతశిఖర మనుచోట తలపడిరి. కొంత యుద్ధ మైన తరువాత మానసింహుని సైనికులు కొందఱు జయసింహునితోఁ గలిసిపోయిరి. ఈద్రోహమును జూచి మాన సింహుఁడు జాయాశను విడిచి పాఱిపోయి రోాధగడ యను దుర్గమున డాఁగుకొనియెను. జయసింహుఁడు ఆదుర్గమును గూడ ముట్టడించెను; గాని తుదకు సాధింపఁజాలక మఱలిపో యెను. ఈయుద్ధమున ఆతని వీరభటులలో అనేకులు వీరశయ్య నలంకరించిరి.

అయినను మానసింహునకును జయసింహునకును గూడ యుద్ధ మనిన నసహ్యము కలుగలేదు. ఉభయులును బలములును గూర్చుకొని ఉదయపురమునకుఁ బ్రయాణమైరి.

ఈవార్త భీమసింహునకుఁ దెలియవచ్చెను. ఇఁకఁ జేయవలసిన దేమి? ఆతఁడు కర్తవ్య మేమని యొక మిత్రుని సలహా యడుగఁగా "కన్యను మానసింహున కిమ్ము. లేకున్న నామెను సంహరింపుము. మూఁడవమార్గము లేద"ని యామి త్రుఁడు బదులు చెప్పెను. ఈరెండింటిలో నొకమార్గము తుద

ముట్టించుటయే మంచి యుపాయ మని నిశ్చయించి భీమసిం హుఁడు దౌలత్‌సింగు అనువాని నీపనికి ఆజ్ఞాపింపఁగా "నిట్టి యకృత్యమును నేను చేయ" నని యాతఁడు బదులుచెప్పెను. తుదకు యావనసింగు అను నతఁ డంగీకరించెను; గాని కత్తి దూసి యాతఁ డంతఃపురము చొచ్చిచూడఁగా కృష్ణాకుమారి నిద్రించుచుండెను.

ఆమెను జూచినతోడనే యావనసింగునకు కంప మొదవెను. "ఇంత సౌందర్యవతిని—దోష మెఱుఁగని ముద్దులబాలను జంపుటకు నేనేమి పాపము చేసికొంటిని" అని వితర్కించుకొనుచుండఁగా యాతనిచేతిలో నున్న కత్తి జాఱి క్రిందఁబడిపోయెను. అంత నాతఁడు "ఛీ! ఏమి పని యిది? నాచేతిలో నుండి యెన్నఁడును, కత్తి జాఱి క్రిందఁబడియెఱుఁగదు. ఇది భగవన్నిర్ణయమునకు వ్యతిరేకము. నేను చేయను" అని వెనుదిరిగిపోయెను. పిదప రాణా "విషముపెట్టు" మని యొక వంటవానికి నియోగించెను. వాఁడు కడుపురాయిచేసికొని విషముగొనిపోయి "యిది విషము. నీకు ఈయవలసిన దని నీతండ్రి ఆజ్ఞ" యని చెప్పి యిచ్చెను. కృష్ణాకుమారి యందులకేమియు నాక్షేపణము చెప్పక సంతోషముతో నావిషమును త్రాగెను; గాని ప్రయోజనము కలుగలేదు. ఆమె నగుమొగమున కేమియు వికారము గలుగలేదు. అంతట మఱియొక వంటవాఁడు మఱియొక గిన్నెతో మఱల విష మిచ్చెను; గాని యప్పుడును ప్రయోజనము కలుగలేదు. "ఇఁక దీనితో సరి"యని తండ్రి మఱియొక క్రూరమైన విషము నంపెను. అదిగూడ కృష్ణాకుమారి నిశ్చింతతోఁ ద్రావి యేడ్చుచున్న తల్లినిఁ జూచి "ఏడు

వవద్దు. మనము క్షత్రియులము. మరణము ప్రకృతి. జీవించుటయే వికృతి. ఎప్పటి కైనను తప్పని మరణము నాకిప్పుడే వచ్చినచో ఆనందము కాక మఱియేమి?" అని చెప్పి అంతలో విషము తలకెక్కఁగా ఆనందముతోఁ బ్రాణములు బాసెను. భీమసింహుఁడు నిశ్చింతుఁ డయ్యె.

## 22. జోధపుర రాణి.

శహాజహాను అను మొగలాయీ చక్రవర్తి డిల్లీని పరిపాలించు కాలమున ఆతనికి సామంతుఁడై జస్వంతసింహుఁ డను క్షత్రియుఁడు మార్వాడి దేశమునందలి జోధపురమును బరిపాలించుచుండెను. ఆతనికి మేవాడురాజు తన సోదరి నిచ్చి వివాహము గావించియుండెను.

శహాజహానుని కుమారులలో నొకఁ డగు ఔరంగజేబు తండ్రిమీఁద తిరుగఁబడెను. అప్పుడు ఈ జస్వంతసింహుఁడు శహాజహానుని పక్షమై అనేకపర్యాయములు ఔరంగజేబు నెదిరించి పరాజితునిఁ గావించెను. ఒకపుడు ఔరంగజేబు తండ్రిని సింహాసనభ్రష్టుని గావించుటకుఁ బోవుచుండఁగా జస్వంతసింగు మఱల నెదిరించెను. మఱల నిరువురకును పోరు ఘోరముగా జరిగెను; గాని దైవప్రాతికూల్యమువలన జస్వంతసింహునకు యుద్ధరంగమును విడిచి పాఱిపోవలసివచ్చెను.

స్థితిగతుల నుపలక్షించి యాతఁడు పలాయనము చిత్తగించి జోధపురమునకు బయలుదేఱెను; గాని పట్టణము సమీపించిన కొలఁది నాతని కాందోళన మధిక మయ్యెను.

ఆతని భార్య మేవాడు దేశాధీశుని సోదరి యని యిదివ ఱకే చెప్పియుంటిమి. మేవాడు దేశాధీశుల శౌర్యసాహసములు ప్రపంచమునం దంతటను విఖ్యాతములై యున్నవి. అట్టి శూర వంశమునఁ బుట్టిన రమణి ఇట్లు పలాయనము చేసివచ్చుచున్న తన మొగము చూచునా? యని జస్వంతసింహుని భీతి.

రాణి యందుల కనుగుణముగనే ప్రవర్తించెను. భర్త వచ్చుచున్నాఁ డని తెలిసిన వెంటనే యామె పురద్వారములు మూయించి "పరాజితుని దీనాననమును ఈపురస్త్రీలకు చూప నక్కఱలేదు." అని కబురు చేసి "జోధపురాధిపతి శత్రువులను సంహరించుటయొండె, తాను వీరస్వర్గమునకుఁ బోవుటయొండె తక్క మూఁడవపని చేయుట యిదివఱకు లేదు. అట శత్రువు నిరాఘాటముగ సంచరించుచున్నాఁడు; గాన శత్రువు లోఁగ లేదనుట నిశ్చయము; గావున చితి పేర్చుఁడు. నేను శీఘ్రముగ నాపతి ననుసరింపవలె" నని దాసీలకు చెప్పెను. ఇది విని అం దఱును నిర్విణ్ణులైరి.

జస్వంతసింగు గాయముల బాధతో పురముబైటనే యుండిపోయెను. ఇట్లు వారముదినములు గడచిపోయిన పిదప ఈసమాచారము విని రాణి తల్లి వచ్చి "క్షతగాత్రుండగుటచే అవశుఁడై చేయునది లేక యాతఁడు వెనుదిరిగివచ్చియుండును. స్వస్థుఁడైన వెంటనే మఱల యుద్ధమునకుఁబోయి జయలక్ష్మినిఁ దోడుకొనివచ్చును" అని యనేకవిధములఁ జెప్పి యొప్పించి పురద్వారములు తెఱపించి అల్లుని రప్పించెను. రాణియు భర్త యొడలిమీఁది గాయములను జూచి తన యపరాధములను క్షమింపవలసిన దని భర్త ననేకవిధములఁ బ్రార్థించి చికిత్స చేయించెను.

ఇక్కడ జస్వంతసింగు ఇట్లు వ్యాధిగ్రస్తుఁడై యుం డఁగా అక్కడ ఔరంగజేబు తండ్రిని కైదులోఁ బెట్టి కొం దఱు సోదరులను సంహరించి సింహాసన మెక్కి చుట్టుప్రక్కల విరోధుల వలని భయము లేకుండఁజేసికొని తుదకు తన విష దృష్టిని జస్వంతసింగుపైఁ బఱపెను. ఇదంతయు నగునప్పటికి సింగు ఆరోగ్యవంతుఁ డయ్యెను.

కాబూలులో ప్రజలు తిరుగఁబడిరి. వారి నడఁచి య క్కడ మఱల రాజ్యవ్యవస్థ చక్కచేయవలసియుండెను. ఇందు లకు ఔరంగజేబు జస్వంతసింగును నియమించెను. "నీసామ ర్థ్యము మాకు బాగుగఁ దెలిసియున్నది. నీవలనఁగాని యీకా ర్యము నెఱవేఱదు; గావున ఈసేనకు సర్వాధిపత్యము వహించి కాబూలునకుఁ బోయి నీవు సర్వమును చక్కఁజేసి రావలసినది" అని పాదుషాహ కబురుచేయఁగా కపట మెఱుఁ గని జస్వంతసింగు అందఱు సరదారు లుండఁగా తన కంతటి ఘనోద్యోగ మిచ్చినదే చాలు నని యుప్పొంగి స్వకీయరా జ్యమునకు కుమారుఁ డగు పృథివీసింగును రాజుగాఁ జేసి బయలుదేఱెను. రాణిగూడ యోధవేషము వేసికొని భర్త వెంట బయలువెడలెను. గడచిన యుద్ధములో కలిగిన అపకీర్తిని తొలఁగించుకొనవలయు నని వారు నిశ్చయించుకొనిరి.

వారు కాబూలుప్రవేశించునప్పటికి అంతయు నంధకా రముగా నుండెను. ఘోరజంతుసంకుల మగు గాఢారణ్యమును భేదించి కేదారముల నేర్పఱుచువాని స్థితి యెట్టిదో వారి స్థితి యు నట్టిదే యయ్యెను. అయినను వారేమియు చలింపలేదు. ఎటుచూచినను రాజద్రోహులు. రాజపురుషులను సంహరిం

చుటకు వారు చేయని ప్రయత్నములు లేకుండెను. పయిగ వారికి ఆ దేశపు గాలియు నీళ్లును భరింప వయ్యెను. కత్తివిడిచిన ఆలోచనము, ఆలోచనము ముగిసిన కత్తి. ఇట్లు కాలము గడపవలసివచ్చెను. ఇన్ని కష్టములు ఉన్నను స్వయముగ తాను గర్భవతి యయ్యును రాణి సింగును క్షణమైనను విడువక రక్షించుచు వీరపత్ని యనిపించుకొనుచుండెను.

దైవము ప్రతికూలించియుండినపుడు మనుష్యు లెన్ని పాట్లు పడినను ప్రయోజనము లేదుగదా? వారు ఆవిదేశమున ఇట్లు సకలయాతనలు ననుభవించుచు రాజ్యవ్యవస్థను చక్కఁజేయుచుండఁగా ఔరంగజేబు ఈసమయమున విషప్రయోగము చేసి జస్వంతసింగును చంపించెను. అట జోధపురములో నున్న పృథివీసింగునుగూడ ఏదో మిషమీఁద డిల్లీకి రావించి విషప్రయోగము చేయించి చంపించెను. “జస్వంతసింగు కుటుంబము మూలచ్ఛేద మయిన” దని పాదుషాహ యానందింపసాగెను.

విదేశమున ఉనికి. పతి మరణము. పయిగా పాదుషాహ క్రోధము. ఇంక నిట్టి విపత్తు లనేకము లున్నను రాణి ధైర్యమును వీడక రాజపుత్రసైనికులను వెంటనిడుకొని స్వదేశోన్ముఖ యయ్యెను! గాని స్వదేశమున అడుగుపెట్టకపూర్వమే యామె యొక మగపిల్లవానినిఁ గనియెను. ఇట్టి యసహాయస్థితిలో మగ బిడ్డ నిచ్చినందులకు పరమేశ్వరుని వినుతించి యామె శక్తి వచ్చిన తరువాత మఱల స్వదేశమునకు బయలుదేఱెను. ఆమె పెషావరుపట్టణము చేరునంతవఱకును శత్రుబాధ విడువలేదు; గాని యచ్చటకు వచ్చునప్పటికి స్వసైన్యము కొంత చేరెను.

ఆబలముతో ఆమె డిల్లీకి చేరఁగానే క్రూరుఁ డయిన పాదుషాహా జస్వంతసింగు వంశమున మఱియొక అంకురము కల దని విని "నీపుత్రుని నాకొలువునకుఁ బంపవలసిన" దని కబురు చేసెను.

ఇదివఱలో అనేకాపత్తుల ననుభవించియున్న రాణి యట్లు సేయక పిల్లవానిని ఒక వెదురుబుట్టలోఁ గూర్చుండఁబెట్టి విశ్వాసపాత్రుఁ డైన యొక తురుష్కునిచేతి కిచ్చి యొక సంకేతస్థలమునకుఁ గొనిపోయి జాగ్రత్తసేయవలసిన దని చెప్పెను. తురుష్కుఁడును రాణియెడల గల భయభక్తులవలన ద్రోహము తలఁపక పండ్లనర్తకునివలె నటించుచు సంకేతస్థలమునకుఁ బోయిచేరుకొనియెను.

రాణియు సాహసముతో మెఱయ కత్తిదూసి చేతికందిన శత్రువుల నందఱను చెండాడి కుమారుఁ డున్న స్థలమునకుఁ జేరుకొని పుట్టినింటికిఁ బోయి బాలుని పెంచి విద్యాబుద్ధులం గఱిపి పోషింపవలసిన దని సోదరున కప్పఁజెప్పెను. ఆబాలుని పేరు అజితసింగు. ఆతఁడు మేనమామవద్ద పెరిగి పెద్దవాఁడై యీడువచ్చిన తరువాత ఔరంగజేబును ముప్పుతిప్పలు పెట్టి పగదీర్చుకొని తల్లి కానందము గూర్చెను. రాణియు బ్రతికియున్నంతకాలము కష్టమనునది యెఱుఁగక కుమారుని యభ్యుదయమును గాంచుచు చాలకాలము బ్రతికి భర్తచెంతకుఁ బోయెను.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1924.

# వైదికగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆమావాస్యాతర్పణము | ... | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 3 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 | 6 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 3 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 3 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 2 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 3 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము,సస్వరము | ... | 0 | 12 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 2 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 12 |
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| డిటో సస్వరము (ఏకాగ్నికాండ) | ... | 0 | 6 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు సహా, సస్వరము. | ... | 3 | 0 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 3 |
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు | ... | 0 | 8 |
| యజుర్వేద ఆబ్దికమంత్రములు, మూలము | ... | 0 | 8 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 12 |
| డిటో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్ర టీకా తాత్పర్యము. | ... | 0 | 6 |

| | | | |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | |
| ముహూర్తదర్పణము, సటీక | ... | 2 | |
| రెట్టమతశాస్త్రము, సాంధ్ర తాత్పర్యము | ... | 1 | 0 |
| లఘుజాతకము ,, | ... | 1 | 4 |
| వృద్ధపారాశర్యము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 12 |
| వనమాల (వర్షఫణి) ,, | ... | 0 | 4 |
| వాస్తుసర్వస్వము ,, | ... | 0 | 6 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్న గ్రంథమునకు తెనుఁగు | ... | 0 | 4 |
| సర్వార్థచింతామణి, సటీక | ... | 5 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 3 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| సనత్కుమారగృహవాస్తువు, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| సనత్కుమారశిల్పశాస్త్రము ,, | ... | 0 | 4 |
| సారావళి, సాంధ్ర తాత్పర్యము | ... | 3 | 8 |
| శకునశాస్త్రము, (శిఖినరసింహశతకము) | ... | 0 | 4 |
| స్వప్నశాస్త్రము ,, | ... | 0 | 3 |
| సాముద్రికశాస్త్రము, సటీక | ... | 0 | 6 |
| డిటో తెనుఁగుపద్యకావ్యము | ... | 0 | 6 |
| హోరారత్నమాల, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 12 |

ఇంకను అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు, నాటకములు, నిఘంటువులు, నాగరిలిపి గ్రంథములు మావద్ద దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.